శ్రీ శ్రీధరాయనమః.

శ్రీవేంకటనాథ వరప్రసాద ప్రసాదిత కవితావిలాసుఁడును

లక్షణకవివర్యుఁడును

గణపవరాన్వయాంబునిధికైరవబాంధవుఁడును

అగు

వేంకటకవిచే రచియింపఁబడిన

శ్రీ

# ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము

అను

లక్ష్యగ్రంథము.

ఇయ్యది

"శ్రీమదముద్రితగ్రంథచింతామణి" పత్రికాధిపతిచేఁ

బరిష్కరింపఁబడి

శ్రీమత్సరస్వతీనిలయముద్రాక్షరశాలయందు

ముద్రితమై

పత్రికాధిపతిచేఁ బ్రకటింపఁబడియె.




నెల్లూరు.

1—8—92

క్రయంబు, రూప్యద్వయంబు.

## ప్రకటన.

మహారాజరాజశ్రీ శ్రీగవర్నరుజనరల్‌గారు కౌన్సిలులో నేర్పఱచిన 1867 సంవత్సరము నె 25 రు ఆక్టుప్రకారము యీప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసమును మేమురిజిష్టరుచేయించితిమి గాన దీని మఱియెవ్వరును ముద్రింపఁగూడదు.

1—8—92
నెల్లూరు.

వూండ్ల-రామకృష్ణయ్య,
శ్రీ "అముద్రితగ్రంథచింతామణి"
పత్రికాధిపతి.

## ఈ ప్రబంధరాజమునపై నితరుల యభిప్రాయంబులు.

---

మహారాజరాజశ్రీ "శ్రీమదముద్రితగ్రంథచింతామణి" పత్రికాధిపతిగారైన పూండ్ల-రామకృష్ణయ్యాగారికి.

ఆర్యా!

ఈనడుమ రాజమహేంద్రవరమునకుఁ బోయినపుడస్మద్గురువులగు మహారాజశ్రీ బ్రహ్మశ్రీ - శ్రీమద్వడ్డాది సుబ్బరాయనింగారితోఁదమపత్రికా ప్రతికవిషయమై ముచ్చటించుటలో వారిదిగువ నుదహరించిన విషయమును దమకు విశదపఱచమని నన్ను నియమించిరి. ఏమియనిన. ఇప్పుడు తమ పత్రికయందుఁ బ్రకటింపఁబడుచున్న "శ్రీప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసము" అను అపూర్వప్రబంధ ప్రకటనమువలన నాంధ్రవధూటికిఁ గ్రొత్తయాభరణము నలంకరించుచున్నట్లుండెననియు నందు ముద్రింపఁబడిన 808 సీసపద్యమునందలి బంధములను బ్రతిమలతో ముద్రింపించిన మెఱుఁగుపెట్టునట్లుండుననియును సెలవిచ్చిరి గాన విన్నవించితి. చిత్తగించుఁడు.

22—1—92
ఏలూరు.

ఇట్లు,
సత్తిరాజు- సీతారామయ్య,
వకీలు.

---

శ్రీ శ్రీధరాయనమః.

## శ్రీప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసపీఠిక.

(1.) ఈప్రబంధరాజ వేంకటేశ్వరవిజయ విలాసమును గణపవర వేంకటకవి రచియించెను. ఇక్కవితల్లజునితల్లి మంగమాంబ. తండ్రి అప్పయార్యుండు. నందవరీకి. అమాత్యశిఖామణి, అనఁగానియోగి. వసిష్ఠగోత్రుండు. ఆశ్వలాయనసూత్రుండు. శ్రీవేంకటనాథ వరప్రసాద ప్రసాదితకవితావిలాసుండు. కాకెపలీమజరా గ్రామమగు గణపవరగ్రామనివాసుండు. ఈకవిగ్రామణి తనపదిరెండవయేటఁ దారావళులు, మునిముని మీసము మొనయునేట యమకశతకము, యిరువదవయేట శృంగారరసమంజరి, యిరువదియేనవయేటఁ గృష్ణమల్లకథ, యౌవనమునందు బాలరామాయణ ద్విపదము, చాటుపద్యములు, పాణినిలింగానుశాసనము, రామలింగకవి నిర్ణయమును జేర్చి యొకగ్రంథము, తెలుఁగుప్రతాపరుద్రీయము, తెలుఁగురసమంజరి, అభినవాంధ్రనిఘంటువు, (యిదే వేంకటేశ్వరనిఘంటువు), ఆంధ్రకౌముది, గణయతిప్రాసలక్షణసీసమాలిక, ఆంధ్రప్రయోగరత్నాకరము, రేఫఱకార నిర్ణయపద్ధతి, షట్ప్రత్యయములప్రస్తారసరణి, యిర్వదాఱుఛందములవచనము, అలంకారసారము, పరమభాగవతచరిత్రము, ఆంధ్రద్విరూపకోశము, కల్పితకల్పలత, తెలుఁగువసంత తిలకభాణము, కఠినప్రాసశతకరాజము, ఆంధ్రప్రక్రియాకౌముది, జాంబవతీ విలాసమను చిత్రకావ్యము, చండవిద్యావతీదండకరాజము, చక్రవాళతారావళి, పురాణసారమను పేర్లంబరఁగు (25) యిరువదియైదు గ్రంథములరచియించినట్టును, యిట్టిగ్రంథ రచనవలనఁదనజిహ్వాంచలంబుతనివినొంద దనుకారణముచేఁగులదేవతావంతసమగు వేంకటేశ్వర చరణారవిందమహిమనవనవోన్మేషలేశ వర్ణనలచేనొప్పునీప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసమును రచియించినట్టుగా నవతారికా పద్యములయందు వ్రాయఁబడియున్నది. ఇక్కవి కృతకృతులలోనొక్క వేంకటేశ్వర నిఘంటువుతప్పఁ దక్కినగ్రంథములు నామావశిష్టము

లైయున్నయవి- ఈకవిచే రచియింపఁబడిన గ్రంథజాలమునకై ప్రయత్నించఁగా వేంకటేశ్వర నిఘంటువుమాత్రములభించినదిగాని తక్కినప్రబంధములు "ప్రాచ్యభాషాలిఖితగ్రంథ సరస్వతీభండారము"(ఓరియంటల్ లైబ్రెరీ) లోఁగూడా నేత్రములకగోచరములైయున్నవి- నేత్రగోచరమైనవేంకటేశ్వర నిఘంటువునుజూడఁగా నీప్రబంధరాజముననవతారికయందలి 49 వ పద్యమునఁజెప్పియుండురీతి "బిరుదుగద్య" అనిఘంటు కడపట నివ్విధముగా వ్రాయఁబడియున్నది.

"ఇది శ్రీమత్పెరుంబుదూరి యతిరాజాచార్యవర్య కరుణాకటాక్ష సంప్రాప్తాంధ్రకవితా సామ్రాజ్య ధురంధర, నీతియుగంధర; నందవరకుల కలశజలధిపూర్ణిమాచంద్ర, సత్యహరిశ్చంద్ర ; వాసిష్ఠగోత్ర పవిత్ర, ప్రశస్తాశ్వలాయనసూత్ర; కార్యఖడ్గప్రవీణ, కామినీజనపంచబాణ, కర్ణాటకుండీర పాండ్యమండలాధీశప్రముఖాఖిల మహీమండలాఖండల దత్తమత్తసింధురసైంధవాందోళికా చిరత్నరత్నాంబరాదివస్తు ప్రశస్తమందిర, నిరంతరవసంతేందిందిర; సకలకలావిచక్షణ, నిఖిలశుభలక్షణ; లక్ష్మణకవి వేంకటపత్యమాత్య వరవిరచితమ్మును, మంగమాంబాసమేతగణపవరాప్పయమంత్రిమణివిఖ్యాతవజ్జపకరూపాల్మేల్మంగాసనాథ తిరువేంగళనాథాంకితంబును, నగువేంకటేశ్వరనిఘంటువు'

(2.) ఈగ్రంథకర్త అధునాతనకవి వర్గములోనివాఁడు. శ్రీకృష్ణరాయల సభాసదులగుముక్కుతిమ్మనాదులఁదానవతారికయందలి 34వ పద్యమున నుదహరించిన కారణముచే నితను శ్రీకృష్ణరాయలకు-నీవలివాఁడగుటకు సందియములేదు. అనేకగ్రంథ శోధకుండగు కాకునూర్యప్పకవి వర్యుండు తనలక్షణగ్రంథమగు "అప్పకవీయమున" నిట్టిగ్రంథమునుగూర్చి యెచ్చటనుదహరించనందున నితను అప్పకవికిని యీవలివాఁడని యూహకట్ట నవకాశమిచ్చుచున్నది. తనకుముందే వ్రాయఁబడియున్న "హరిశ్చంద్రనలోపాఖ్యానమును" నప్పకవి తనగ్రంథమున నుదహరించలేదని యొకకళంకమును నప్పకవీందునియందుఁ జూపుదురేమో,

దానికేదేని మఱియొందు కారణముండుఁగాని, యిట్టిగొప్ప లక్షణగ్రంథ మొకటితనకుముందే యుండియుండిన నప్పకవి దానిఁదాకకమానఁడు గదా. ఇంతియగాదు. అప్పకవి తనగ్రంథమునందు ననేకలక్ష్యలక్షణాంశములఁబ్రశంసించుటచే నిదితనకుఁ బ్రాచీనగ్రంథ మేమైయుండిన దీనిను దహరించియుండునని మఱియొక యూహకట్టుచున్నది. అప్పకవికి నీవలి లాక్షణికులగు కూచిమంచితిమ్మనాదులు వ్రాసిన లక్షణగ్రంథములయందు దీనింబేర్కొనిరో లేదోనిర్ణయించి వ్రాయుటకు మాకాగ్రంథములులభించనందున మాయభిప్రాయముఁ బ్రస్తుతమువ్రాయ విరమించి మామిత్రసమితికిదీనిఁదీర్మానించుటకుఁగా విడిచిపెట్టుచున్నాము. శ్రీమాన్ - బ. పీ తారామాచార్యులవారు తమనిఘంటువున " అప్పయ వేంకటపతి- ఇతండు ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసమను నొకపెద్ద లక్షణగ్రంథమునువ్రాసినాఁడు- "అనివ్రాసియున్నారు. ఇదిలక్ష్యగ్రంథముగాని యాచార్యులవారు వ్రాసినరీతిలక్షణగ్రంథము గాదు.

(3.) నన్నయ. పెద్దన- యెఱ్ఱన- తిక్కన- వీరన- తిమ్మన- పెద్దనాదులవలె నిక్కవిరాజా శ్రయుండై తనగ్రంథముల నరాంకితములు సేయక నారాయణాంకితములుగాఁజేసి మనినధన్యుండు.

౧."ఉ॥ ఇమ్మను జేశ్వరాధములకిచ్చి, పురంబులువాహనంబులున్
సొమ్ములుగొన్నిపుచ్చుకొని, సొక్కి, శరీరమువాసి, కాలుచే
సమ్మెటవేటులంబడక, సమ్మతిశ్రీహరికిచ్చిచెప్పెనీ
బమ్మెరపోతరాజొకఁడు, భాగవతంబుజగద్ధితంబుగన్"॥

౨."ఉ॥ బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకన్
గూళలకిచ్చియప్పడుపుగూడుభుజించుటకన్న, సత్కవుల్
హాలికులైననేమి, గహనాంతరసీమలఁగందమూలగౌ
ద్దాలికులైననేమి, నిజదారసుతోదరపోషణార్థమై"॥

అనిశాసించినబమ్మెరపోతనయు నొకానొక కారణముచే శ్రీవేంకటగిరిప్రభువులలో నొక్కరగు సర్వజ్ఞచినసింగమనాయఁడుంచుకొన్నవేశ్యనుగుఱించి " భోగినీదండకము " వ్రాసితద్రాజాంకితముజేసినట్లెనగను

పడుచున్నదిగాని, యిక్కవి తనగ్రంథములనన్నిటిని వేంకటేశ్వరస్వామికినర్పించినమహాపురుషుండు. లక్ష్మీసరస్వతులొక్కచోనుండరనునానుడియిక్కవిపట్టునదబ్బఱయైనది - ఎట్లనఁగానీగ్రంథమందలియవతారికయందు వ్రాయఁబడిన 27వది యగువచనమందుఁజూడ "అనితలంపుచునొక్కనాఁడు...సత్యవాక్య ప్రతిష్ఠాగరిష్ఠుండును, కాశీసేతుమధ్యస్థలప్రసిద్ధనిజచరిత్రుండును, కృతసుధీజన స్తోత్రుండనగు నేనునిత్యకృత్యంబులుదీర్చి... బహువిధభోజనానంతర మూల్య జాంబూనదాంబరసారగంధసార రుచిరవిచికిల ఘనసార తాంబూల ప్రియకామినీసంగీతగోష్ఠీ సుమశయ్యావ్యాప్తభోగాభోగ సంగతుండనై హంసతూలికా తల్పంబున వేకువఁ దేకువసుఖసుప్తినున్న సమయంబున." అనివ్రాసియుండుటఁబట్టి యిక్కవి మహీమండలాఖండలుండని చెప్పనొప్పుచున్నది. మనమువిన్నంతకన్నంతఁ దనుకకవులని పేరఁ బెట్టుకొన్నవారందఱు నశనవసనములకు దూరస్థులైయుండు కారణముచేత నిక్కవి తనవిషయమైవ్రాసుకొన్న విషయమునుగూర్చి కొందఱికి సందియంబుగలుఁగునేమో అట్లుసందియముపడబనిలేదు ప్రస్తుతముక్కవివృత్తాంతము మనకు కర్ణగోచరముగానుండినను బ్రత్యక్షముగ నేత్రగోచరముగనుండున క్కాలపు పండితపామరులయెదుటనిట్టిబద్ధులగు సుద్దులువ్రాసి తానులోకము ముఖమెట్లుఁజూచుచుండును. ఇట్టిబొంకులొకవేళఁ దాఁ దెంపరితనముతోవ్రాసినను నూటికొక్కఁడైన దీని నిజమును బయలుపరచియుండఁడా? ఎటులదానినిజము బయలుపఱిచియుందురందురేమో, భోజ చరిత్రమును, కృష్ణరాయలచరిత్రమును, వారివారి యాస్థానకవుల చారిత్రములను, వారువారుచేసినచాటువులను జాటువులకు సంబంధించినకథలనుమనమిప్పుడెటుల "గతానుగతికోలోకః." అనుసామెతరీతి వంశపారంపర్యముగాఁదెలిసికొనుచున్నామో యటులనే యిక్కవి వ్రాసినది నిజముగానిపక్షమున్న నితనికింతప్రసిద్ధి రానేరదు. అట్టిచాటువులుగాని కథలుగాని యితనిసంబంధమైనవి మనము వినియుండలేదు. కాఁబట్టి యితనువ్రాసినదంతయు నిజమనినమ్మవలసియు

న్నది. ఇతనియైశ్వర్యమేనిజమని యొకవేళనొప్పుకొన్నపక్షమున నిట్టిభోగాభోగమదాంధునకు విద్వత్తెటుల సంభవించినదందురేమొ, యింతకన్నమిన్నగ సుఖమనుభవించు రాజ్యపరిపాలకులగు వేంకటనాథుఁడు శ్రీభోజరాజు రేచెర్లమాధవరాజు, శూద్రకుఁడు, శ్రీకృష్ణరాయలు, శ్రీబొబ్బిలిశ్వేతాచలపతి రంగారాయఁడులోనగువారు తాముపండితులుగాఁ గవులుగానుండుటమనకు దెలిసినవిషయమేకదా. కాఁబట్టి యిక్కవియు నట్టివారిలో నొక్కఁడని నిస్సంశయముగఁజెప్పనొప్పు. ఇంతియగాక నితఁడు ద్వాదశీవ్రతనిష్ఠాగరిష్ఠుండు. శ్రీదర్వికరేంద్రాద్రిరాయనికింబ్రీతిగ బ్రాహ్మణసమారాధనము జేయువాఁడు. ఇట్టిశుభలక్షణలక్షితునకుఁగాక నితరులకిట్టి కవిత్వం బబ్బునన్న నబ్బురంబుగదా.

3. "చ॥ నిరుపహతిస్థలంబు, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చుక
ప్పురవిడెమాత్మకిం పయినభోజనముయ్యెలమంచమొప్పుత
ప్పరయురసజ్ఞులూహఁదెలియంగలపాఠకలేఖకోత్తముల్
దొరకినఁగాకయూరక, కృతులొచియించుమటన్నశక్యమే"॥

అని యల్లసానిపెద్దకవి నుడివినరీతి నీకవి యిట్టియైశ్వర్యవంతుఁడు గనుకనే యిట్టిప్రబంధలలామము నొనరించికీర్తిచే మించియున్నవాఁడు.

( 4. ) ఇక్కవి తనగ్రంథమునందుఁదననివాసగ్రామముతప్ప నితరవృత్తాంతమును వ్రాయనందున నితనిదేశమెద్దియైనదియు నేసంవత్సరమున నీప్రబంధమును వ్రాసినదియుఁజెప్పుటకుఁ గించిత్తైనను నాస్పదముగనుపడలేదు. గ్రంథమున నవతారికలో 41 వ, పద్యసీసపాదమందు "కాటెపలీ ముఖ్య గణపవర గ్రామశేఖర శిష్టవసిష్ఠగోత్ర" మనిమాత్రము వ్రాయఁబడియున్నందునఁ గాటెపలీమజరాగ్రామమగు గణపవరమితనిస్వ గ్రామమని యేర్పడుచున్నది. ఈగణపవరమెచ్చటనున్నదని విచారించఁగా నీమండలములో నుదయగిరి తాలూకాలోనున్నట్టునచ్చటఁబూర్వము కవులెవ్వరో నుండినట్టు కొందఱుబటాజులు చెప్పెదరేగాని, యిక్కవి యచ్చటజీవించియున్నట్టు వారుచెప్పటఁగానము. ఇంతియగాక

కొన్నితాళప్రతులయందు "గామెపలీముఖ్యగణపవరగ్రామ" మనివ్రాసియున్నది. ఆపక్షమునఁ గామెపలియను గ్రామము అప్పకవి నివాసగ్రామమైయున్నది. ఇదిమానుండలములోని కందుకూరు తాలూకాలోనిది. ఇంతైనను నిక్కవి వృత్తాంతముఁ జెప్పువారులేరు. వెండియు గోదావరిజిల్లా తణుకువీరవాసమునందు గణపవరమని యొకగ్రామమున్నది గాని యచ్చటను నీవృత్తాంతమేమియుఁ జిక్కినదికాదు. బట్టురామరాజభూషణకవి వసుచరిత్రమునందుఁ దనవృత్తాంతమును వ్రాయక హరిశ్చంద్రనలోపాఖ్యానమున వ్రాసినట్టుగా నిక్కవియుఁ దక్కిన తనగ్రంథములయందుఁ దనయుదంతమేమైన వ్రాసియుండునో విచారించుఁడు.

(5.) ఈగ్రంథముయొక్క అవతారిక, 13 వ పుటయందలి "వక్ష్యమాణలక్ష్యవిశేషోద్దేశవచనము" నందుదహరించినగ్రంథములను లోకమునకుఁదనగ్రంథోపయోగమును జూచినప్రతిహతముగా నిట్లువ్రాయఁ దొరకొన్నవాఁ గేమి నగుపడలేదు. ఇంతయేల. వచనాంతమునందు "ఇదానీంతనసత్కవి నికాయంబునకుసహాయంబును, భవితవ్యకవికలాపంబునకు నాచార్యరూపంబును, సకలభాషావిశేషంబుల కున్మేషణంబును, మూఢజాతులకు బోధహేతువును, ప్రౌఢతతికి సమ్మతియును, సర్వజనకరంబునకాశ్చర్యకరంబును" అనులోనగు సమాసకలాపమ్ములచేఁ దనకవితాకన్యనలంకరించి యున్నాఁడు. కావ్యరత్నమని పేర్కొంచిన వసుచరిత్రయందు రామభూషణుఁడు "సనాతనాధునాతనాఖిలమహాకవిజనానుగ్రహంబునఁ బురాతనపుణ్యశ్లోకరాజర్షివర్ణనాకర్ణనోత్కంఠిత సకలజనసేవ్యంబగు నొక్కమహాకావ్యంబు రసోచిత చమత్క్రియాకల్పనాకల్పభవ్యంబుగా నొనరింపఁబూని" అనియు, నరసభూపాలీయమునందు మూర్తిగారు "ఉదంచితవిరించి సంచితప్రపంచ చరదభంగబుధపుంగవహృదయంగమంబు, గంభీరరససముజ్జృంభిత కవితాంభోధితరణకరణప్రగుణోపకరణపరిణత తరణిప్రకాండంబు నశేషగుణదోషవిశేషమరాళరనీరక్షీరవివేచనోచిత ప్రశంసితహంసాయమానప్రతిభాను

బంధంబగు నొక్క ప్రబంధంబు నిర్మింపంబూనియున్న సమయంబున" నని యువ్రాసి యున్నారుగాని, యీప్రబంధరాజములోని వచనమువలె నె వ్వరును శాసించియుండలేదు. ఈగ్రంథద్వయమిప్పుడు మీకరహస్తామల కముగాన నిందలి గుణాగుణములను మీరే గ్రహించునది.

(6.) ఈగ్రంథముయొక్క అవతారికయందలి 28వ, పద్యము నందు నిక్కవి సుఖసుప్తినున్నసమయంబున వేకువజామువేళ చాలవేంట శౌరి ప్రత్యక్షమై నీవొనరింపబూనిన ప్రబంధరాజమును దనకంకితముఁ జేయుమనినట్టునందునకిక్కవి సమ్మతించి శ్రీవేంకటేశ్వరునికి గ్రంథం బంకితంబిడినట్టు వ్రాయఁబడియున్నది- ఇట్లుసుషుప్తిసమయములఁ దమ తమ యుపాసనాదైవములు ప్రత్యక్షమైనట్లనేకగ్రంథకర్తలు వ్రాసియు న్నారు-విరాటపర్వమునందుఁదిక్కనయజ్వయు, విష్ణుచిత్తీయమునందుశ్రీ కృష్ణరాయలు, మొదలగువారు వ్రాసియున్నారు- ఇదంతయునిక్కాలపు వారికి హాస్యాస్పదముగానున్నందుకు మిగులఁజింతిల్లుచున్నాము- ఇది యొకరినిజూచియొకరు వ్రాసెదరేకాని నిక్కపుభక్తి తాత్పర్యముగా దని కొందఱిదివఱకేవ్రాసి యచ్చొత్తించియున్నారు- అదిచూచినప్పు డెల్లను మామన మెఱియుచున్నది- ఎంతటిభక్తి పరత్వములేనిదే, యెం తటి దైవోపాసనలేనిదే, కేవలవిద్య కవితాంభోధిఁ దరింపలేదనియుఁ గించిత్తైనను దైవోపబలమవశ్యకమని మాయభిప్రాయము. ప్రశస్తులైన కవులందొఱు తమకొకయుపాసనాదైవమున్నట్టు వ్రాసియేయున్నారు- ఇట్లువ్రాసినవారివ్రాఁత యంతయునసృతవ్రాతమని వ్రాసినవారికెట్లుచే యూడెనో తెలియదు. ఇంతయేల- ఇఁకసముఖమునరాయబారమెందుకు, శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులవారు తమనిఘంటువగు "శ బ్దరత్నాకరమున" భాషావిషయమై ప్రశంసించుచు "అయినను వీరు కవిత్వంబుజెప్పఁబ్రారంభించినచో గతానుగతికోలోకః అన్నట్లందఱు నొక్కమార్గమవలంబించియున్నారు- అయ్యదిహాస్యాస్పదంబుగనున్నది. అదియనఁగా స్వప్నంబుగాంచుటలోనగునది- వారిభక్తితాత్పర్యమెట్టి

చో అదియటుండనిందు " అనివ్రాసియున్నారు. ఆరయుఁడు.

(7.) ఆంధ్ర ప్రబంధములలో నాశ్వాసములనియుఁ నుచ్ఛ్వాసములనియు నుల్లాసములనియుఁ దరంగములనియు నంశములనియు ననేకవిధములుగాఁ బ్రతికృతియు విభజింపఁబడియున్నది గాని యీప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసమువలె గ్రంథమునంతయు నేకాశ్వాసముగా విరచింపఁబడినది యిదివరకు దృష్టిగోచరముగాలేదు- అనేకవ్రాఁత ప్రతులఁజూచితిమి గాని యెన్ని ప్రతులుజూచినను నేకాశ్వాసమనివ్రాసియేయున్నది. ఈ గ్రంథమునందు 882 పద్యములున్నయవి. ఇన్నిపద్దియములను నొకయాశ్వాసమని చెప్పుటకంటే వీనివిభజించి వ్రాసియుండినఁ జదువువారలకుఁ గొంతగుర్తెఱింగిప్పుటకు వసతిగలిఁగియుండును. అట్టివసతి నిసుమంతైన నిక్కవి కల్పించినవాఁడుకాఁడు- కారణమెయ్యేదియో విచారించుకొనుఁడు-

(8.) తెలుఁగుఁ గబ్బములలో నాశ్వాసాంతములయందుఁ దమతమ వృత్తాంతమును దెలుపు గద్యములను గవులు వ్రాసియున్నారు. అట్టిమార్గ మవలంబించక యిక్కవి యేకాశ్వాసమగు నీగ్రంథాంతమందు- 883 పద్యముగు " చ॥ గణపవరాన్వయాంబునిధికైరవబాంధవుఁడు " అనిపద్యమువ్రాసి గద్యమును వ్రాయనందున నితనికి నిట్లువ్రాయుటకుకారణమెయ్యదియని విచారించఁగా శ్రీకృష్ణరాయవిరచితమగు " ఆముక్తమాల్యద లేక విష్ణుచిత్తీయమను " కావ్యలలామమునందును, నాశ్వాసాంతములయందుఁ బద్యములే వ్రాయఁబడియున్నందున గణపవర వేంకటకవిగ్రామణికి నాధారమగుపడినది- ఇట్లువ్రాయుటకు వీరికేమియాధారమో విచారించునది- ఈవల మామండలములోని శ్రీవేంకటగిరి సంస్థానమునందు నూతనముగ వెలువడిన " శ్రీరాధా కృష్ణసంవాదమను " నొకప్రౌఢకావ్యమందు బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రులవారు, వారిగ్రంథమునందు గద్యమునువ్రాయుట విరమించియీక్రిందవ్రాసినవిధముగఁ బద్యమునేవ్రాసియున్నారు-

౮. "మ॥ ఇదిశ్రీబొబ్బిలిరంగరాయవసుధాధీశోత్తమాకారశౌ
రిదయామండిత మండపాకకులజ శ్రీపార్వతీశాఖ్యమ
ద్వదనావిష్కృతగద్యపద్యమయరాధాకృష్ణసంవాదసం
జ్ఞదిద్యుత్సుప్రియకృత్కృతిందనరునాశ్వాసంబుదానాద్యమై"॥

(9.) ఇక్కవి యొకగొప్ప లాక్షణికుఁడు - తానునేర్చినలక్షణములకన్నింటికి లక్ష్యముల నీగ్రంథమునం దుదహరించియున్నాఁడు. ఆంధ్రభాషలో లక్ష్యలక్షణములను దెలుపుగ్రంథములాంపు రెండుగానివిశేషములులేవు - అవియనఁగా "కావ్యాలంకార చూడామణియు, నరసభూపాలీయము" అనునవి. ఇందుమొదటిగ్రంథమును విశ్వేశ్వరుఁడను ప్రభువుపై విన్నకోటపెద్దనయను మహాకవి యంకితంబిచ్చియున్నాఁడు- ఇద్ది బహుపురాతనగ్రంథము-ఇయ్యది పోతన శ్రీనాథాదుల కాలమునకు శ్రీకృష్ణరాయలవారి కాలమునకుఁ బూర్వమునవ్రాయఁబడినది - ఇందు వ్యాకరణవిషయము, అలంకారవిషయము, ఛందశ్శాస్త్రవిషయము, కావ్యలక్షణము, నాయక నాయికాది గుణములు, బంధకవిత్వ గర్భకవిత్వచిత్రకవిత్వాదివిషయము వ్రాయఁబడియున్నది - ఇఁక రెండవగ్రంథమున రసభూపాలీయ మిప్పుడు ముద్రితమైయున్నదిగాన దీనినిగుఱించి మేము విశేషముగ వ్రాయఁబనిలేదు - ఈరెండులక్షణగ్రంథములును నరాంకితములగుటచే నిక్కవి తానొక లక్షణగ్రంథమును వ్రాయఁదలపెట్టియు నిదివఱకే యిద్దఱులాక్షణికులు లక్ష్యలక్షణములు వ్రాసియున్నను లక్ష్యములగు పద్యములు నరస్తుతులనియెంచి వానిని నోరగుశ్చమన సురాక. తాను మరలఁగ్రొత్తలక్ష్యములగు పద్యములనుమాత్రమువ్రాసి, వానిని శ్రీవేంకటేశ్వరస్వామికి నంకితంబిచ్చి యీగ్రంథమునువ్రాసియున్నాఁడు - ఇదికవియభిప్రాయముగానినాడు తాఁదిరుగ లక్షణమును గ్రంథమునందు వ్రాసియేయుండును - కాఁబట్టి యీగ్రంథమందుండులక్ష్యములగు పద్యములకన్నిటికి లక్షణమిదియని కవియేవ్రాసియున్నాఁడు గాని, యాలక్షణమును వివరించియుండలేదు - కానమఱియొక గ్రంథమునుంచి లక్షణమునుదెలసికొని యిందలిలక్ష్యమును గ్రహింపవలయును-

( 10. ) ఈగ్రంథమునందు గర్భకవిత్వము బంధకవిత్వము చిత్రకవిత్వము - విశేషముగ వ్రాయఁబడియున్నది - ఆంధ్రగ్రంథములలో నీకవిత్వసంబంధమగు పద్యములనేకములు వ్రాయఁబడి యున్నవిగాని వానికన్నింటికి లక్షణమెచ్చటను గానఁబడదు - కావ్యాలంకార చూడామణియందుఁ గొన్నిబంధములకు లక్షణము వ్రాయఁబడియున్నది- ఈగ్రంథమిప్పటికి నముద్రితమగుటచే దీనియందలి విషయములు లోకమునకందని మ్రాని పండ్లైయున్నయవి - ఇఁకముద్రింపఁబడియుండు నరసభూపాలీయమునందైనను నాలవ యాశ్వాసమునందు "అష్టదళపద్మబంధచక్రబంధములకుఁ" దప్పఁదక్కిన బంధములకు లక్షణమెచ్చటను గనుపడదు.-ఈప్రబంధరాజమునందు బంధములన్నియు నఱువదికి (60) మించియున్నయవి - ఈబంధముల నన్నిటిని యీకవి వానివాని స్వస్వరూపములతో లిఖించియున్నాఁడు. అయ్యవిముందు ముందుఁ బ్రకటింపఁబడు. ఈకవిత్వలక్షణము పండితులకే తెలిసికొనుట కసాధ్యమగు పనియైనందున "బంధములు" అని పేర్కొనినపుడెల్లఁ బామరులు "రతిబంధములు" అనివాని నన్వయించుకొనుచున్నారు . మనుచరిత్రయందు నల్లసాని పెద్దన్నగారు గద్యమునందు "చతుర్విధకవితా మతల్లికాల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్యప్రణీతము" అనియు, వసుచరిత్రమునందు రామరాజభూషణకవి "సంస్కృతాంధ్రభాషా సామ్రాజ్యసర్వంకషచతుర్విధకవితా నిర్వాహకసాహిత్య రసపోషణ రామభూషణప్రణీతము" అనియు వ్రాసుకొనియున్నారేగాని వారు వారివారి గ్రంథములందొక్కటైనను బంధకవిత్వ గర్భకవిత్వములను గూర్చి యొకపద్యమైనను వ్రాసియుండరైరి. ఇందుకుఁగారణము విచారించుకొనునది.

(11.) ఈగ్రంథము కథాప్రారంభము మొదలుకొని వెంకటాచల పట్టణవర్ణనము, నలిబిలిగోపురాదివర్ణనము, స్వామిపుష్కరిణివర్ణనము, బయకానికోనపాండు తీర్థాకాశగంగాదుల వర్ణనమును, వేంకటశైలవర్ణనమును, శ్రీవేంకటేశ్వర స్వామివర్ణనమును, శ్రీవారివాహ్యాళి

వర్ణనమును, తిరునాళ్లమహోత్సవాదివర్ణనమును, మొదటి 58 పద్యములవరకు వ్రాయఁబడియున్నది -అదిమొదులుసాయంతనవర్ణనాదులు, జాతివార్తలు, స్వామివారియెదుట జరుగుసంగీతము మేళములవర్ణనములు, లోనగువృత్తాంతములు 112 పద్యములువరకు వ్రాయఁబడియున్నది- తర్వాత ప్రభాతవర్ణనాదులు చెంచునాయకులతో శ్రీవారివేటసన్నాహవర్ణనాదులు 240 పద్యములవఱకు వ్రాయఁబడియున్నవి - అవ్వలశ్రీవారి కేలిడేగ యాకాశరాజచంద్రుని సుతయగు నాంచారుదేవియుపవనమునవ్రాలుటయుఁ దోడ్తోనశ్రీవారచ్చటికి మంత్రిసహితుఁడైవిచ్చేసియవ్వేలంది యుదంతమరయుటకు మత్రిఁబంపఁగా నతనివలనఁ దానామెవృత్తాంతమువిని యవ్వేలఁదినిజూచి వర్ణించుటయుఁ దర్వాత నాకాశరాజు మంత్రివలన వేంకటేశ్వరస్వామివారి యభిప్రాయమెఱింగి తనసుతనిచ్చి వివాహంబొనర్చి స్వగృహమునకునగతనయయగు దనతనయునఃబంపునపుడు తోవలోస్వామివారికిని నాగదత్తుఁడను చోరునకునుయుద్ధము సంప్రాప్తమగుటయుఁజోరవ్రజంబు స్వామిపుష్కరిణింబడి సారూప్యంబందుటయు నష్టదిక్పాలకులు శ్రీవేంకటేశ్వరస్వామిని స్తుతించుటలోనగుపద్యములచేఁ దక్కినగ్రంథంబంతయునొప్పుచున్నయది- ఈగ్రంథమునందుఁగథవిశేషముగవ్రాయఁబడియుండలేదు - అయినను తననేర్పఱితనమును లోకమునకుఁదెలుపుటకై కవి యిదియొకవ్యాజముగల్పించుకొని యిట్టిలక్ష్యగ్రంథమును వ్రాసియున్నాఁడు.

(12.) ఈగ్రంథమునందు దచ్చటచ్చట రేఫ శకటరేఫములకుయతిప్రాసములయందు మైత్రిచెప్పఁబడియున్నది. ఇక్కవి "నిఖిలరేఫఱకారనిర్ణయపద్ధతి" అనుగ్రంథమును దావ్రాసి నట్లవతారికయందలి 37 వ పద్యమందు వ్రాసియున్నాఁడు. నిఖిలరేఫఱకార నిర్ణయపద్ధతియనుగ్రంథము మాకుఁజిక్కనందునఁ గవియభిప్రాయమిదియని నిర్ణయించి వ్రాయుటకుననువుపడలేదు. అయిననునీగ్రంథమాద్యంతమునుబరిశీలింపఁగా నచ్చటచ్చట రేఫ శకటరేఫములకు యతిప్రాసములయందు మైత్రిసిగలుఁ

గఁజేసి యుండుటఁబట్టి వీనిసాంకర్యమున కిష్టపడినవారిలో నీయనయునొక్కండనితోఁచుచున్నది. ఈవిషయమై మనమితని నిందింపఁబనిలేదు. గజకచ్ఛపపోరుంబోలిన దీనిపోరు మొదటినుంచి మించియేయున్నది - "రయోస్తునిత్యంస్యాత్" అనినన్నయసూత్రము వ్రాసినది మొదలుగ వేములవాడ భీమకవి దానికి మొదటిశత్రువుగ నేర్పడె - అదిమొదలుకొని యిప్పటివఱకును రెండువిధంబులుగఁ గవులువ్రాయనవలంబించిరి . భీమమార్గావలంబకులు దీనిసాంకర్యమునకిష్టపడిరి. తదితరులునన్నయత్రోవం ద్రొక్కిరి - కొందఱులాక్షణికులు వీని నియమమవలంబించుట కష్టతరంబగుటఁబట్టి భారతమునందు

“ క॥ తెంపును జెంపును గదురని । లింపులువెఱగందిజూడరిపుసైన్యములున్
గంపింపఁదమబలంబులు । ఱంపిలిబిట్టార్చిసింధురాజుండాఁకెన్ ॥”

యీపద్యమున్నదనియుఁగూడావ్రాసియున్నారు - ఈపద్యముభారతమునందేపర్వమునను న్నదియోవారుస్పష్టముగవ్రాయరైరి - మేమెన్నిపర్యాయములు భారతము వెతకినను వ్రాఁత యందిదిగనుపడలేదు-ఒకవేళనున్నదనుకొన్ననుసూత్రమువ్రాసిననన్నయవ్రాసినపద్యము కాదుఇదితిక్కనవ్రాసినభాగములోనిదైయున్నది. సూత్రవిరోధముగ నన్నయరేఫసాంకర్యముచేసెననుమాట లోకులునమ్మరనిక కవిత్రయ మతమునం దెందున్నది యాదరణీయమ్ముగనుక యీపద్యము నితరులెవ్వరో వ్రాసి భారతమునఁ జేర్చి యుందురు. అట్లుగానిచో ఱలలకు యతులయందొకపద్యమునందే సాంకర్యమగుపడుట మాకుమిగుల నబ్బురముగనున్నది - కొన్ని తెలుఁగు ప్రబంధములయందువీనిసాంకర్య మగుపడు కతన నిట్టివివాదసమయమున వానినుదహరించి వ్రాయుట యొక పాండిత్యాతిశయముగాదు - సూత్రవిరోధముగనుండు ప్రయోగములమిగులనూర్జితపరుచుటకన్నసూత్రానుసారముగనుండు ప్రయోగముల నూర్జితపరుచుట మేలు. ఇక్కడియును 442 వ పద్యమునందు వ్రాసిన యసంయుతయతినిగుఱించి చింతించి యింతదూరము వ్రాయవలసివచ్చినది. ఇక్కాలపు పండితులలో నొకరిద్దఱు దీనింగూర్చి యివ్విధముగవ్రాసియున్నారు - ఎట్లనిన.—

౪" తే.గీ॥ అరసములశబ్దచిత్రంబులనియతద్వి । రేఫవృత్తులుదుష్కవికృతకృతితతు
లెండినకొలంకులంబులెనింపుఁగనమి। సుకవివారంబువానిఁ గాంచునెయొకింత॥"

౬." క॥ అయ్యుద్విరేఫశిరోజులు । చయ్యనవిగతద్విరేఫచర్చలగుదుర
య్యయ్యలుససులోచనలై । యెయ్యనముద్విరేఫనిష్ఠనొందుదురిందున్ ॥"

(13.) ఇక్కవి శబ్దములు ప్రయోగించుటయందు సర్వతంత్రస్వతంత్రుఁడైనందునఁ గొన్నియప్రశస్తప్రయోగములు గ్రంథమునందగుపడుచున్నవి. 511 వ సీసపద్యమునందు "బుధులును గురులును పుణ్యులు మునులును నుతులుంచు మురువుకు శ్రితులుగుటుతు" అను పాదమున "మురువుకు" అని షష్ఠీవిభక్తియందు నక్ను విడిచిపెట్టి వ్రాయఁబడియున్నది. "మురువునకు" అనియుండవలెను - అట్లయినచో మాత్రాధికమవ్వేడి - ఇది విచార్యము - వెండియు 493 పద్యమున "పెలుచగుశ్రీలువీలు" అని ప్రయోగింపఁబడియున్నది. "కుత్రచిన్నలోపశ్చ" యనుసూత్రవిధికేఁదప్పియున్నది. వీనులని యుండవలెను - ఇదియు విచార్యము - వెండియు నిట్టియప్రశస్తప్రయోగము లచటచటఁ గనుబడుచున్నను పీఠికావిస్తరభీతిచేసింన వివరించలేదు.

(14.) రెండవకలమునందుదహరించిన విధముగా శ్రీకృష్ణరాయలవారి యాస్థానకవులకు నిక్కవి యీవలివాఁడుగనుక నక్కాలపు కవిచక్రవర్తియగు బట్టుమూర్తిగారివిరచితమగు "నరసభూపాలీయము" అను కావ్యాలంకారసంగ్రహమును నిక్కవి పూర్ణముగఁజదివి యందలి లక్ష్యములగుపద్యములంబోలిన పద్యములిందనేకములు వ్రాసియున్నాఁడు. ఇంతయేల. కొన్నికొన్ని పద్యములంబోల్చి యంకితాంకములువిడిచి చూచినచో నించుకయైనను భేదములేకయున్నవి. ఇదిచూచునప్పుడిక్కవికి సామర్థ్యములేక వానిని స్వీకరించినాఁడని యనవలసివచ్చుచున్నది. అట్లనుటకు మాకించుకయైనను ధైర్యముచాలదు- గుణగ్రహణపారీణులకుఁ దెలియుటకుగా నాయాయిపద్యముల సంఖ్యను నిందుఁబోల్చిచూపుచున్నాము గాన నయ్యాయిపద్యములను బోల్చిచదువుకొనుఁడు.

| (నరసభూపాలీయము.) | | (ప్రబంధరాజము.) | * | (నరసభూపాలీయము.) | | (ప్రబంధరాజము.) |
|---|---|---|---|---|---|---|
| ౪౪ | ప౭౮ | ప౧౩౯ | * | ౪౨ | ప౧౫౫ | ప౧౪౦ |
| ౫ | ౫౧ | ౧౪౧ | * | ౨ | ౯౨ | ౧౪౬ |
| ౫ | ౭౬ | ౧౪౭ | * | ౫ | ౨౨ | ౧౪౯ |
| ౨ | ౮౯ | ౧౫౨ | * | ౨ | ౬౩ | ౧౯౨ |
| ౫ | ౨౨౪-౯ | ౨౧౨ | * | ౩ | ౨౪ | ౨౧౫ |
| ౫ | ౧౮౧ | ౨౯౮ | * | ౩ | ౩౧ | ౩౦౬ |
| ౫ | ౮౩ | ౩౫౧ | * | ౪ | ౭౭ | ౩౫౨ |
| ౨ | ౧౩౧ | ౩౫౩ | * | ౫ | ౧౦౨ | ౩౫౬ |
| ౫ | ౨౩౨ | ౩౫౭ | * | ౫ | ౧౬౫ | ౩౫౯ |
| ౫ | ౫౯ | ౩౬౨ | * | ౫ | ౪౯ | ౩౬౩ |
| ౫ | ౯౮ | ౩౬౮ | * | ౫ | ౧౬౦ | ౩౬౯ |
| ౫ | ౨౩౪ | ౩౭౦ | * | ౫ | ౫౯ | ౩౭౧ |
| ౨ | ౧౨౯ | ౩౮౮ | * | ౨ | ౮౨ | ౪౨౩ |

పైపద్యముల సంఖ్యలనుమాత్రము పోల్చికొన్నింటిజూపితిమి. తక్కినవాని నిమీరేపోల్చిచూచుకొనుఁడు. మఱియొకచిత్రము. కొన్నినరసరాజీయము లోని పద్యములవలె యతిప్రాసములువిడువకనే యిందును వ్రాయఁబడి యున్నవి. ఎట్లనఁగాఁజూడుఁడు. నరసరాజీయము చతుర్థాశ్వాసమునం దలి 89 వ, వృత్త, కంద, గర్భ, సీసము

౭. సీ॥“ మహితవిద్వజ్జనమండలీవినుత సాహిత్యప్రియంభావుకాత్యుదార
వితతభీమాహవవిక్రమక్రమసముద్యద్వైరినిర్భేదనాభిరామ
వినుతవిశ్రాణనవిభ్రమాపహసితానూనామరక్ష్మారుహానృపేంద్ర
వినతభూపాలకవిస్ఫురన్మకుటరత్నద్యోతితాంచత్పదామహాత్మ
నిరుపమదయాపయోనిధినిరతభరిత । చారుచరితనిర్మలతరసత్యరుచిర
తరణికులమణినరసింహధరణిరమణ । ఘనతరగుణనిధీమనుజనులువొగడ”॥

ఇఁకయీప్రబంధరాజములోనిపైపద్యమునుంబోలినపద్యమునజూడుఁడు!

౮. సీ॥“ మహితనానామునిమండలీ విరచితాహీనాతిశేల్లత్స్వనానుషంగ
వితతజన్యాంగణవిక్రమక్రమ లసత్క్రవ్యాదసంహారకానుభావ
వినతబర్హిర్ముఖవిస్ఫురన్మకుటరత్నశ్రేణి రాజత్పదాభిరామ

విగతవిశ్రాణనవిస్మయస్మయ దివౌకశ్శాఖిజైవాతృకాదిదాన
నిరుపమకృపాపయోంబుధినిరతశుభద । ధీరచరితనిర్మలతరదేహరుచిజి
తసజలజలదాయురగేంద్రధరణిధరవ । రయురుసుగుణనిధీపతీరాజవాహ"॥

ఈపైపద్యములోని "మహిత, వితత, వినత" అనుమూడుప దంబులు నరసరాజీమునందు సీసపద్యములో 1, 2, 4 సీసపాదాదుల యందుఁగూర్పఁబడియున్నవి. నరసభూపాలీయమునందలి సీసపద్యములోని "విద్వజ్జనమండలీ" అను సమాసమును "నానామునిమండలీ" అనుసమాసముగాను "భీమాహవవిక్రమక్రమ" అను సమాసమును "జన్యాంగణవిక్రమక్రమ" అనుసమాసముగాను "భూపాలకవిస్ఫురన్మకుటరత్న" అనుసమాసమును "బర్హిర్ముఖవిస్ఫురన్మకుటరత్న" అనుసమాసముగా నిందు మార్పఁబడియున్నవి. ఇంతియకాదు. నరసరాజీయములోనిసీస తేటగీతియందలి "నిరుపమదయాపయోనిధినిరతభరిత" అనువాక్యమును "నిరుపమకృపాపయోంబుధినిరతశుభద" అనువాక్యముగాను "ఘనతరగుణనిధీ" అనుపదమును "ఉరుసుగుణనిధీ" అనుపదముగాను మార్పఁబడియున్నవి. ఇంకపైసీసములలోని గర్భితములను వ్రాసి పోల్చి చూపినమిగులస్పష్టంబగునని యిందువ్రాయుచున్నాము.

౯.మ॥"హితవిద్వజ్జనమండలీ వినుతసాహిత్యప్రియంభావుకా
తతభీమాహవవిక్రమక్రమసముద్యద్వైరినిర్భేదనా
నుతవిశ్రాణనవిభ్రమాపహసితానూనామరక్ష్మారుహా
నతభూపాలకవిస్ఫురన్మకుటరత్నద్యోతితాంచత్పదా" ॥ (నరసరాజీయము)

౧౦.మ॥హితనానామునిమండలీ విరచితాశీర్నాతివేల్లత్స్వవా
తతజన్యాంగణవిక్రమక్రమలసత్క్రవ్యాదసంహారకా
నతబర్హిర్ముఖవిస్ఫురన్మకుటరత్నశ్రేణిరాజత్పదా
గతవిశ్రాణనవిస్మయస్మయదివౌకశ్శాఖిజైవాతృకా"॥ (ప్రబంధరాజము)

౧౧.క॥"నిరుపమదయాపయోనిధి । నిరతభరితచారుచరితనిర్మలతరస
త్యరుచిరతరణికులమణీ । నరసింహధరణిరమణఘనతరగుణనిధీ॥" (నరస)

౧౨.క॥"నిరుపమకృపాపయోంబుధి । నిరతశుభదధీరచరితనిర్మలతరదే
హరుచిజితసజలజలదా । యురగేంద్రధరణిధరవరయురుసుగుణనిధీ"॥(ప్ర)

రెండిగయు నరసభూపాలీయము నాలవయాశ్వాసములోని పాదయ

ముకమగు 81 వ, పద్యమునందలి 2-4 పాదములగు "మారామనుమదన సమరమాధుర్యోఁడవై" అనుపాదములే యీగ్రంథముయొక్క 730 వ, పద్యమునందు 2-4 పాదములు గాఁ జేకొనఁబడియున్నవి. మఱియును నరసభూపాలీయమున నాలవ యాశ్వాసములోని 86 వ పద్యమగు అష్టదళపద్మబంధస్రగ్ధరఁగనుఁడు.

౧౩॥" రామాకశ్రీసమగాత్రణకృతభయముదాసనక్తారమారా
రామారక్తాసనదాప్రిభరణపటిమాతాసకుస్త్రీకుమారా
రామాకుస్త్రీకుసతాప్రకటతరవిచితాపవిత్రాసమారా
రామాసత్రాపవిత్రాశ్రయనరసరుచిగాప్రమసశ్రీకమారా"॥

ఇఁక ప్రబంధరాజములోనిఅష్టదళపద్మబంధమగు 870వ, స్రగ్ధరావృత్తముగనుఁడు.

౧౪॥" రామారక్షోదలపాగ్ర్యదరకజననతాసపథ్యారమారా
రామారథ్యాపసతాప్రకటగుణసముదాప్రవిత్రాసమారా
రామాసత్రావిపదారవినిభకరచకాశ్రరణ్యాగమారా
రామాగణ్యారశకారథితఖగవరాపాలదక్షోరమారా"॥

ఈపైవృత్తమును నరసభూపాలీయమందలి వృత్తముయొక్క యతిప్రాసములరీతిగా నిందుఁబొందుపరచియున్నాఁడు. వెండియు "పవిత్రాసమారా" అను నరసరాజీయములోని సమాసమే యిందును వ్రాయఁబడియున్నది. అరయఁగా నరసభూపాలీయమును ముందిడుకొని యీగ్రంథమునందు కొన్నిపద్యములు వ్రాసినట్టెంచవలసియున్నది.

(15) ఈగ్రంథమునందు బంధకవిత్వ గర్భకవిత్వచిత్రకవిత్వములు విశేషముగ వ్రాయఁబడియున్నవి. ఇందుదహరింపఁబడిన గర్భకవిత్వ చిత్రకవిత్వ బంధకవిత్వములలో 808 వ, సీసపద్యమును బోలినపద్యమిది వఱకు నాంధ్రగ్రంథములలో నెచ్చటను వ్రాయఁబడియుండలేదు. ఈపద్యమునందు గర్భితములన్నియు నలువదికిఁబయిగానున్నయవి. ఈయలువదిగర్భితములును రకారప్రాసఘటితములై యున్నయవి. ఇందుఁగందములు, తేటగీతులు, ఆటవెలఁదులు, శోభానమంగళారతులు, శ్లోకములు, చౌపదములు, వృత్తములు, అష్టకములు, ధవళములు, అర్ధచంద్రికలు,

ఉత్కళికలు, రగడలు, దరువులు, ఉభయభాషాకందములులోనగు గర్భి తనులు వ్రాయఁబడియున్నవి. ఇంతియగాక యీసీసతేటగీతియంతయు సర్వలఘువులతోఁ గూర్పఁబడియున్నది. మెండియు నీసీసములోనుంచి విం శతిబంధకందముకూడా వ్రాయఁబడియున్నది. ముంజేతికడియమునకద్ద మేల! ఇప్పుడీపద్యము ముద్రింపంబడి మీమెదటఁబెట్టఁబడి యున్నదిగాన మేమువిశేషము దీనింగుఱించి వ్రాయఁబనిలేమ.

ఇట్టిపద్యమిదివఱకుఁ దెలుఁగుఁగబ్బములలో నెవ్వరును వ్రాసి యుండలేదు. గర్భకవిత్వముచే నలంకరింపఁబడియున్నపద్యమిది యొక్క టియగాదు, 807 - 809 - 810 - 817 - 818 - 821 - 822 - 825- 826 - 827 - 831 - 832 - 847- 850 - 863 - 870 లోనగుపద్యము లు గర్భితములచే వెలయుటచూడఁగా నిక్కవిని జతుర్విధకవితా నిర్వా హకుండనిచెప్పుటకు నించుకయైనను సందియములేదు. బంధకవిత్వ చిత్రక విత్వాదులకుఁ గొన్నిలక్షణములగుపడుచున్నవిగాని గర్భకవిత్వాదులకు లక్షణము బొత్తుగఁగనిపింపదు. అప్పకవి గర్భకవిత్వమునకు లక్షణమును వ్రాయకనే తానుకొన్ని గర్భితవృత్తములు వ్రాసియున్నాఁడు. ఒక్క చతుర్విధకందమునకుఁ దప్ప మఱిదేనికిని నప్పకవీయమునందు లక్షణము గుపడదు. గర్భకవిత్వ చిత్రకవిత్వములు కవియొక్కపాండిత్యాతిశయ ముపై నెక్కొనినట్లున్నయవి. అట్లుగానిచో పైనుదహరించిన సంఖ్యగ ల యీగ్రంథములోని గర్భితపద్యములు వ్రాయుటకీకవికి లక్షణమెట్లుం డునని యూహఁజేయగలము. అటువదినాల్గుగర్భితములుమాత్రము వ్రా యవలసినట్టు లక్షణముండునా! ఉండదు. కాబట్టివారివారి పాండిత్యప్ర గల్భతననుసరించి గర్భకవిత్వమును వ్రాయవచ్చునని యూహజేయు చున్నారము. ఇఁక చతుర్విధకంద లక్షణమునకుఁగావ్యాలంకార చూడా మణియందు వ్రాయఁబడినవిధమును జూడుఁడు:—

౧౫. తే॥ "ప్రథమకందంబురెండవపాదయుగము। నందురెండవగణవర్ణమాదిగాఁగఁ
గడయుమొదలునువరుసతోఁగలిపిచదువ । నగుఁజతుర్విధకందమైయార్యసభల"॥

ఇఁక అప్పకవీయములోని పద్యమునుగనుఁడు.—

౧౬.క॥ రెండవచరణంబునకును । రెండవగణమాదిగాఁగనిర్మించినచో
దండిచతుర్విధకందము । పాండవపక్షా మెలంగుఁబ్రాజ్ఞులసభలన్"॥

ఈగ్రంథమునందలి 220 వ పద్యమగు గూఢచతుర్థపాదిపద్యము నకు లక్షణము కావ్యాలంకారచూడామణియందు నీక్రిందివిధముగ వ్రాయఁబడియున్నది.

౧౭.క॥ "మొదలిచరణత్రయములోఁ । బదిలముగాఁగవితనంత్యపాదాక్షరముల్
గదియఁగ్రమమునసల్పిన । నదిగూఢచతుర్థమనఁగనద్భుతమయ్యెన్"॥

(16.) ఇఁక చిత్రకవిత్వవిధమెట్టిదనఁగా ననులోమవిలోమము, ఓష్ఠ్యనిరోష్ఠ్యము, తలకట్టులు, గుడులు, శృంగములు, అక్షరవిలోమము, పదభ్రమకము, పద్యభ్రమకము, ఏకపది, ద్విపది, త్రిపది, యేకాక్షరి, ద్వ్యక్షరి, త్ర్యక్షరి, నిష్ఠాలవ్యము, నిష్కంఠ్యము, నిర్దంత్యము, నిరూర్ధన్యము, నిరంశోష్ఠము, నిరూష్మకాదులచేఁబద్యములువ్రాసిగేని యదిచిత్రకవిత్వ మనుపించుకొనును. ఈచిత్రకవిత్వమును నిక్కమియు నీగ్రంథమునందు 75-214 - 221 - 222 - 223 - 230- 366- 392 - 807 - 808-(832లో 1—2) 849 - 877 - 878, యీపద్యములలో వ్రాసియున్నాఁడు- వీనికిలక్షణములు అప్పకవీయాది తెలుఁగుగ్రంథములయందును సాహిత్యరత్నాకరములోనగు సంస్కృతగ్రంథములయందునువ్రాయఁబడియున్నవి.

(17.) ఈగ్రంథమునందు గోమూత్రికాబంధము, ఛత్రబంధము, నాగబంధము, ఖడ్గబంధము, చక్రబంధము, గుచ్ఛబంధము, హారబంధము, అష్టదళపద్మబంధము, రథబంధము, పట్టెసబంధము, త్రిశూలబంధము, మురజబంధము, పాదుకాబంధము, చతుర్దళగర్భితద్వాదశదళపద్మబంధము, పుష్పమాలికాబంధము, మహానాగబంధము, లోనగుబంధములు వ్రాయఁబడియున్నవి. ఈబంధస్వరూపములు వ్రాయఁబడిన తాళీదళసంపుటములు మాకుహస్తగతమై బంధస్వరూపములు తెలిసినను బంధలక్షణములు తెలిసికొనుటకై ప్రయత్నించఁగాఁ గావ్యాలంకార చూడామ

ణీ, నరసభూపాలీయములయందుఁ గొన్నిబంధములకు మాత్రమీక్రింద వ్రాయఁబడినవిధముగ లక్షణమువివరించియున్నది.

(a) కావ్యాలంకారచూడామణియందలి చక్రబంధలక్షణము.

౧౭. తే॥ "వలయదశకంబు నాలు రేఖలులిఖించి । యందుశార్దూలవిక్రీడితాక్షరములు
పెట్ట నడుచుట్లఁగ విక్కృతి పేళ్లు రెండు । చక్రబంధమ్మునకునిడి చదువవలయు"॥

౧౮. క॥ "పదిచుట్లు నాలు తేకులఁ । పదిలపఱిచి సుకవి పేరుపతి పేరునులోఁ
బాడలఁగ నేవంవిధగుణ । విదితంబగుచక్రబంధవిధమానెటఁ జె"॥

అని నరసభూపాలీయమునందును, వ్రాయఁబడియున్నది. ఈచక్రబంధమును వ్రాయుటకుఁబదిచుట్లు నాలు తేకులు లిఖించి దానిలోఁబతిపేరు సుకవిపేరునువ్రాసి, మధ్యను చుట్లను శార్దూలవిక్రీడితాక్షరములుంచి చదువఁగా నదిపద్మబంధమౌనని వ్రాసిన పైలక్షణకారులపద్యములు చక్రస్వరూపమును తెలిసికొనుటకు చాలదని విచారించి సాహిత్యరత్నాకరమును చూడఁగాఁ దద్వ్యాఖ్యానకర్తయగు బ్రహ్మశ్రీ మల్లాదిలక్ష్మణసూరి విరచితమగు మందరమనుపేరుగల వ్యాఖ్యానమునఁ జక్రబంధవ్యాఖ్యానమునందు నీ క్రిందిలక్షణమును శ్లోకరూపముగ వ్రాసియున్నది.

శ్లో॥ "బధ్యతేషడరంచక్రంప్రత్యరంతన్నవాక్షరం
త్రియాఙ్గామపిషాదానాందశమంకర్ణికాక్షరం
ఆదితస్స్వస్వతుర్యారైస్త్రయఃపాదాశ్చతుర్థగాః
వర్ణాష్టష్ఠాంత్యమారభ్యసంవదంతేంతిమాక్షరైః
మధ్యాద్వ్యాద్వావిసంవాదౌషడరేషుక్రమాద్భవేత్
చతుర్థైస్సప్తమైర్వర్ణైర్వర్ణనంకవివర్ణ్యయోః॥

అని వ్రాసియుండుటవలనఁ జక్రబంధమునకు లక్షణము పూర్ణముగాఁ దెలిసినది - బంధములలోఁ గృతిపతిపేరు, కృతికర్తపేరు నిమిడియుండు బంధమిది యొకటియు గాని మఱిగనుపడదు. బంధస్వరూపమునం దెన్ని నియమము లగుపడుచున్నవో యవియన్నియు శ్లోకమున [illegible]బడి యున్నవి - ఈచక్రబంధమునందు శార్దూల వృత్తము వ్రాయుట [illegible]
తేకులు ప్రతితేకునకు మధ్యరెం డేసి దళములు [illegible]

చుట్టి శార్దూల వృత్తములోని మొదటి మూడుపాదములను మొదటినుం చి తుదవఱకు మూడురేఖలలో వ్రాసి, మిగిలిన నాలవపాదమును మూడవ పాదాంతాక్షరము మొదలు ప్రథమపాదాక్షరము వైపునదళమునకు రెండేసి యక్షరములుంచి చదివినచోఁ జక్రబంధమవుచున్నది. ఇట్లు వ్రాసినపక్షమున మొదటిమూడుపాదములలోని పదియవ యక్షరము మూడుపాదములకు సమానాక్షరమగుచున్నది - రెండియు నాలవపాదములోని 1 - 4 - 7 - 10 - 13 - 16 - 19 . యీయక్షరములు, సంవాదాక్షర సంజ్ఞగలిగి మొదటి మూడుపాదముల నాద్యంతాక్షరముల గుచున్నవి - తక్కిన - 2 - 3 - 5 - 6 - 8 - 9 - 11 - 12 - 14 - 15 - 17 - 18 - వ యక్షరములు విసంవాద సంజ్ఞగలవి గనుక యీయక్షరములెందును గలియక కేవలపాదపూరకములై ప్రథమవలయమునదళమునకు రెండేసి యక్షరములైయుండును - ఇంతియగాక తృతీయపాదాంతాక్షరమును జతుర్థపాదాద్యంతాక్షరమును సమానాక్షరములై యుండవలెను - ఈవిధ ప్రకారము వ్రాసి చదివినయెడల మూడవవలయమునఁ గవిపేరును, ఆఱవవలయమునఁ గృతిపతిపేరును గోచరించును. ఈనియమము మఱికొన్ని చక్రబంధములలో మఱియొకవిధముగాఁ గనుపించుచున్నదిగాని నాలవవలయము నందెక్కడను గృతిపతిపేరగుపడదు. ఇది, బ్రహ్మశ్రీ వావిలాలవాసుదేవశాస్త్రులు బి. యే. గారు విరచించిన " ఆంధ్రరఘువంశము " లో ముద్రింపంబడియుండుచక్రబంధమునందు " గిరిద్గుదారపతి " యని నాలవ వలయమున నగుపడుచున్నది. పారిజాతాపహరణములోని చక్రబంధమునందు మూడవ వలయమున " కృష్ణరాయకృతి " యనియు, ఆఱవ వలయమున " నందితిమ్మకవి " యనియు ; కవిరాజమనోరంజనమున 3 - 6 వలయములయందు శ్రీగోపాలాంకితం - సుకవిప్రబన్న యనియు, నరసభూపాలీయమున 3 - 6 వలయముల నారసింహాఙ్కితం - మూర్తికవికృతియనియు; ముకుందవిలాసమున 3 - 6 వలయములయందు పేరంనార్యకృతి - కేశవవినుతి

యనియు? ఆంధ్రబిల్హణీయమున 3 - 6 వలయములసింగరార్యకవి - చన్నభూపకృతియనియు ; రామరాజీయమున 3 - 6 వలయముల కోదండరామాంకం - సూరయ వేంగనయనియు ; శకుంతలాపరిణయమున 3 - 6 వలయములయందు నారసింహకవి - రామదైవాధీనం యనియు; చమత్కారమంజరియందు 3-6 వలయముల భావ్యకారకృతి - వేంకటాఖ్యాకవియని వరుసగావ్రాయఁబడియున్నవిగాని ఆంధ్రరఘువంశమునందలి చక్రబంధమువలె గ్రిగ్గుదొరపతియని కృతిపతిపేరు నాలవవలయమున నెవ్వరునువ్రాసియుండలేదు. పైనుదహరించిన చక్రబంధలక్షణశ్లోకమున "చతుర్థైస్సప్తమైర్వర్ణై ర్వర్ణనంకవివర్ణ్యయోః" అనివ్రాసియుండుటవలన నాలుగవవర్ణము, ఏడవవర్ణము మొదలుగఁజదివిన కవియొక్క కావ్యముయొక్క పేర్లగుపడునని శ్లోకమునందుఁ జెప్పియుండుటను విచారించఁగా, సంవాదాక్షరమగు ప్రథమవలయములోని పద్య ప్రథమాక్షరమును రెండుగగణించినయెడల మూడవవలయమునందలి యక్షరము నాలవ సంఖ్యగలయక్షరమగుచున్నది. ఆపక్షమున నాలవయక్షరము మూడవవలయమునందును ఏడవయక్షరను ఆఱవవలయమునందును నేర్పడుచున్నది. ఇట్లుగణించినచో 3-6 వలయములయందు 4-7 సంఖ్యలు గల వర్ణములు నిలుచుచున్నవిగనుక "చతుర్థైస్సప్తమైర్వర్ణైః" యని శ్లోకమునందు వ్రాసియున్నది సార్థకమగుచున్నది - పైనవ్రాయఁబడిన చక్రబంధపద్యములయందన్నిటను 3-6 వలయములయందే కవికృతులపేళ్ళగుపడుచున్నవి - వాసుదేవశాస్త్రులవారి చక్రబంధమునందు నాలవవలయమునఁ గవిపేరగుపడుచున్నను కృతిపతిపేరు 3 వ వలయమునందగుపడుటకు బదులుగ 4 వ వలయమునంగుపడుచున్నది - వెండియు సమస్తపుస్తకములయందుఁ జక్రబంధమందలి కృతిపతి కృతికర్తలపేర్లు ప్రదక్షిణముగఁ గనుపడుచుండనేలకో వాసుదేవశాస్త్రులవారు కృతిపతి నామముగు "గ్రిగ్గుదొరపతి" యనిప్రదక్షిణంబుగను "వాసుదేవకృతి" యని తమపేరప్రదక్షిణముగను బంధమున నెలకొల్పియున్నారు. ఇదిచింత్యము.

ఈప్రబంధరాజములోని 861వ, పద్యమగు చక్రబంధమునందు మూడవవలయమున "కవివేంకటాద్రి" యనియు, నాఱవవలయమున "ప్రబంధరాజము" యనియువ్రాసియున్నది. ఇట్లు వ్రాయుటకుఁ గారణ మూహించునది. సాహిత్యరత్నాకరములోని యీక్రింద నుదహరించిన చక్రబంధశ్లోకమున మూడవవలయమునందు "ధర్మసూరికృతిః" యనియు, ఆఱవవలయమున "రామగుణనుతిః" యనియు, యెనిమిదవవలయమున "రథపదబంధ" మనియు వ్రాయఁబడియున్నది. ఇదిచూడఁగా నీచక్రబంధమును నేర్పఱుచుటయందుఁబాండిత్యముననుసరించి చిత్రముగాఁ గవితనకిచ్చవచ్చినట్లు నేర్పఱుపవచ్చునని తోఁచుచున్నది.

ఇఁక సాహిత్యరత్నాకరములోని చక్రబంధశ్లోకమునుజూడుఁడు.

శ్లో॥ "దర్పాంధప్రసరాసురస్థిరమదప్రాణప్రహారక్రియో
విష్ణుస్త్వన్మథమన్మథస్థిరశివంభానుశుపాకృత్ప్రభాః
దత్తాంసూనృతగుప్తపద్ధరవిధస్ఫాతిః ప్రహేతిఃపరం
రమ్యోమేదయయావిరాధదమనోయోగీంద్రభావ్యశ్చిరం"॥

అత్రతృతీయవలయే "ధర్మసూరికృతిః" షష్ఠే "రామగుణనుతిః" అష్టమే "రథపదబంధః" ఇతిచప్రతీయతే. బవయోరభేదాత్॥ అనిసాహిత్యరత్నాకరములో వ్రాయఁబడియున్నది.

ఈచక్రబంధమును "షడరచక్రబంధము" అని మఱియొకనామమునఁబిలుచుచున్నారు. 808వ, సీసపద్యములోని వింశతిభేదబంధకందము చక్రబంధముతోనిమిడ్చి వ్రాసియున్నది. ఇందులకుఁ గారణము మృగ్యము- వెండియు, ద్విచతుష్క-చక్రబంధమనియు, చతురస్ర చక్రబంధమనియు, [illegible]యు, అష్టాక్షరచక్రబంధమనియు నీపేర్లం[illegible] వానివాని స్వరూపములను బళ్ళారిజిల్లాలోని [illegible] శ్రీమాన్ గోపాలాచార్యులవారు గుఱుమూర్తి[illegible]నింగూర్చి [illegible]సియున్నారు. ఈబంధభేదములకు లక్షణమువిచారించునది. శ్రీమాన్ గోపాలాచార్యులు విరచించిన బంధములన్నియు వానినిజరూపములతో 1872 సంవత్సరమునందు ముద్రింపఁబడియున్నవి

గాన వాని స్వరూపముల నాపటమునందుఁజూచుకొనునది.

(b) ఇఁక గోమూత్రికాబంధలక్షణము కావ్యాలంకార చూడామణియందు నివ్విధముగా వ్రాసియున్నది.

౨౦. తే॥ "వర్ణములుమూడుపఙ్క్తులవరుసవ్రాసి। మూ... దోలిగోమూ...
నుక్తపద్యంబుదానగుచుండెనేని। ద... త్రికాఖ్యబంధ...॥

ఈగోమూత్రికాబంధమునకు లక్షణమితర గ్రంథములయం దగుపడదు. సాహిత్యరత్నాకరమునందు గోమూత్రికాబంధ చక్రబంధ, మురజబంధ, అష్టదళపద్మబంధ, ఛురికాబంధ, ... బంధ, ఖడ్గబంధ, హలబంధ, చాపబంధ, గుచ్ఛబంధ, మత్స్యబంధములు వ్రాయఁబడియున్నవి గాని వ్యాఖ్యానమునందు లక్ష్మణసూరిగారు అష్టదళపద్మబంధ, నాగబంధ, చక్రబంధములకుఁదప్పఁదక్కిన బంధములకు లక్షణమువ్రాయరైరి. ప్రతాపరుద్రీయవ్యాఖ్యానమునందును నిమ్మాటికిమాత్రమే లక్షణము వ్రాయఁబడియున్నది.

(c) ఇఁక అష్టదళపద్మబంధమునకు నరసభూపాలీయమునని వ్విధముగ లక్షణము వ్రాయఁబడియున్నది.

౨౧. చ॥ "కనుఁగొనఁదేకురెన్మిదియుఁగర్ణికచుట్టిడిస్రగ్ధరాంఘ్రిల
న్మనుపటియేడువర్ణములునుంగడయేడుఁబ్రవేశనిర్గమ
బ్బనుపడనాల్గుదిగ్దళములన్నిఖియించివిదిగ్దళంబులం
దెనయఁగఁబాదమధ్యగములేడును వ్రాయఁగఁబద్మబంధమా"॥

ఇందుకుసమమగు శ్లోకము సాహిత్యరత్నాకరవ్యాఖ్యానమునందు నివ్విధముగ వ్రాయఁబడియున్నది.

శ్లో॥ "కర్ణికాదిలిఖేద్వర్ణాన్ క్రమాద్దిక్షువిదిక్షుచ
సకర్ణికాంత్యస్థదిక్షు విదిక్షుతువికర్ణికాన్
ప్రవేశనిర్గమాభ్యాంచదిక్షుతేస్యుశ్చతుర్దశ
వ్యవధానేనతానాద్యేదళేష్వత్రత్వనంతరాన్"॥

నరసభూపాలీయమున దీనిని స్రగ్ధరావృత్తముతో వ్రాయవలయునని విధించినను కావ్యప్రకాశికయందు నీయష్టదళపద్మబంధము ప్ర

గ్ధరావృత్తముతో వ్రాయఁబడక అనుష్టుప్ శ్లోకముతో నివ్విధముగ వ్రాయఁబడియున్నది. ఎట్లనఁగా:—

శ్లో॥ "భాసతే ప్రతిభాసార । రసాభాతాహతావిభా
భావితాత్మశుభావాదే । దేవాభావతతేసభా"॥

సాహిత్యరత్నాకరప్రతాపరుద్రీయములయందు స్రగ్ధరలతోఁ గూర్పఁబడియేయున్నది.

(d) ఇఁక సాహిత్యరత్నాకరవ్యాఖ్యానమందు నాగబంధలక్షణము:

శ్లో॥ "రేఖాభ్యాంచతురశ్రాణి చతుష్కోష్ఠానికల్పయేత్
రేఖాద్వయాంతరాళేస్యాద్యథాకోష్ఠగృహాష్టకం
విదిక్షుకుండలీకుర్యాత్తద్రేఖాగ్రైర్యథాక్రమం
దిగ్రేఖాగ్రాణిబాహ్యాని యోజయేద్దిక్త్రయేమిథః"॥

శ్లో॥ "ఏకత్రతుఫణాపుచ్ఛ మేళనంకల్పయేత్తథా
అంతరాణ్యత్రయాకుర్యాత్సందంశాస్సుర్యథామిథః
వర్ణావృత్తిస్థలాన్యత్ర కోష్ఠకోణానిషోడశ
సందంశానాంచతుష్కంచ కంఠశ్చైక్యకవింశతిః"॥

శ్లో॥ ఆవృత్తిర్యుగ్మవర్ణానాం నేతరేషామిహక్వచిత్
అగ్నీశానదశబ్రహ్మ వర్ణాఃపాదచతుష్కగాః
ఆవర్తేరన్నైరృతాదికుండలేష్వప్రదక్షిణం
యత్రైవంస్యాత్తథావర్ణా స్ఫణాతోవిన్యసేత్క్రమాత్"॥

శ్లో॥ "త్రింశదష్టావింశతిశ్చషడ్వింశతిరనుక్రమాత్
వేష్టనత్రితయేవర్ణా స్సమాప్తిస్తుగళాంతరే
సర్వమేతన్నిధాయాంతస్సంగృహీతంమహాత్మభిః"॥

శ్లో॥ విదిక్షులేకుండలితం స్వమంగంస్వేనత్రిరావేష్ట్యవిభంగిభంగం
తిష్ఠాగ్రేపుచ్ఛమహేస్థితస్యపార్శ్వైఃఫణాతఃఫణిబంధఏషా"॥

అని నాగబంధలక్షణము సాహిత్యరత్నాకరమున వ్రాయఁబడియున్నది: ఆంధ్రలక్షణగ్రంథములలో నెచటను దీనిలక్షణము గుపడనందున సంస్కృత శ్లోకమునే వ్రాసితిమి. వాసుకిద్వయబంధమనియుఁ గృష్ణసర్పబంధమనియు నాగలింగబంధమనియుఁ గొన్ని భేదములగుపడుచున్నవి. వీనికిని లక్షణము విచారించునది.

(*e*) రథబంధ కందమునకు సంస్కృతాంధ్రములయందు లక్షణమగుపడదు. ఈగ్రంథమునందలి 854 వ పద్యమగు రథబంధ కందమునందలి 1-3-7-21-29-35-39-40 యీసంఖ్యలుగలయక్షరములను జేర్చి చదివినచో "శ్రీవెంకటేశ నీవేగతీ" అని బంధమధ్యమునందేర్పడుచున్నది. ఈరథబంధమును సీసపద్యముతోఁగూడా బ్రహ్మశ్రీ గోపినాథము వేంకయగారి కృతమగు శిశుపాలవధ మహాకావ్యమున వ్రాయఁబడియున్నది. అందలి నడిమియక్కరముల జేర్చిచదివినయెడల "శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్రమహీరమణ" అని చిత్రము గనుపడుచున్నది. ఈరథబంధములు చిన్నవిగను పెద్దవిగను నానావిధములుగఁ గవులు వ్రాసియున్నవి పెక్కులు గనుపడుచున్నవి. వీనికన్నిఁటికి లక్షణము విచారించునది.

(18.) ఇతరగ్రంథములలోని బంధకవిత్వ చిత్రకవిత్వ గర్భకవిత్వ పద్యములనామములఁ దెలుపునట్టి పట్టిక.

౧. పెద్దన ముకుందవిలాసమునందు వృత్త కంద గర్భితసీసము, ద్విపద చౌపదిలాలీశోభాన మంగళారతి సువ్వాలధవళాదివివిధభేదసీసము, కందద్వయ గర్భిత చంపకమాలికా వృత్తశేషబంధచిత్రము, శైలబంధచిత్రకందము, పుష్పగుచ్ఛబంధచిత్రపంచచామరవృత్తము, చక్రబంధచిత్రశార్దూలము, ఛత్రబంధచిత్రకందము, గోమూత్రికాబంధచిత్రసుగంధివృత్తము, నిరోష్ఠ్యద్వివిధకందము ౨. కనుపర్తిఅబ్బయకవి కవిరాజమనోరంజనములోనఁ గందద్వయరుగ్మవతీ కమలవిలసితగర్భక్రౌంచపద వృత్తము, గోమూత్రికాబంధ కందము, గోమూత్రికాబంధ ఉత్సాహవృత్తము, ఛత్రబంధకందము, చక్రబంధశార్దూలము, ఖడ్గబంధకందము, పుష్పమాలికాబంధచంపకమాల, నాగబంధచంపకమాల పాదభ్రమకకందము, ఓష్ఠ్యకందము, నిరోష్ఠ్యమహాస్రగ్ధర, సర్వతోభద్రబంధశ్లోకము, ద్వ్యక్షరకందము, ఆంధ్రగీర్వాణభాషాశ్లేషకందము, ౩. పారిజాతాపహరణమునందుఃబాదభ్రమకకందము, గోమూత్రికాబంధకందము, నాగబంధచంపకమాల, ఛురికాబంధకందము, చక్రబంధశార్దూలము, ద్వ్యక్షరకందము, ద్వికందక్రౌంచపదవృత్తము, గర్భితభుజంగప్రయాతస్రగ్విణి. ౪. బట్టుమూర్తిగారి నరసభూపాలీయమునందు అష్టదళపద్మబంధము, వృత్తకంద గర్భసీసము, చక్రబంధము. ౫. భరతాభ్యుదయమునం

దుఁ బుష్పమాలికాబంధసీసము, పుష్పగుచ్ఛబంధవిద్యున్మాలావృత్తము, మత్తేభమణిగణనికరవృత్తద్వయగర్భితసీసము, కందపద్యగర్భితచంపకము, చక్రబంధతరళవృత్తము, నిరోష్ఠ్యకందము, సర్వౌష్ఠ్యకందము, అచలజిహ్వాక్తిగీతము, పాదభ్రమకకందము. ౬. ఓగిరాల జగన్నాథముగారి సుమనోమనోభిరంజనమునందు నాగబంధచంపకమాల, ఛత్రబంధకందము, మర్దలబంధకందము, పుష్పమాలికాబంధచంపకము, గోమూత్రికాబంధకందము, పుష్పగుచ్ఛబంధమాణవక వృత్తము. ౭. సూరయ వేంగనగారి రామరాజీయమున చక్రబంధశార్దూలము, నాగబంధచంపకమాల, గోమూత్రికాబంధకందము, చతుశ్చరణగర్భకందము, ద్వికందగర్భక్రౌంచపదవృత్తము, నవగ్రహాష్టదిక్పాలక దశావతారనామగర్భకందము. ౮. కూచిమంచి తిమ్మన్నగారి రసికజనమనోభిరామమునందుఁ గందమణినికరవృత్తము, సగర్భ స్రగ్విణీ భుజంగప్రయాత ద్రుతవిలంబిత వృత్తసీసము, సగర్భమత్తేభకందసీసము. ౯. పిండిప్రోలు లక్ష్మణకవిగారి లంకావిజయమున నాగబంధస్రగ్ధరావృత్తము, కందమణిగణనికరవృత్తము, చతుర్విధకందము, పుష్పగుచ్ఛస్రగ్ధరావృత్తము, ఉభయభాషాకందము. ౧౦. అడిదము సూరన్న కవిజనరంజనమునందుఁ జతుర్విధకందగర్భిత మణిగణనికరవృత్తము, చతుర్విధకందగర్భితప్రమితాక్షరవృత్తము. ౧౧. సుబ్రహ్మణ్యవిజయమను విద్వత్కర్ణామృతమున చిత్రగర్భిత వచనములో సీసగర్భితభాగము పుష్పమాలికాబంధభాగము నాగబంధభాగము లోనగునవియు, ముక్తపదగ్రస్తకందద్వయగర్భితచంపకమాలికానాగబంధము, శైలబంధకందము, మణిగణనికరగర్భితకందము, భుజంగప్రయాతగర్భితస్రగ్విణి, తరువోజసమపాదోత్సాహ వృత్తావతంస భుజంగప్రయాత స్రగ్విణీవృత్త ద్విపదమంజరీ గర్భిత దండకరూపచిత్రసీసానుచర చతురంగతురంగ సకలగ్రహవారప్రచార దేశికచిత్రగీతిసీసము, మణిగణనికరగర్భితకందపుష్పమాలికాబంధము, కాంభోజీరాగపదగర్భితచిత్రసీసము, సహానాఖ్యరాగపదగర్భితసీసము, హుసేనిరాగచరణద్వయవర్ణగర్భితసీసమాలిక, ఆనందభైరవిరాగకీర్తనాగర్భితసీసము, ముఖారిరాగపదగర్భితసీసమాలిక, చతుర్థపాదగోపనకందము. ౧౨. బహుజనపల్లి సీతారామాచార్యులవారి సుందరరాజశతకమునందు ఖడ్గబంధకందము. ౧౩. మచ్చ వేంకటకవిగారి శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచనకుశరాట్చరిత్రమునందుఁ బుష్పబంధచంపకమాల, కందగర్భచంపకమాల. ౧౪. వావిలాలవాసుదేవశాస్త్రులవారి "రుక్మిణీస్వయంవరణము" అనుగ్రంథమునందు గోమూత్రికాబంధకందము, ఆంధ్రరఘువంశమునందుఁ జక్రబంధశార్దూలము. ౧౫. గోపినాథము వేంకయ్యగారి శిశుపాలవధ మహాకావ్యమునందుఁ బుష్పమాలికాబంధచంపకమాల. ౧౬. కంకంటి నారసింహకవిగారి ద్విపద విష్ణుమాయా విలాసమున నుత్తర

భాగములో నైషధయాశ్వాసమునందుఁగందగర్భితము, సీసగర్భితము, అనుష్టుప్ శ్లోకగర్భితము. ౧౭. కాకునూర్యప్పకవిగారి అప్పకవీయమున వృత్త కంద గీత గర్భసీసము, కందద్వయరుగ్మవతీ కమలవిలసితగర్భ క్రౌంచపదవృత్తము, కందగీతి, గర్భచంపకమాలవాణీపద్మాంబారతీదరధ్వనితాళమధురగతిగర్భోత్పలమాలికావృత్తము. ౧౮. కంకంటి పాపరాజుగారి యుత్తరరామాయణమున మత్తేభగర్భితసీసము. ౧౯. పుష్పగిరితిమ్మన్నగారి సమీరకుమారవిజయమునందుఁగందగర్భిత శార్దూలవిక్రీడితము, స్రగ్విణీభుజంగప్రయాతగర్భితవృత్తము , కందగర్భిత మణిగణనికరము, నాగబంధ చంపకమాల, అనులోమవిలోమకందము, కందద్వయగర్భితసరసీజవృత్తము, కందద్వయగర్భితభాస్కరవిలసితవృత్తము, మత్తేభకందగర్భితసీసము. ౨౦. కందుకూరివీరేశలింగముగారిరసికజనమనోరంజనమునందుగోమూత్రికాబంధకందము,కందగర్భిత మణిగణనికరము. ౨౧. ఆంధ్రబిల్హణీయమునందుఁ జక్రబంధము. ౨౨. కూచిమంచి సోమసుందరకవిగారి లక్ష్మీప్రియవిలాసమునందుఁ జతుర్విధకందము. ౨౩. పక్కివేంకట నరసయ్యగారి శకుంతలా పరిణయమునందు శకట బంధకందము, ప్రాసాదబంధసీసము, చక్రబంధశార్దూలము, ఖడ్గబంధసుగంధివృత్తము, సగర్భకందమణిగణనికరవృత్త తేటగీతి, సగర్భ మత్తకోకిలవృత్తసీసము, శకటబంధకందము, అనులోమ విలోమ కందము. ౨౪. సింహాద్రివేంకటనామధేయ విరచితమగు చమత్కారమంజరియందుఁబుష్పబంధస్రగ్ధరావృత్తము, చక్రబంధ శార్దూలము. ౨౫. రామకృష్ణోపాఖ్యానమను శ్లేష కావ్యమునందుఁగందగీతగర్భిత చంపకమాల, పుష్పమాలికా బంధచంపకము, స్రగ్విణీగర్భభుజంగ ప్రయాతవృత్తము, కందగర్భ మణిగణ నికరవృత్తము. ౨౬. ధరణీదేవుల నాగయ్య విరచితమగు దశావతారచరిత్రమున నోష్ఠ్యాచలజిహ్వాద్వ్యక్షరీకందము, పుష్పమాలికాబంధచంపకమాల, గోమూత్రికాబంధచంపకమాల, ఛత్రబంధ కందము, నాగబంధస్రగ్ధరావృత్తము, పాదగోపన చంపకమాల, అనులోమవిలోమకందము, అష్టదళపద్మబంధ స్రగ్ధర,మంజుభాషిణీ గర్భయుత్పలమాల. ౨౭. వేదాంతదేశిక విరచితమగు పాదుకాసహస్రమునందుత్తరభాగమున గోమూత్రికాబంధము, మురజబంధము, శరబంధము, గరుడగతిచక్రబంధము, ద్విశృంగాటక చక్రబంధము, ద్విచతుష్కచక్రబంధము, చతురరచక్రబంధము, అష్టదళపద్మబంధము, సకర్ణికషోడశదళపద్మబంధము, చతురంగతురంగపదబంధము, సర్వతోభద్రబంధము లివి వ్రాయఁబడియున్నవి. వెండియు బ్రహ్మశ్రీ వఠ్యము పరబ్రహ్మశాస్త్రిలవారనేకబంధములు సంస్కృతాంధ్రములయందు వ్రాసియున్నారు. వానిలోఁ గంకణబంధము మిగులఁజిత్రముగనుక నిందుఁబొందుపఱచుచున్నాము. ఈకంకణబంధమున నెచటనారంభించి చదివినను శ్లోకమేర్పడుచున్నదగాన నిందు 64 విద్యున్మాలావృత్తములుగల కంకణబంధములగుపడుచున్నవి.

శ్లో॥ "వ్యాసాద్యావాకామాన్యాయా।పాల్యాత్యాగాత్రిలాతాశ్రీశా
స్రాశ్రీధారాభాటీక్యాభ్యాప్యా।లీనామేహావైస్మాస్యాభా॥"
(విద్యున్మాలావృత్తాని ౬౮. కంకణబంధోదితాని.)

పైనుదహరించిన గోమూత్రికాబంధ పుష్పమాలికాబంధ పుష్పగుచ్ఛబంధ ఛత్రబంధ నాగబంధములు తెలుఁగుఁగబ్బములలో నానావిధపద్యములతో వ్రాయఁబడియున్నవి.— ఎట్లనఁగా, గోమూత్రికాబంధము సుగంధివృత్తమునందును ఉత్సాహవృత్తమునందును చంపకమునందును గందమునందును; పుష్పమాలికాబంధము సీసమునందును స్రగ్ధరయందును చంపకమునందును; రథబంధము కందమునందును సీసమునందును; పుష్పగుచ్ఛబంధము పంచచామరవృత్తమునందును విద్యున్మాలావృత్తమునందును మాణవకవృత్తమునందును స్రగ్ధరావృత్తమునందును; నాగబంధము చంపకమాలయందును స్రగ్ధరావృత్తమునందును నిమిడ్చివ్రాసియున్నవి. ఒకబంధమునే వివిధపద్యములతో వ్రాయుటకులక్షణమెట్యోదయో విచారించునది.

(19.) సర్వలఘుసీసము, అవకలివడిసీసము, అక్కిలివడిసీసము సర్వతః ప్రాససీసము, విషమసీసము, వడిసీసము, సమసీసము, అను సప్తవిధసీసములలో నీగ్రంథమునందుఁగొన్ని భేదములు 1-12-47-75-221-224-547-802 806-813-814 పద్యములలో వ్రాయఁబడియున్నవి. వీనికన్నింటికిలక్షణమప్పకవియము వ్రాయఁబడియున్నది. చూడుఁడు.

(20) హయప్రచారరగడ, తురగవల్గనరగడ, విజయమంగళరగడ, ద్విరదగతిరగడ, విజయభద్రరగడ, మధురగతిరగడ, హరిగతిరగడ, హరిణగతిరగడ, వృషభగతిరగడ, అనునీతొమ్మిదివిధములరగడములలో నీగ్రంథమునందు నైదువిధములరగడలు మాత్రమే యుపయోగించియున్నాఁడు. అవియనఁగా ముప్పైతొమ్మిదవ పద్యమునందు హరిగతిని, 253 వ పద్యమునమధురగతిని, 256-263 పద్యములలో వృషభగతిని, 369-808 లోఁగర్భితము ( 25 ) పద్యములలోఁ దురగవల్గనమును, 877 వ పద్యములో ద్విరదగతినిమాత్రము నుప[illegible]ంచియున్నాఁడు. కొన్నిప్రబంధములలో వీనిభేదములుగల పద్యములు వ్రాయఁబడియున్నవి. ఆయాయి భేదములకు లక్షణము అప్పకవీయమునందు వ్రాయఁబడియున్నది. ఇంతియకాక నీగ్రంథమునందు 805 వ పద్యమును శృంఖలిత వచన

రగడమని వ్రాయఁబడియున్నది గాన నీదాని లక్షణమువిచార్యము. దీనిలక్షణ మప్పకవీయమునఁగనుపడదు.

(21.) కందము, పథ్య, విపుల, చపల, ముఖచపల, జఘనచపల, అని యప్పకవీయమునందుఁ జెప్పఁబడిన కందభేదములలోఁ గందముతప్పఁ దక్కిన కందభేదము లీగ్రంథమునం దొక్కటియైననగుపడదు. 372 వ పద్యము మాత్రము చన్నకందమని వ్రాయఁబడియున్నది. దీనిలక్షణమెచ్చటను గనఁబడదు గాన నిదివిచార్యము. ఈకందషట్కమునకు నప్పకవీయమున లక్షణము వ్రాసియున్నది. ఈకందభేదము లెచ్చటనుప్రయోగింపఁబడనికతన వానిలక్షణములనునిందువ్రాయుట ననుపయోగమనియెంచి పీఠికావిస్తరభీతిచే విరమించుచున్నాము.

(22.) ఈగ్రంథమునందు 144 వ పద్యముఆర్యాగీతిరూపకందమని వ్రాయఁబడియున్నది. అప్పకవీయమున నుద్గీతి, యుపగీతి, ఆర్యాగీతి, కమలనగీతి, పవడగీతి, యని వ్రాయఁబడియున్నవి. ఈగీతిభేదము లెందును బ్రయోగింపఁ బడియుండుటగానము. ఇందుఁ బొందుపఱుపఁబడిన ఆర్యాగీతికి మాత్రము లక్షణము వ్రాయుచున్నాము-

౨౨. "॥ సముదీరితపథ్యాకం । దముకన్నను నొక్కగురువుఁ దాకించినచో
క్షమనార్యాగీతియగుఁ । గమలాప్రాణేశ సహజకందంబదియే ॥
ఇఁకపథ్యాకందలక్షణముజూడుఁడు.

౨౩. ॥" ధరలోఁబథ్యాకందము । హరియగు నా అవయొడనలమూఁటింటం జై
విరతియుఁగూడఁగమూఁటను । నెరయుఁజతుర్గణములుగ మునిలిచినచోటన్ ॥

(23.) నరసభూపాలీయమున నరసరాజమూర్తి కవిచంద్రుని

౨౪. సీ॥ జాణవేగంబునుభవభూతిసుకుమారతయుమాఘుశైత్యంబుదండిసమత
యలమయూరసువర్ణకలనచోరునియర్థసంగ్రహమ్మమురారిశయ్యసేర్పు
సోమప్రసాదంబుసోమయాజులనియమంబుభాస్కరునిసన్మార్గఘటన
శ్రీనాథునిపదప్రసిద్ధధారాశుద్ధియమరేశ్వరునిసహస్రముఖదృష్టి
నీకకలదటుగాననసేకవదన । సదనసంచారభేదంబుసడలుపఱచి
భారతీదేవినీజిహ్వఁబాదుకొనియె । మూర్తికవిచంద్రవిఖ్యాతకీర్తిసాంద్ర ॥

అనివర్ణించినట్లుగా నీగ్రంథమున వేంకటేశ్వరుండీకవిని యాక్రింది

పద్యముచే వర్ణించినట్లుగాఁ గవి వ్రాసుకొని యున్నాఁడు. ఎద్దియనిన

౨౫. ॥సీ॥ అలవిన్నకోట పెద్దనలక్షణజ్ఞత శబ్దశాసనకవి శబ్దశుద్ధి
ప్రాబంధిక పరమేశ్వరు సర్థమహిమంబు భయకవిమిత్రుని పదలలితము
శ్రీనాథు వార్తాప్రసిద్ధి నాచనసోము భూరికాఠిన్యంబు పోతరాజు
యమకవిధము మల్లయమనీషి చిత్రంబు పింగళసూరికవివరు శ్లేష
నాంధ్రకవితాపితామహు నల్లికవిగి । ముక్కుతిమ్మన తేటయు భూషణంబ
లంకృతియు నీకకలదౌ తలంప లక్షు । ఆకవియప్పయ వేంకటసుకవిచంద్ర॥

ఈపోల్కిఁబోలిన పద్యము లీరెండుగ్రంథములయందుఁదప్ప దక్కిన గ్రంథములయందగుపడవు.

(24.) ఈప్రబంధరాజములోని 806 వదియగు నాదిద్విప్రాసదళమధ్య త్రిప్రాసనియమాంత్య ద్విప్రాసదళచరణాక్కలి వడిసీసమును బోలినపద్యము దశావతార చరిత్ర 8వ యాశ్వాసమున వ్రాయఁబడియున్నందున నిందు సూచించుచున్నారము.

సీ॥ "స్మరహరాదిక సురాసురమరాసదధరాధరవరాతిగరఘోత్కరముతోడ
మదవదాయతనదాస్పదపదావదఘనాంగదమదావళరాజఘటలతోడ
మృగహయాదికరయాహృతిజయాహతభయావహహయాత్యుత్తమావళులతోడ
నలికులానలవలాహకబలాహితబలార్ణవకులాచలభద్రతతులతోడ ॥" ౨౮.

ఈపద్యమునకును బైనుదహరించిన ప్రబంధరాజమునందలి పద్యమునకు నించుకపోలికయగుపడుచుండినందున దీనినిందుఁబొందుపరచితిమిగాని వేఱొండు యభిప్రాయముచేఁగాదు.

(25) ఈగ్రంథమున 789వ పద్యము ప్రాసభేదమని స - శలకుఁ బ్రాసముజెప్పఁబడియున్నది. భారతాదులయందు నీప్రాసమగుపడదు. అప్పకవీయమునందును స - షలకు ప్రాసమైత్రియున్నట్టు చెప్పియున్నదిగాని స - శలకుఁజెప్పియుండలేదు. అయినను నీప్రబంధరాజమునందుదహరింపఁబడిన "ఆశలద్రువ" అనుపదమును "ఆసలద్రువ" నని వ్రాసినచో లక్షణవిరుద్ధము లేకయుండును. వ్రాఁతప్రతులయందన్నిటను నీపద్యమునకుఁ బ్రాసభేదమని నామమిడి వ్రాయఁబడియున్నందున సశలకు నెచ్చటనైన ప్రాసముండునా యని విచారించఁగ మూర్తికృతమగు నరస

భూపాలీయము తృతీయాశ్వాసమున నీక్రింది పద్య మగుపడుచున్నది.

౨౭.మ॥ "అనిఁ జెండాడి విపక్షవృక్షముల శౌర్యాగ్నిచ్ఛటం జేల్చి శ
స్త్రశరచ్ఛేదముల వ్రణోర్వితలము న్సంతక్షుణ్ణముం జేసి వై
ర్యసృగార్ద్రంబౌ నరించి పోఁదిఁ గోనకుద్యత్కీర్తిసస్యౌఘముల్
వెసఁ బండించు నయంచుఁ బల్కు నరసోర్వీనాథుయోధావళుల్"॥

మఱియు నల్లసాని పెద్దన్నగారి చాటువు అని చెప్పఁబడు యీక్రిందిపద్యము నను గానఁబడుచున్నది. ఎట్లనిన.

౨౮.ఉ॥ "కాశియు నీకరాసి కెనగాదు నృసింహుల కృష్ణరాయ యా
కాశి నిజచ్చువారలకుఁ గల్గును జేతికిఁ బుట్టెనే మహా
గ్రాసిని ఖండతుండములు గాఁ బడి గూలిన వైరికోట్లకున్
భాసురరంభకుంభపరి ... ... "॥

(☞ ఇట్టి ప్రాసపద్యములు పెద్దన్నగారి గ్రంథములయందె చటఁగనుపడవు.)

౨౯.క॥ ఈసరణిఁ గామతంత్రా । భ్యాసపరిశ్రాంతిమిగులఁ బరవశమైనన్
నాశిలి ధాతుక్షయమై । యాసములో పలనవాఁడు మరణము నొందున్"॥ (జై.భా.)

అని ప్రయోగద్వయమగుపడుచున్నందున వీని కాధారమెయ్యదియని విచారింపఁగా వేములవాడ భీమకవి విరచితమగు నీక్రింది చాటుపద్యము మాత్రమగుపడుచున్నది. ఎద్దియన.

౩౦.చ॥ "బిసరుహగర్భువ్రాఁతయును విష్ణునిచక్రము వజ్రివజ్రమున్
దెసలను రాముబాణముయుధిష్ఠిరుకోపము మౌనిశాపమున్
మసకపుఁ బాముకాటును గుమారునిశక్తియుఁ గాలుదండమున్
బశుపతికంటిమంటయును బండితవాక్యము రిత్తవోవునే"॥

అనునీపద్యము భీమన చెప్పినట్టు తెలియుచున్నది గాఁబట్టి పైచాటువు ను నాధారము జేసికొని సశలకుఁ బ్రాసమును గల్పించియున్నారు. అయినను నిట్టిప్రయోగములు భారతాదులయందగుపడని కారణమునుబట్టి దీనిఁ బ్రశస్తప్రయోగమని జెప్పుటకు సంకోచించుచున్నాము.

(26.) ఈగ్రంథమున 684 - 778 పద్యములు ప్రాసభేదమని వ్రాయఁబడియున్నవి. క్రారవట్రువసుడులకుఁ బ్రాసము భారతాదులయంద గపడుచున్నది.

౩౧.ఉ॥ క్షత్రియవంశ వైధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ

క్షత్రియవైశ్యశూద్రులనఁగాఁదగునాలుగుజాతులన్న వా
రిత్రముదప్పకుండఁగఁబరిక్షితు కాచినయట్లురామమాం
ధాతృరఘుక్షితీశులుముదంబునఁగాచిరయేయుగంబునన్ ॥

అని ప్రయోగమగుపడుచున్నది- మఱియు 688 వ పద్యము ప్రాసభేదమని వ్రాయఁబడియున్నది. ఈప్రాసభేదమున కప్పకవీయమున

౩౨. తే॥ "రలలుతమక్రిందనుండఁగ్రాలుపట్లు। ప్రాసవర్ణంబులై వానిఁబాసియైన
గూడియైనను జఱయడుగులనునిలుచు। ... ... ॥"

అని లక్షణము వ్రాయఁబడియున్నదిగాన నీగ్రంథమునందలి 688 వ పద్యములోని నాలవపాదమగు "నీక్రియసత్ప్రతకులు చరింతురుపుత్రా" అను ప్రాసమును సాధువని గ్రహించునది. రెండియు నిందు 781 వ పద్యము ప్రాసభేదమని వ్రాయఁబడియున్నది. ఈలకారశ్లిష్ట ప్రాసమునకు రాఘవపాండవీయమునఁ బ్రయోగమగుపడుచున్నది. ఎద్దియనిన.

౩౩. శా॥ "లోకత్రాణరతింబదాదిమమహీలోకప్రవేశోత్కభా
షాక్లప్తప్రథమద్వితీయపదగుంజన్మంజుమంజీరగ
ర్జాకల్పామలరామభారతకథాసర్గంబులన్మించువా
ల్మీకివ్యాసులఁగొల్చెదంబమభయశ్లేషార్థసంసిద్ధికిన్ ॥"

అని ప్రయోగమగుపడుచున్నందున 781 వ పద్యమునందలి "నాక్లప్తకాంచుఁడంచును" అను నీప్రయోగము సాధువని గ్రహించునది.

(27.) ఈగ్రంథములోని 876వపద్యము అష్టభాషాసీసమని వ్రాయఁబడియున్నది. సంస్కృతము- ప్రాకృతము- శౌరసేని- మాగధి- పైశాచి. చూళిక. అపభ్రంశము- ఆంధ్రము- యివిఅష్టభాషలనఁబడును. వీనిలో సంస్కృతంబు ప్రకృతియనియుఁబ్రాకృతంబు వికృతియనివ్యవహరింపఁబడుచున్నవి. ఇందు భారతీదేవిశైశవభాషితంబు ప్రాకృతమునాఁబడు. ప్రాకృతంబు- శౌరసేని- మాగధి పైశాచి- అపభ్రంశము అని ప్రాకృతంబు ఆయిదువిధములైనవి. పైశాచిభాషయందు భేదమించుకంతగలిగిచూళికాపైశాచియననొప్పె. ప్రాకృతాదులుగెడితద్భవములగుచు ననేక విధములుగఁదనలోఁ గలిసియుండు కతననీయాంధ్రంబెర్పడెఁ

గాఁబట్టి సంస్కృత ప్రాకృతాదులు రెండును, ప్రాకృతభేదములగు శౌరసేన్యాదులైదును నాంధ్రభాషయొకటియును జేరియష్టభాషలునాఁబడు. చక్కఁగ సంస్కరింపఁబడినది గాన సంస్కృత మనఁబడును. ఇదియెల్ల భాషలకుఁ దల్లియగు కతన స్వర్లోకప్రశస్తము. మహారాష్ట్రదేశీయంబు ప్రాకృతంబు. శూరసేనిదేశీయంబు శౌరసేని. మగధదేశీయంబుమాగధి. పాండ్యకేకయబాహ్లికానూపగాంధార నేపాళకుంతల సుధేష్ణభోజకన్నోజకంబులఁ బొసఁగుమాటలు పైశాచిచూళికలనంబడు. ఆభీరవిషయజాతము అపభ్రంశము. ఇయ్యాంధ్రదేశములోనిభాష ఆంధ్రమనంబడు. కావ్యనాటకాదులయందొక్కొక తెగవారికి నొక్కొకభాష విధింపఁబడియున్నది. అవ్విషయమిక్కడచటఁ బ్రస్తావింప ననావశ్యకమని యెంచి యిచట నుదహరింప విరమించుచున్నాము. పైనుదహరించిన భాషాష్టకోత్పత్తివివరణము అప్పకవీయము అహోబిల పండితీయమునుంచి యిందువ్రాయఁబడెఁగాన నందుఁజూచిన విశదముగఁగోచరించును. దశావతారచరిత్రయందుఁ బ్రాకృతభాషాగ్రథితమగు నొక సీసపద్యముమాత్రము గనుపడుచున్నది. ఇయ్యష్టభాషా మిళితమగు పద్యములుగ్రంథములయందగుపడుటయరుదుగనున్నయది.

(28.) ఈగ్రంథమందలి 880 వ, నమస్కారశబ్దలక్షితకందద్వయ గర్భితవచనమున నూటయెనుబది దివ్యతిరుపతులను గుఱించి వ్రాయఁబడియున్నది. ఇవ్వచనమునందు నమస్కార-శబ్ద పర్యాయములుభయభాషలలోనివి జేర్పఁబడినవి. ఇట్టి విషయములనుదెలుపు పద్యము లెచటను గన్పట్టవుగాని యయ్యలు రాజునారాయణామాత్యునిచే రచియింపఁబడిన "హంసవింశతి" పద్యకావ్యముచతుర్థాశ్వాసమున మంజుగతిరగడయందు దివ్య తిరుపతులను గుఱించి వ్రాయఁబడియున్నది. ఈగ్రంథద్వయములోని నమస్కార శబ్దలక్షితములను దివ్యతిరుపతుల నామములను పోల్చిచూచిన నించుమించుగాసరిపోవుచున్నవిగాన నీగ్రంథముల పార్వాపర్యమూరయునది. దివ్యతిరుపతియనఁగా వైష్ణవ యాళ్వారాదుల

చే మంగళాశాసనము చేయఁబడిన శ్రీ వైష్ణవ క్షేత్రమునకుఁ బేరు. అనఁగాఁ దీర్ఘప్రసాదాదులకర్హక్షేత్రము.

(29.) ఈగ్రంథమునందు 288వ పద్యము మొదలు 321 వఱకును, మఱియు 393 మొదలు 510 వఱకు నలమేలు మంగాభివర్ణనము వివిధాలంకారములతో వ్రాయఁబడియున్నది. సమష్టిమీద నూటు నూటయేఁబది ప్రత్యవయవవర్ణనమునకై వినియోగింపఁబడియున్నవి. తెలుఁగు ప్రబంధములయందన్నిటను నిట్టిపద్దియములు కవులు వ్రాసియున్నారు. ఒక తెలుఁగుఁ గబ్బములయందే గాదు. సంస్కృతమునందును వ్రాయఁబడియున్నవి. ఇట్టివర్ణనాంశములనుగుఱించి కొందఱు నవనాగరికులోకవిధమగు యసూయతను గనుపరచియున్నారు. ప్రబంధ రచనాది విషయమునందే గాక లలితాదిస్తోత్రములయందును దూర్వాసమహర్షి ప్రణీతమగు "ఆర్యాద్విశతి" యందును నివ్విధముగ వర్ణింపఁబడియున్నది. ఇట్టివిషయమును దెలిసియుండియు శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులవారు తమనిఘంటువగు శబ్దరత్నాకరమున నివ్విధముగా వ్రాసి ప్రకటించియుండుట మిగులఁ దెంపరితనము. "మఱి యొక్క విశేషంబు వినుండు. వీరు వర్ణనలు సేయ మొదలుపెట్టిరా మీరునమ్ముదురో నమ్మరో తల్లినేని కేశాది నఖపర్యంత మొక్కటియుంగ మైనఁజిక్క సివమెత్తినట్లు వర్ణింపకమానరు. అదిమెట్టిపారవశ్యమో యెఱుంగరాదు. మతస్థాపకులైన యాచార్యులో యిందులకును నాచార్యులే. ఇదియిప్పుడు వచ్చినదిగాదు. పారంపర్యముగ సంస్కృత భాషా మహాపండితుల సన్నిధానమునుండి వచ్చిన సంప్రదాయముగనున్నది." అని ప్రకటించియున్నారు. పండితులార చూడుఁడు. ఆంధ్రకవులనే గాక సంస్కృతకవులనుసహా ఆచార్యులవారు తృణీకరించిరి. ఎల్లభాషలకుఁ దల్లియగు సంస్కృతమున నిట్టివర్ణన లున్నవని యాచార్యులవారొప్పుకొనుచు సంస్కృత కవులను వహా నిరశించినపుడికఁ యాచార్యులవారికి శరణమెద్దియో విచారించఁదగ్గది. సకలకళలసంస్కృతమునుంచి నేర్చికొనుచుఁ దత్సంస్కృతకవితా

కన్యాజనకులగుకవుల నాక్షేపించుట విచారించఁగా " పాలుత్రాఁగి ఱొమ్ముగ్రుద్దువాఁడు " అనుసామెతంబోలియున్నది.

(30) ఈగ్రంథమును మేము ప్రకటించ నారంభించినది మొదలుగ ననేకయంతరాయంబులు సంభవించినను దైవానుగ్రహంబున నీదినముతోఁ బూర్ణముగా ముద్రింపించిప్రకటించితిమి. ఇయ్యదియొకగొప్పప్రౌఢకావ్యమగుటచేఁ బ్రతులు సమగ్రముగాఁ జిక్కినవికావు. మహారాజరాజశ్రీ నూజవీడు రాజుగారనిచినప్రతిలోఁ గొన్నిపద్యములేలేవు. మఱియు నయ్యదియసమగ్రముగనుండె. తక్కినవి యెల్ల సమగ్ర ప్రతులెయైనను మామండలములోని వేంకటగిరి ప్రభువుగారనిచిన ప్రతివలనను మఱియు బుచ్చిరెడ్డిపాలెము జమీన్దారునుంచివచ్చిన గ్రంథమువలనను బరిపూర్ణముగా ముద్రింపఁగలిగితిమి. ఇట్టియుద్గ్రంథములు ముద్రించునపుడు ప్రథమముననెట్టివారికైనఁ బొరబాట్లుండుననఁగా నావంటియలంతికిఁ దెలియక ననేకవిషయములు జాఱియుండుఁగానవానినెల్లఁ బండితులు దయయుంచి తెలిపినమరల గ్రంథమును ద్వరలో ముద్రింపఁ బోవుచున్నాను గానదానియందైన సవరించి ప్రకటింతునని పండితమండలమునకు విన్నవించునట్టి

నెల్లూరు.
1—7—92

పూండ్ల రామకృష్ణయ్య,
శ్రీ "అముద్రితగ్రంథచింతామణి" పత్రికాధిపతి.

ఈగ్రంథమాతృకలిచ్చిన వారినామములు.

1. మహారాజరాజశ్రీ శ్రీ వేంకటగిరిప్రభువుగారు.
2. ,, శ్రీ నూజవీడు రాజాగారు.
3. ,, శ్రీ బుచ్చిరెడ్డిపాలెము జమీన్దారుగారు.
4. ,, సి. వెంకటరామానుజులునాయఁడు. బి.ఏ. గారు.
5. ,, గురుజాడశ్రీరామమూర్తిపంతులుగారు, కాకినాడ.
6. ,, పొన్నాడభానుమూర్తిగారు (రాజోలు) గోదావరిజిల్లా.

శ్రీ శ్రీధరాయనమః.

# శ్రీ ప్రబంధరాజవిజయవేంకటేశ్వరవిలాసము.

## ఏకాశ్వాసము, సవ్యాఖ్యానము.

## అవతారిక.

౧. ఉ॥ శ్రీలలనామణీముఖవిశేషవికస్వరలోచనాబ్జపీ। ఠాళిను
దాళిమేచక విభాన్వితమై తగుపారిజాతపు। న్మాలికగల్వపూసరముగా
ట్కిభుజాంతరపాళిమీఱుచు। ద్వేలదయాసనాథుఁడగు వేంకటనాథుఁడు
మమ్ముఁబ్రోవుత౯॥ ... ... *

* ద్రాక్షాపాకము *

౨. సీ॥ రతికిభారతికిమేరలునియోగించనేర్పరికనేర్పుదిఁగొన్నగరిత
మిన్న। గారాబమునఁబాలకడలిముద్దులుసేయనలరు నిల్లింట్రఁపుబాఁడు
బిడ్డ। కలుములవెదచల్లుకడగంటిచూపులమగనితెలుస్మెక్కినమాయలాడి।
చెలికత్తెయగుమంచుమలపట్టిపోఁగామిగిలుఁగొప్పినగాయగేస్తురాలు। తన
కడుపుపల్లగా జగత్త్రయము గన్న।తల్లిజాసిల్లెసిఁగూర్చిచెల్లెలయి న।మం
గళాకారియలమేలుమంగవాఁడు। తెల ఫ్రలీడ్చిన యింటనెచుఁగాఁత॥

౩. సీ॥ శ్రీకరభోగంబుసింహాసనంబుగాఁజుట్టుకొ్రొమ్మగజాల మెట్లుగాఁ
గ । ఘనఫణాశ్రేణిముక్తాఛత్రరాజిగాఁజెలఁగుతన్మణులు పైకలశములు
గ । వెలయునిట్టూర్పులువీచోపుగములుగా వినుతులుకాహాళధ్వనులుగాఁ
గ । మేనితళత్తళల్మేలుకట్టుబుగనానందాశ్రులభిషేచనంబుగాఁగ । నీలనీ
లాంబరముజనుకాళముగను । జలరుహాక్షునకెల్లరాజసములొసఁగఁ।
జాలిసురనుతిగనుభోగిసార్వభౌము । శేషుశ్రీభాష్యరచనా విశేషుఁగొలు
తు ॥ ౪. సీ ॥ వినతాత్తచిరదాస్యవిశ్రాణనోదగ్రనిష్ఠురాహితకవి నికర
ణములు । సద్యోతిగమనవేళోద్యతుతగ్రావతీవ్రసంస్కృతభిదురవ్రణము
లు । మహనీయుతర మేరుమందరోపమగజకచ్ఛపగ్రహణకర్కశకిణములు।
శక్రనియంత్రితావక్రయత్నాధ్యక్షురక్షితైకసుధాహరణచణములు । దను
జరాణ్ణీరసారణ్యదావశిఖలు । దాసజనకల్యకల్యాణదాయకనులు । ప
న్నగశయానరథరాజపన్నగములు । దురితపత్రభిదాక్రీడఁబరఁగుఁగాఁతే॥
౫. ఉ ॥ చిత్రచరిత్రుఁడైనసరసీరుహనేత్రునియాజ్ఞచేమణీ। వేత్రముపద్మ
జాండములువేగలిగింపనణంపబ్రహ్మగాఁ । బాత్రముఁజేసిమించినకృపాజ
లరాశిని సైన్యనాయకు । న్సూత్రవతీకళత్రునివిశుద్ధచరిత్రుఁబవిత్రుఁగొల్చె
దన్॥ ౬. చ ॥ శ్రితహితభోగదన్గదనుసేవకశంఖనుశంఖమున్సము। న్న
తవిగధీశనందకమునందకమున్గుణజాతటంక్రియా । సతతహతోగ్రదైత్యవ
రశార్ఙ్గముశార్ఙ్గముఁబాలితత్రయీ । శతధృతిముఖ్యదేవమునిచక్రముఁజక్రి
మునాశ్రయించెదన్॥ ... ... *

* ఆశీర్వచనము *

౭. ఉ॥తమ్ములకెల్లవిందగునిధానముఁదమ్ములయిండ్లకొమ్మకు।న్దమ్ముఁ
డుకన్నులైన గుణధన్యునిపొక్కిటఁబుట్టినట్టిపొం । దమ్ముఁజనించిమించినవి
ధాతకృపారసమొలుకుదచ్చికం । దమ్ములమాకునీవుతసుదారతమీఱఁ జి
రాయురున్నతుల్॥ ... ... *

౮. క ॥ వీణాసరోజపుస్తక । పాణికిశుకవాణిఁబద్మభవురాణికి
ను । శ్రోణికిబ భరవేణి । న్వాణిన్వినుతింతుమిగుల వాగైశ్వర్యకిన్॥ *

✱ పరికరాలంకారసహితాశీర్వచనము. ✱

కా. వ॥ గిరిజయురోజదుగ్ధములు శ్రీవలజాఱంగఁగ్రోలిబొజ్జపై। వ్రాలు దలుదాఱుచాఱలహివల్లభహారముజోఁడుకోఁడెగా। మెఱయఁగ బాలలీలలను దేలములాడుచుముద్దుఁజూపునా। కరిముఖుఁజూచినవ్వు శితికంఠుఁడుమాకొసఁగూర్చుసంపదల్॥ ... ... ✱

{భ్రాంతి మదద్యుక్తి సంబంధాతిశయో
క్తి రూపకాలంకార సంసృష్టిసీసము.}

౧౦॥ లఘుపదాహతినిర్దళద్రసాతలరవాశనిసద్భ్రమజపద్భుజంగరాజ। ముక్తిప్రక్రృత్తినాతోత్పతత్కాతుకీకంతుకీభవదద్రిగణరవమ్ము। మండలక్రమచరన్మకుటగంగావర్తమార్గభ్రమన్మరుమండలంబు। హస్తవిన్యాసవేగాభ్రగాశాకుంభిమక్షికాకాంతేందుమధుపదంబు। సప్తపాతాళసుగుణవజ్జలధిపటహ। మంబికాధవతాండవాడంబరంబు। పుత్రపౌత్రాయురారోగ్యభోగభాగ్య। శాశ్వతైశ్వర్యములుమాకొసంగుఁగాత॥ ✱

౧౧. సీ॥ జానకీరఘురామచంద్రఘోరవియోగకాండాకరప్లవదండవరము। మాల్యవదాదిసమస్తదానవపత్రరథకంఠపటువాగురాగుణంబు। సంజీవనిగ్రావజలరుహోత్పాటననిరుపమగంధసింధురకరంబు। లంకాపురీమహాలంకారమణిగృహాహుతిసమిద్ధరవీతిహోత్రముఖము। శస్త్రశౌర్యప్రశస్తప్రహస్తతనయ। ధారుణీధరవిదళనోద్ధతభిదురము। వాయుతనయముహోత్తాలవాలమెపుడు। దండనాధారదండమైదనరుఁగాత॥ ౧౨. క॥ రతిరాజజనకతుల్యుని। మతిరాజీవప్రభవునిమహనీయగుణా। రతిరాజదంతరంగుని।యతిరాజాచార్యుఁగొలుతునస్మద్గురుని॥ ౧౩. క॥ స్మరియింతునారదుఁబరా। శరుశుకాంగదువసిష్ఠుశౌనకుదాల్భ్యు। న్నరుఁబుండరీకుశుకునం। బరీషుఁబ్రహ్లాదుభీష్మువ్యాసు దనుజపుక్॥ ౧౪. సీ॥ వాగ్వధూభోగనీ వల్మీకు వాల్మీకు వరపురాణాగమ వ్యాసు వ్యాసు। సవవచశ్చాతురీ భవభూతి భవభూతి శారదా హృద్ధనచోరుఁజోరు। సూరిసీలాభ్రమ యూరు మయూరు సత్ప్రజ్ఞాసతీపంచ బాణుబాణు। సాత్వతీలోల మురారి మురారినుద్దండవిలోకన దండి దండిఁ। గావ్యరచనాను

హేలాల్లాసుఁగాళిదాసు । బహువిచిత్రకళాహర్షుభట్టహర్షు । సత్కవీశ్వరసంతతశ్లాఘుమాఘు । నభినవప్రీతినెంతయునభినుతింతు॥ ౧౫. క॥ అనవద్యశబ్దశాసను। ఘనునన్నయభట్టునుభయకవిమిత్రుని.దిక్కనమఖిఁబ్రబంధపరమే। శునెఱ్ఱప్రగడనుదలంతుసూక్తిప్రౌఢిన్॥ ౧౬. సీ॥ జల్లిమాటలఁ నపశబ్దములును జజ్జుటల్లికల్ ప్రావలందతుకుఁబలుకు। లునుపునరుక్తములును వట్టిపూఁదెలుఁగాకుఁదెనుంగులుఁగటువులేఁచ । లునుప్రాలుమాలికలును సందియములేమఱఁపులు మఱుఁగులు వ్యర్థపదములుర, వణమీఱుబడునైదు వాక్యదోషములుగనకయవి సరవిగనకమెఱుకులు । జిగిబిగిమెఱవడియు వడి సొగసులంద । చందములునంద చందముల్సందులుతెలి। యకవితాకవితలరాజహంస కవులఁ। గదసికావుకావనెడికాకవులఁకవులె॥

### ప్రతిజ్ఞాదికము.

౧౭. వ॥ అనినిఖిలదైవతాచరణంబును, ఆచార్యచరణస్మరణంబును, సుకవిబహూకరణంబును, కుకవినిరాకరణంబునుంగావించి॥ ౧౮. క॥సాహసమునఁగృతిసేయఁగ। నూహించితి రసికసుకవియూధమువినిసం । దేహముగలిగిననధిక। స్నేహమ్మునఁదీర్చి మేలుఁజేకొనవలయున్॥౧౯. తే. గీ॥ తప్పుగలిగినచోటనెయొప్పుగలుగు । సరసకవితాచమత్కారసరణియందుఁ। గప్పుగలిగిననీహారకరునివలన । నమృతధారప్రవృద్ధమై యలరినట్లు॥ ౨౦. తే. గీ॥ తప్పులనితోఁచునవియెల్లయొప్పులగును । మధుమధురమత్కవిత్వచమత్కృతిఁగన । రీతిరీతిగఁగనుపట్టుజాతికనక । మొరయఁబదియాఱువన్నెయైయున్నయట్లు॥ ౨౧. క॥ ప్రతిపద్యంబుఁజమత్కృతి। బ్రతిపదమునుబ్రౌఢిమవులబరగినకృతిస। త్కృతిగాకజల్లిమాటల। యతకడఁవుందడికసభలకర్హంబగునే॥ ౨౨. క॥ మునివచనంబులులెస్సగఁ। దెనుగించెదమనుచువానిఁదెలియకదెనుప । న్దెనుఁగునసంస్కృతమునుగా । కెనసినకబ్బములుసుకవులెంతురెసభలన్॥ ...

### ఉపమాలంకారసీసము.

౨౩. బహువిధాలంకారపరిపూర్తిఁజెలువొంది కమనీయశబ్దసంగతులనలరి। వృత్తసౌభాగ్యసద్వృత్తిరూఢిగఁజెందిబహుళార్థసంగ్రహ

భావములరి । చిత్రబంధమ్ములచే సోయగముమించిలలితకలధ్వనులను జెలంగి జాతివార్తా వాకరీతిశయ్యలమీఱినయనునుజవరదనమ్ముగలిగి । నట్టికవి తాంగనారత్నవలచువార । కాంతకైవడి బ్రోఁధిమ కతనదనదు । తలఁపు గీల్కొల్పి బుధులను వలవఁజేయ । మేలనిరసజ్ఞులగువారు మెత్తురెపుడు॥
౨౮. క॥ చెలుకుతుదనుండి మొదటికిఁ । బరగఁగరుచిగొన్నయట్టిభంగిని కృతియుఁ । సరణివినఁ ఱియుమఱియును । సరసతమధురిమముమీఱిచ పులీవలయుఁ॥ ౨౯. క॥ తోఁచినవగరచియింఁ చెదఁ। దోఁచనిచోఁజిలువ కట్టుదొరతోఁ జైనా, యాచకనెయానతిఁగ్యాఁగఁ । దోఁచదసాధ్యంబుకవనధోరణిసల్లఁ॥ ... ... ❋

❋ పంచపాదిసీసము. ❋

౩౦. శ్రీకరంబుగఁబదిరెండవయేఁటఁదాగావళ్ళుల్లుటయించిప్రౌఢిఁగన్న । మునిమునిమీసంబు మొనయునేఁటనె యమరశతకమొనర్చి కౌశలముఁగన్న । నిరువదియేఁటనుశృంగారమంజరియును హారణఁజేసిఘనతఁగన్న । నిరువదేనవయేఁటఁగృష్ణమల్లకథచతుర్భద్రజెప్పిసఁతుష్టిఁగన్న । మఱియునుబాలరామాయణద్విపదపాసంగించిబహువిధచాటుకవిత । నతిశయముఁగన్నినాడుఁజిహ్వాంచలంబు । తనివినొందమ కులదేవతావతంస । వేంకటేశ్వరచరణారవిందమహిమ । నవనవోన్మేషలేశవర్ణనలఁగాక॥ ❋

౩౧. వ॥ అనితలంపుచు నొక్కనాఁడు కర్ణాట తుండీర చోళ పాండ్యదేశాధీశ ముఖనిఖిలధరణీవర మణిదత్త మత్తేభ ఛత్త్రలాణిక పల్యంకి కాందోళికాది చిరత్నరత్నఖచిత రుచిరాభరణ గణప్రకాశిత విభవుండును, సద్గుణప్రభవుండును, శౌర్యఖడ్గపటిమధురీణుండును, చతుష్షష్టివిద్యాప్రవీణుండును, సనత్కుతాంత్రి నేత్రోద్భవోపమానాచ్ఛ ముక్తాగుళుచ్ఛచ్ఛవి సంకీర్ణకర్ణభూషావిశేష వదనుండును, దిగంతాయాతవిద్వత్కవి వాంతబంధు జనావన సదనుండును, నిరంతరాభ్యాగతభూసుధాన్నదాన నిష్ఠాతురుండును, ధర్మరహస్య పరిశీలన కళా విఖ్యాతుండును, దైనందినాజ్ఞానప్రాపిత పాపహరణ చుంచు చంచ దష్టాక్షరమంత్ర పఠనాసారుండును, ప్రభుసందేశ సకలలోకోపకార కృత్ప్రచారుండును, స

త్యవాక్యప్రతిష్ఠా గరిష్ఠుండును, సదాచారనిష్ఠుండును, అసాధారణ మే ధాఘటిత మంత్ర తంత్ర సంధానాబంధన గంధవాహ బాంధవనిర్గంధిత గంధాంధ దండనాథ యూథ స్కంధాపార పారావారుండును, శారదా శారద నారదా నారద పారదా పారద శార సౌరాహారహారాచల నీహార మందార వనీసార వనివంచిత సమంచిత శాశ్వత విశ్వజనీనకీర్తి విహారుండును, పరస్త్రీపరధన పరాఙ్ముఖ శీలుండును, దీనదయాళుండును, కాశీసేతుమధ్యస్థల ప్రసిద్ధనిజచరిత్రుండును, కృతసుధీజనస్తోత్రుండ నగు నేను నిత్యకృత్యంబులం దీర్చి, నిశాసమయంబునం గర్తుమకర్తుమన్యథాకర్తుమతిసమర్థ హరికృపాపాణింధమాపాంగ లబ్ధ బహువిధ భోజనామూల్య జాంబూనదాంబర సారగంధసారరుచిర విచిత్ర ఘనసార తాంబూల ప్రియకామినీ సంగీతగోష్ఠీసుమశయ్యాద్యష్టభోగాభోగ సంగతుండనై హంసతూలికాతల్పంబున వేకువం దేంకువగల సుఖసుప్తినున్నసమయంబున ॥ ౨౮. సీ॥ చక్రిదంష్ట్రోద్ధృత సర్వంసహా చక్రి చక్రివిదారణాశ్వంబువాఁడు । దానిరమావధూమానధనాదాని దానిరాడ్వరద సద్గిరివాఁడు । మాలితనుద్యుతి మర్దితఘనమాలి మాలిన్య విరహితమహిమవాఁడు । హరినీలాహ్వాయధారుణీ ధ్రవిహారి హరిద్రరుచిని చయంబువాఁడు । పాలమున్నీటిదొలఁకులఁదేలువాఁడు। లీలఁబోలదిండిమూఁకలఁబోల్చువాఁడు । వేలుపులచాలుసేవేళ నేలువాఁడు । బాలవేంకటశౌరినామ్రోలనిలిచె॥ ౨౯. తే. గీ॥ నలచిజలధరగంభీరనిస్వనమునఁబలికెనాతోడవీనులపండువుగను । మాకునంకితమొనరింపు మా కుమారు। యావిలాసంబునకు సాటియెందులేదు॥ ... ❋

❋ శబ్దచిత్ర సీసము. ❋

౩౦. సుకవిరాజులు గాని సుకవిరాజులుగారు పోలికనయభూరిభూరి గరిమ । గురుచంద్రములు గాని గురుచంద్రములుగారు తరముబుద్ధినిదానదానపటిమ । సద్బుధేంద్రులుగాని సద్బుధేంద్రులుగారు ప్రతియుక్తిసౌభాగ్యభాగ్యమహిమ । రాజభద్రులుగాని రాజభద్రులుగారు పాటిగీత్యనుభావభావకలన । క్షితినితనికనితఘనుసు తెంచఁబ్రతిభ గాంచి। తా

రలక్షణ లక్ష్యశబ్దార్థచిత్ర। రాజితాంధ్రకవిత్వ సామ్రాజ్యసతత। పాల
నాప్పయవేంకటపతికవీంద్ర॥ ... ... ✽

{నవగ్రహ నవరత్న నవనిధి నవరస
ప్రతిపాదక ప్రతాపసత్కీర్తిసీసము.}

౩౧. పద్మాప్తవిద్రుమప్రభఁగరుణఁగనిహిమ కరతశృంగార క
హిమ వెలసి। ఘననీలగురుమణిఘగరౌద్రతనుగేరి శంఖజకవులహాస్యంబుఁ
జేసి। త్ర్యాజవిగూరజౌఘముకుందభయమిడి కృతవజ్రవరతమస్థితశమమ
యి। బుధపుష్యరాగసాంకృతకచ్ఛఁబరగించి భానీలకు దభీభత్సమందఁ,
దగిమహాపద్మగోమేధికగరిమహర। వీరకేతుద్యుతిజయించి వేలువేలనీప్ర
తాపంబుసత్కీర్తి నెగడెనార। యప్పయామాత్యకవి వేంకటార్యవర్య॥

✽ అనులోమ ప్రతిలోమోపమాన పదషట్క ఘటితచరణ సీసము. ✽

౩౨. క్షితిలోనరాజగోపతికృష్ణకృష్ణగోపతిరాజులీడని పలుకవ
చ్చుఁ। జింతింపసోమకౌశికభద్రభద్రకౌశికసోములెవరని చెప్పవచ్చు। బా
గొప్పహరిహరి నాగారి నాగారి హరిహరులుద్దనియాడవచ్చు। నలువొం
ద శుక్రవ నవధర్మ ధర్మవనవశుక్రులెననీకనంగవచ్చు। ధనధృతిభృతిజ
యోక్తిగీతవితరణవి। భవగుణవిలాస శక్తిమాబలరుచిజవ। శౌర్యమతిద
యా శుచితాంగశాంతిసత్య। భావనీతులవేంకటపతికవీంద్ర॥ ౩౩. సీ॥
భూరిశృంగారంబు పొడగట్టినిలచిన పోలికఘనరసస్ఫూర్తి జెలఁగ। వల
పుబోవనినీటిపైఁదేలుపూవుఁజప్పరము దెలంగునభావమలర। వనధివీచిక
మీఁదవచ్చువాలుగవిధంబుననొకమిన్నగమ్ముకొని రాఁగ। నాడెమైననుఁ
గాంచు ననుఁగాంచు మనుచును బాణిముల్గలపదరాజి మెఱయ। మునువు
నిపుణఁగవులొనర్చిననువుఁదెనుఁగుఁ। గబ్బములలోనఁదెరనాటకంబులె
ప్ప। గావినికిసేయుగతినలంకారసరణి। వెలయరచియించుయప్పయవెం
కటార్య॥ ౩౪. సీ॥(✽అలవిన్నకోటపెద్దనలక్షణజ్ఞత)శబ్దశాసనకవిశబ్ద శు
ద్ధి। బాణబంధికపరమేశ్వరునర్థమహిమంబుభయకవిమిత్రునిపదలలితము।

---

(✽) ఈమహాకవి "కావ్యాలంకారచూడామణి" యను లక్షణగ్రంథమును
దెనుఁగున వ్రాసియున్నాఁడు.

శ్రీనాథువాగ్ధాప్రసిద్ధి నాచనసోము భూరికాఠిన్యంబు పోతరాజు। యమకవిధము నల్లయమనీషి చిత్రంబుఁబింగళిసూరికవివరుశ్లేష । నాంధ్రకవితాపితామహునల్లికబిగి। ముక్కుతిమ్మన తేఁటయుభూషణంబ । లంకృతియునీకెగలవౌతలంపలఘు । ణకవియప్పయవేంకటసుకవిచంద్ర॥ ... ✱




౩౫. తే.గీ॥ జగతిఁబాణినిలింగానుశాసనంబు। గామకవిలింగనిర్ణయక్రమమొకటెగఁ। జెప్పితెనుంగుఁగబ్బంబుఁజేసితౌర । గణపవరవార్ధిచంద్రవేంకటకవీంద్ర॥ ౩౬. క॥ అతులితవిద్యానాథ। ప్రతాపరుద్రీయభాసురసమంజరులన్ । గృతులెంచనాంధ్రకృతులుగ। వితముగఁజేసితివిసరసవేంకటసుకవి॥ ౩౭. సీ॥ అమరమునకుబదులభినవాంధ్రనిఘంటుఁగౌముదికైనయాంధ్రకౌముదియును । (✱గణపతిప్రాసలక్షణ సీసమాలిక) నాంధ్రప్రయోగరత్నాకరంబు । నిఖిలరేఫఱకారనిర్ణయపద్ధతి వట్ట్రత్యయములప్రస్తారసరణి। దగసర్వదాలఘుఛందములకు వచనంబుసమధికాలంకారసారమునుము।సత్కృతులుసేయుమాపేరనికెజెల్లుఁ। గాకనేఁడుకవులకునెట్లుగలుఁగనేర్చు । నొరసిశక్తియెక్కుడనైనఁగలదె। గణపవరమహనార్యవేంకటకవీంద్ర॥ ... ...

✱ ప్రతిచరణత్రిస్తబకయమకైకనియమభాసమానాసమానసీసము✱।

౩౮. కవనమా భువనమా నవనమా నయహారి నయహారి భవహారిజయముదయము । లవనమా యవనమా నవనమా నలభాతి నలభాకలరీతి నానుమేను। భవనమా సవనమా న్యవనమా యవికాసి యాసిపవిభాసి నదము మదము । జవనమా పవనమా నవనమా సుకృతిసుకృతితత్వకృతి విత్సుగతి జగతి । వదన మామద మాతుల సదన మానుననుచు ఘనులెంచి పొగడఁగ వినుచుఁగవుల। మనుము దక్షమీఱ నప్పయార్యునికుమార । లక్షణకవివేంకటమంత్రి లలిత తంత్రి॥ ... ✱

పైపద్యంబునకర్థము.

అప్పయార్యునికుమారలక్షణకవివేంకటమంత్రిలలితతంత్రి అనసంబుద్ధి!

---

(✱) (గణపతిసుసర్వాంగశోభితము అని పాఠాంతరము.

ఓయి వేంకటమంత్రీ! కవనమా - నీకవిత్వము (ఏలాటిదియనిన) భువన - జగమునమున్న. మా - లక్ష్మియొక్క, అనఁగా జగల్లక్ష్మియొక్క. నవన - స్తుతియొక్క. మా - మానమును. నయ - పొందుటచేతను. హారి - ఒప్పుచున్నది. నయహారి భయకారి జయము దయము - జయముదయము, జయముత్ - జయసంతోషముతోఁగూడుకొన్న. అయము - నీశుభావహవిధి (ఏలాటిదియనిన) నయ - నీతిని. హా - పోఁగొట్టెడి. అరి - శత్రువులకు. భయకారి - భయముఁజేయునట్టిది. లవనమా యవనమా నవనమా నలభాతి. లవనమా - ఖండనము. (ఏలాటిదియనిన) యవన - యవనదేశజులయొక్క అనఁగాఁదురకలయొక్క. మాన - గర్వమనే. వన - వనమునకు. మా - సత్వముఁగల, అనఁగా సూత్మ్మముగాని. అనలభాతి - అగ్నియొక్కరీతిఁగలిగినది. నలభాతిఁగలరీతి నానుమేను. మేను - నీశరీరము (ఎట్టిదియనిన) నల - నలమహారాజుయొక్క. భా - కాంతివలెననఁగా దేహకాంతిరీతి. అతి - మనోహరమైనకళఁగలిగిన. రీతి - ప్రకారముగా. అనుక్ - పూనును. ఇచ్చట నలునిసౌందర్యులలోఁ జేర్చిచెప్పినాఁడు. ఇందుకుఁబ్రయోగము, వసుచరిత్రము ౩ ఆశ్వాసము, ౪౪ పద్యము ॥నిజమంత్రప్రౌఢిరప్పింతునా। నలనాసత్యసమానుఁజూడుము॥ అనిప్రయోగము. భవనమాసవనమాన్యవనమాయవికాసి - భవనమా - నీగృహము (ఎట్టిదనిన) సవనమాని - సోమయాజులయొక్క. అవ - రక్షణమందు. నమాయ - మాయారహితమునై. వికాసి - ప్రకాశించేటటువంటిది. అవికాసిపవిభాసినదముమదము - మదము - నీపొగరు. (ఏలాటిదనిన) అవిక - రవిని. అసి - తిరస్కరించెడి. పవి - వజ్రాయుధము. భాసి (కరమునందు) ప్రకాశించెడియింద్రుని. అదను అణఁచునట్టిది. జవనమాపవనమానవనమాసుకృతిత - జవనమా - వేగము (ఎట్టిదనిన) పవన - వాయువుయొక్క. మాన - గర్వమునకు. వనము - స్థానము. అసుకృతిత - అధన్యత్వముఁగలది. సుకృతితత్వకృతివిత్సుగతిజగతి - జగతి - ఈభూమియందు. సుగతి - నీశోభనకరమైనప్రకాశము (ఏలాటిదనిన) సుకృతి - సత్కృవులకు.

తత్త్వ - తత్త్వమును. కృతి - చేయుటను. విత్ - తెలిసినది - వదనమా మద మాతులసదనమనుచు - వదనమా- ముఖము (ఎట్టిదనిన )మద - మన్మథునికి - మాతుల -మేనమామయగుచంద్రునికి. సదనము -ఉనికిపట్టుగాఁగలది-(కడమసుగమము.)

ఇందుకునిఘంటువులును ధాతువులును

ఇుస్తుతౌ ॥ మాఙ్ మానే ॥ ణీఞ్ ప్రాపణె॥ అవరక్షణె॥ అవయశ్శై అమేషార్కా॥ అనిఅమరము ॥అవిశేవ అవికః, స్వార్థేకప్రత్యయః ॥ అసుక్షేపణె ॥ ణినిప్రత్యయః ॥భాశ్చవిద్యుతిదీప్తయః॥ అనిఅమరము ॥ హన హింసాగత్యోః నయహా ॥ విదజ్ఞానే॥డుకృఞ్ కరణె ॥ ఇందిరాలోకమాతా మా॥అనిఅమరము॥ ఈవిధమునఁదర్కించగలవానినిజూడుఁడు.

* ద్రాక్షాపాకము *

౩౯. శా ॥ ఔరా హరివచోరసస్థితియహా వాశ్శబ్దదాంపత్యమ । య్యారే పాకబుజుక్రమంబుభళిశయ్యారీతులోహొూచమ । త్కారంబద్దిఅజాతివార్తలుపుగేధారాసమారూఢిమ । న్నారా రాజదలంక్రియల్ కవులలోమాన్యుండవీవన్నిటన్ ॥ * *

౪౦. క ॥అనియానతిచ్చినసుది । గ్గనమేల్కనియద్దిఅయ్యాగలిగెఁగదానేఁ । డనఘాలనాయకుఁడుమో। హనమత్కృతియెనెడికన్నెకనిముదమందన్ ॥౪౧. క ॥ నేనాదేవునిపేరను । నానావిధశబ్దగుంభనచమత్కృతిఁగాఁ ।బూనితినొకకృతిఁదద్దే। వానుమతిందత్కటాక్షమాధారముగాన్॥

కవివృత్తాంతము

౪౨, సీ॥ శోభితరామాయణోభయపరమభాగవతచరిత్రముఖప్రబంధ। బంధురవచనానుబంధనందవరాన్వయాబ్ధిచంద్రాయమానప్పనార్య ।నందనవేంకటనాథవరప్రసాదప్రసాదితకవితావిలాస।(కాటేపలీ)ముఖ్యగణపవరగ్రామశేఖరశిష్టవశిష్టగోత్ర। శోభమానాశ్వలాయనసూత్రమంత్రి।వర్యలక్షణకవి వేంకటార్యకుఁడు। మంగమాంబామణీగర్భమహితశుక్తి। మౌక్తికప్రతిమానసమానతనుఁడ ॥౪౩, క ॥ అమితౌశువు మధురముచి ।

( కామేపలీ ) అని కొన్నిప్రతులలోఁజూపట్టు ఈవిషయమునుపీఠికలోఁజూడఁదగు.

త్రమువిస్తారము చతుర్విధకవితలనుచి। త్రముగనువింశత్యవధా। నముల
స్ఫుటియించులక్షణకవివరుండక్ ॥ ౪౩, క॥పంకజభవభార్యాకర। కంక
ణఝణఝణనినాదకవితాపటిమన్। బొంకంబగులక్షణకవి। వేంకటపతి
మంత్రియనఁగ వెలసినవాఁడక్ ॥౪౪, క ॥మునుశ్రీహర్షుఁడు సంస్కృత।
మునఁజేయుద్విరూపకోశమునకుదినుసుగాఁ। దెనుఁగునద్విరూపకోశము।
ఘనులెన్నఁగఁ। జేసినట్టికవిచంద్రుండక్ ॥౪౫,క॥ జగతిన్వృత్త చతుష్ట
య।మగణితముగఁజిత్రకవితలైదిగ్వదిలోఁ। దగమెప్పుగనందగురూ ద్రి
గఁగల్పితకల్పలతఘటించినప్రౌఢక్ ॥౪౬ క॥వాణీవీణానిక్వణ। పాణిం
ధమపదనిబంధబంధురఫణుతుల్। రాణింపవసంతతిలక। భాణముఁదెనుగిం
చికీర్తిబడసినసుకవిక్ ॥ ౪౭. క ॥సకలకవులుపొగడఁగమా। తృకలన్ని
యువరుసనేసఁగనేదొలుదొలుతక్। జకిలిగఁగఠినప్రాసశ।తకరాజము
సేసినట్టిధన్యుఁడఁబుడమిక్ ॥౪౮, తే, గీ ॥రహిఁగఁబాణినియాచార్యరచి
తమైన। ప్రక్రియాకౌముదినియాంధ్రరచనచేత। సీసమాలికఁజేసిప్రసిద్ధిఁ
గాంచి।నట్టియప్పయకవివేంకటార్యమణిని ॥౪౯. క॥ ఎన్నఁదెనుఁగునకు
రాజను।గన్ననయతిరాజునకునురమణయకునునే।జిన్నదుద్విపదనొనర్ప
ను। జిన్నన్ననుబిరుదుగద్యఁజెప్పినఘనుఁడక్ ॥ *

*అపూర్వప్రయోగము*

౫౦, సీ॥( * నవనవముగనుజాంబవతీవిలాసమక్ జిత్రకావ్యమువిరచిం
పవశమె)। చండవిద్యావతీదండకరాజంబు సులభమేరసముహెచ్చగనొ
నర్ప।లాలితచక్రవాళాకృతిఁబాశాళిఁదరమెయస్యులకువింతనుఘటింప।
సఖిలపురాణసారాంశమిట్లలవియేయిలవిలాసంబుగాఁ దెనుఁగుఁజేయ।
వేంకటేశప్రసాదప్రవృద్ధసుప్రసిద్ధసారస్వతోద్బోధసిద్ధికతనఁ।గలిగె నీ
భాగ్యమని యెల్లకవులునన్ను।నెన్నసేసెన్నుకొనుటెన్నఁజిన్నగాదె ॥ *

౫౧, మ ॥ అనివార్యస్థితిధారుణీసురులు మృష్టాన్నంబు లాదిత్యనం।
దనువారమ్ములద్వాదశీవ్రతములక్ దర్వీకరేంద్రాద్రిరా। యనికిక్ బ్రీతిగ

* ప్రాసంబులిర్వదేఁబదియతుల్లక్షణంబుగసీసమాలికఁబూన్చవశమె)పాఠాంతరము

నారగింటంగసునిత్యాశీర్వచోన్వితశో । భనమంత్రాక్షతవర్ధమాన విభవ ప్రాప్తుండవైభక్తితోం ॥

---

## షష్ఠ్యంతకందములు

౧, విద్యాగరిమనిరస్తావిద్యాగతవాసనాత్మ * విద్యాగునకుఁ
సద్యోగర్భజహృదయాకల। సద్యోగునకవపకేళి * సద్యోగునకుఁ॥

౨. శరదాగమాబ్జకులితా।శరదారుణనేత్రయుగళ * శరదాభునకున్
వరదానవేంద్రనందన।వరదానునకున్నలప్ర * వరదానునకుఁ

౩. కమలాసనాదివిభునకుఁ।కమలాసనకార్యమిత్ర * కమలాసనహృ
త్కమలాకరలీలాకర।కమలాత్మునకునానతైక * కమల కరునకుఁ

౪, నిగనిగచిలుకమల వెలుం।గగనిదనరుసంతసంపు * గనినిండినప్రే
మగనియెడఁదెగనిమదిగ।మ్మగనిలిచినచిన్నికల్మి * మగువమగనికిన్

౫, పుడమిగరికపుగనితోడుకు । నడగనినడగను నొడయని * నాణెం (పుముంజే
కడియంపుబాసగుబ్బలి। నడవడిగలవిడిదినలరు * నలనాయనికిన్

౬ స్వార్థార్త్మకత్వవిరహిత।దోర్థార్శరహరణచండ * దోశ్చక్రునకున్
వార్థార్వావక్రునకమ।నార్థార్వళిస్వపదభక్తి * నతచక్రునకున్

౭, ఘృణికిన్ఘృణిజితఘృణికిన్।ఘృణికిన్నతతానువృత్తి * హిత ఫణికిన్
గుణికిన్దురగవిమణికిన్।మణికిన్నిత్యసకలనిగ * మవిపణిపణికిన్

౮, భార్ఙోపమానకంధర।శార్ఙామర్దననిరూఢ * సారభుజబలో
పార్జాస్త్రవప్రభునకున్।శార్ఙ్గిస్థల్యధిక శేవ * శైలవిభునకుఁ

౯, దక్షాహితరక్షాయత।దీక్షాయతిభువనభరణ * విభవున కసుర
ద్యక్షోధరవక్షోవర।శిక్షాకరభయదచక్ర * శీలభవునకుఁ

౧౦, లంకానాయకలలనా।లంకారాపహజయాక * లంకరతికమీ
నాంకసహస్రాకృతికిన్।వేంకటపతికిన్గటాక్ష * విభవోన్నతికిన్॥

ఈపద్యాంతములలో ౧ - ౨ - ౩ పద్యంబులకర్థములు.

౧. (అర్థము.) విద్యాగరిమ. విద్యావిశేషతచేతను. నిరస్త-పోఁగొట్టఁబడినటువంటి. అవిద్య-అవిద్యవలన. ఆగత-వచ్చిన. వాసన - చిత్తవిక్షేపముఁగలిగినటువంటి. ఆత్మవిత్ - బ్రహ్మజ్ఞానులయొక్క. ఆగునకుఁ పూజగలవానికిని. సద్యోగర్భజ వ్యాసులయొక్క. హృదయ. హృదయమందు. లసత్-ప్రకాశించుచున్న. యోగునకుఁ - కూటమిఁగలవానికిని. అవనకేళి- రక్షణలీలయే. సద్యోగునకుఁ- సదుపాయముగా గలవానికి.

౨. (అర్థము.) శరదాగమ- శరత్కాలమందలి. అబ్జ- కమలములతోడ. తులిత- సమానమైన. ఆశర-రాక్షసులకు. దారుణ భయంకరమైన. నేత్రయుగళ-నేత్రద్వంద్వముఁగలిగిన. శరదాభునకుఁ-మేఘకాంతివంటికాంతిగలవానికిని. వరదానవేంద్రనందన-రాక్షసేశ్వరునికొమరుఁడైనప్రహ్లాదునికి. వర-వరమును. దానునకుఁ- ఇచ్చినవానికిని. ఖలప్రవరదానునకుఁ. ఖల-దుర్మార్గులలో. ప్రవర- శ్రేష్ఠులను. దానునకున్-ఖండించువానికిని.

దానంగజమదే త్యాగే శుద్ధిఖండనయోరపి అని నానార్థరత్నమాల.

౩. (అర్థము.) ఘృణికికి - దయఁగలవానికిని. ఘృణిజితఘృణికికి- కాంతిచేతజయింపఁబడినసూర్యునిఁగలవానికిని. ఘృణికికి- నిస్పృహుఁడైనవానికిని. సతతానువృత్తిహితఫణిగుణికికి. నిరంతరమైనయనురక్తిఁగలిగి హితుఁడైనశేషునిచేతఁజేయఁబడినశారిఁగల యీశ్వరునిగలవానికిని. గుణికికి- షడ్గుణములుగలవానికిని. తురగవిమణికికి. తురగ- వాహనమైన. విమణికికి- పక్షిశ్రేష్ఠుఁడైనగరుత్మంతునిఁగలవానికిని. మణికికి- కౌస్తుభమణిగలవానికిని. నిత్యసకలనిగమవిపణిపణికికి. నిత్య- నిత్యమయిన. సకల- సమస్తమయిన. నిగమ- వేదములనెడి. విపణి- అంగడివీధియందు. పణికికి - వ్యవహరించుచుండెడివానికిని. పణవ్యవహారే స్తుతౌచ ॥ ఇతిధాతుః.

✽ వక్ష్యమాణలక్ష్యవిశేషోద్దేశవచనము. ✽

అంకితంబుగాఁబంకజాసన విలాసినీకరాంచల మణివిపంచికా ఘుమ

ఘుమార్భటి నిర్భరసుధాప్రాదుర్భావాస్పద నవరస గర్భసందర్భంబు గుఖాళిప విభవంబులకుఁ బ్రభవంబును, విద్యార్థులకు హృద్యంబును, విద్వాంసంబులకుఁ జెన్నును, వింతలకుఁ బొంతనంబును, విటవిటీజనంబులకుఁ బుటపుటయును, విరహులకు మెఱమెఱయును, వీటికి నీటును, శబ్దశాస్త్రరీతికి విఖ్యాతియును, ధ్వనులకు నునికియును, ఉక్తాత్యుక్తాదిగాఁ గలయిరువదాఱుఛందంబులకుఁ జందంబును, కావ్యాలంకారచూడామణికిఁ గావ్యాలంకారసంగ్రహమ్మును, సకలాలంకారమ్ముల కలంకారమ్మును. లక్షణసారసంగ్రహ సరస్వతీవిలాస సాహిత్యచింతామణి సత్కవిజనసంజీవని భీమానంతఛ ఠోముఖ్యాష్టాదశలక్షణంబులకు లక్ష్యమును, రేఫఱకారనిర్ణయమ్ములకు నయమ్మును, యమకమ్ములకు గమకమ్మును, అమరామరశేష- విశ్వ- శాశ్వత శబ్దార్ణవ- యాదవ వైజయంతికాకార నానార్థరత్నమాలికాకార- హలాయుధ వాగురి కేశవ తారపాల-ధరణి- ధన్వంతరి ధనంజయ- రభస విశ్వప్రకాశ- మాధవ- చింతామణి జయప్రతాప- శుభాంగ - జయపాల - క్షీరస్వామిప్రణీతచతుర్వింశతి వివిధ నిఘంటు పదమ్ములకుఁ బదమ్మును, షష్టివిధయతిచమత్కారములకాధారమును, చతుర్వింశతిప్రాసమ్ములకావాసమ్మును, ప్రౌఢికిఁ బ్రౌఢియును, తేటకుఁ దేటయును, చిరంతనాంధ్రప్రబంధ జాలంబుల కాలవాలంబును, సనాతనవిద్వత్కవి వితానరచనా విధంబునకు ఘంటాపథంబును, ఇదానీంతనసత్కవినికాయంబునకు సహాయంబును, భవితవ్యకవికలాపంబునకు నాచార్యరూపంబును, నిఖిలభాషావిశేషంబులకు స్మేషణంబును, మూఢజాతులకు బోధహేతువును, ప్రౌఢతతికి సమ్మతియును, సర్వజనకరంబున కాశ్చర్యకరంబును, బహువిధాచుంబితకవితాచమత్కృతికి వసతియును, నగరార్ణవశైలర్తు చంద్రసూర్యోదయోద్యాన సలిలకేళీమధుపాన సురతివియోగ వివాహ కుమారోదయ మంత్రద్యూతప్రయాణ రణనాయకాభ్యుదయ వర్ణనాతిశయంబున కాశయంబును, అన్యాన ధీన సుధీన వనవస్తవ్య సర్వపథీన పాండితీ మండిత చమత్కారంబుగా నారచియింపఁబూనిన రసికజన హృదయోల్లాసంబైన ప్రబంధరాజవిజయవేంకటేశ్వర విలాసంబునకుఁ గథావిధానం బెట్టిదనినః—



శ్రీ శ్రీధరాయనమః.

## శ్రీప్రబంధరాజవిజయ వేంకటేశ్వరవిలాసము.

### ఏకాశ్వాసము, సవ్యాఖ్యానము.

కథాప్రారంభము.

✱ వేంకటాచలపట్టణవర్ణనము. ✱

✱ అనుప్రాసయుక్తాక్కలివడిసీసము. ✱

౧. సింధురచితపాన బంధురాభ్రవితాన సింధురకటదాన గంధలీన। మారవపవమాన సారవజ్జవమాన గౌరవహాయమాన సారమాన। మసమాన శరమాన లసమాన తేజోనలసమాన ధరణీనరసనిధాన। మమరనాథవిమాన సమరజయనిధాన సమరథాత్యుద్ధాన కమనయాన। మమితగోస్పర్ధిఘనగోపురాగ్రభాగ। నిరతరమణీయహీరమణీకదంబ। విశదకాంతివినిర్మితదశదిశాంత। ఘట్టనము వేంకటాచలపట్టణంబు॥ ... ✱.

### పైపద్యంబునకర్థము.

సింధు- సముద్రములయందు. రచిత- చేయఁబడిన. పాన- పానముకలిత. బంధుర-బలసిన. అభ్రవితాన- మేఘౌఘములవంటి. సింధుర- ఏనుఁగులయొక్క. కట- గండస్థలములయందలి. దానగంధ- దానమనేమదవాసనచేత. లీనము- కూడుకొన్నటువంటిదియు. ఆరవ- అంతటధ్వనిగలిగిన. పవమాన-వాయువుయొక్క. సారవత్ సారవత్తైన. జవ-వేగముయొక్క. మాన- సమున్నతియొక్క. గౌరవ- ఆధిక్యమువంటి. హాయ- గుఱ్ఱములయొక్క. మాన- సంపదచేత. సార- శ్రేష్ఠమయిన. మానము- పొఙ్గ

రుఁగలిగినదియు. అసమాన- సమానములేని. శరమాన-శరదండముచేత. లసమాన- ప్రకాశించుచున్న. తేజః- తేజముచేత. అనల-అగ్గిరీతి. సమాన- ముఖ్యమయినటువంటి. ధరణీన- రాజులయొక్క. రస-రసములకు, నిధానము- స్థానమగునట్టిదియు. అనరసనాథవిమాన - దేవేంద్రునివిమానమువలె. సమరజయనిధాన- యుద్ధజయాదికారణమైన. సమరథాత్యుద్ధానే. సమరథ-సమరథములయొక్క. అత్యుద్ధాన - అత్యున్నతిచేతను. కమనయానము- ఒప్పుచున్నటువంటియానముఁగలిగినదియునైన. వేంకటాలపట్టణము- (ఏరీతిఁబ్రకాశించుననఁగా) అమిత విస్తారముగా. గోస్పర్ధి- స్వర్గముతోవిరోధముగలిగిన. ఘనగోపుర - పొడవుఁగలగోపురములయొక్క. అగ్రభాగ ఉపరితలమందు. నిరతరమణీయ- ఎల్లప్పుడుప్రకాశించునట్టి. హీరమణీకదంబ- వజ్రపరంపరలయొక్క. విశదకాంతి- నిర్మలమైనకాంతిచేత. వినిర్మిత- నిర్మింపఁబడిన. దశదిశాంత-పదిదిక్కులయందుఁజేయబడిన. ఘట్టనము- త్రొక్కుడుగలది.

ఇందలి మానసమానపదములకు నిఘంటువు.

మానశ్చిత్తసమున్నతిః ॥ సమానస్సత్యమైకేస్యుః॥ ఇత్యమరః॥

{ముద్రాలంకారయుక్తవింశత్యుత్త
రశతవృత్తగోపనోదాత్తవచనము.}

౭. మఱియునప్పురవరంబు మందాక్రాంతఫలసదనవనమంజరీమందారసరసిజోత్పలమాలికా సుగంధిసుందరీ కనకలతా మణిభూషణ ప్రభాకలితంబై, రుచిరప్రభాతభాస్కరవిలసిత మణిదీపికామణి వితానకాంతిచామరపుష్పదామచంద్రకళవంశస్థాన మణిమాలికాసుందరంబై, భూతిలక వసంతతిలక కుసుమితలతావేల్లితమనోహర వాతోర్మినదిప్రఘోషప ణవద్రుత విలంబితలయగ్రాహి విహితోజ్జ్వలహారనర్తన వనమయూరమత్తకోకిల భ్రమరవిలసిత హంసశ్రేణిక్రౌంచఖచరప్లుతఘనోజ్జ్వలంబై, మేదినీజలధరమాలాకేతు మన్మహాస్రగ్ధర భాసురోత్తమాంగభద్రక మత్తేభవిక్రీడితంబై, భూనుత విభూతికాంత వినయ కవిరాజవిరాజితంబై,

సింహారేఖోత్సాహ శరభక్రీడాశార్దూలవిక్రీడిత ప్రహరణోత్స వీగవి లసిత మత్తాపరాజితేంద్ర శ్రీకుమార లలితతురగ త్వరితపదగతి బ ధు రంబై, మేఘవిస్ఫూర్జిత తరల విద్యున్మాలా సుకాంతి మానినీ మదనవిల సిత ప్రముదితవదన రతిప్రియప్రియకాంతంబై, చంద్రికానిశావిచిత్ర భు జంగప్రయాతంబై, ప్రగుణమృగనాభిశాలినీ మాలినీ భుజగవిజృంభిత వీ ణారచన మధురోద్ధత గీతాలంబన మణిరంగచిత్రపదంబై, మదరేఖాలస గతి గజవిలసితాశ్వ లలితరథగమన మనోహరంబై, వంశపత్ర పతిత జ లోద్ధతగతి కమలవిలసిత హరిణీ కవికంఠభూషణ హంసరుత భ్రమరవి లసిత త్ర్యామహార బింబపద్మ సుకేసరంబై, సింహోన్నతవరవక్త్రప్రలాశ దళ పృథ్వీభుజంగంబై, క్షమాలక్ష్మీకళాజిత ప్రతాపపద్మనాభ ప్రియం దాష్టమూర్తియై, సర్వతోముఖమంగళ మంగళమహాశ్రీకలితంబై, వృ త్తరత్నాకరంబుం బలె నలరుచుండు వెండియు ॥ * *

౩. ఉ ॥ జాతులమించి పల్లవరసస్థితియుక్ సుమనోవితానని । ఖ్యా తివహించి శాఖలఁబ్రకాశమునొందు సుభాషితద్విజ । వ్రాతముఁ గల్గి కాంచనపరంపరలన్ గణికానికాయసం । భూతవిలాసమున్ వెలయఁ బొల్చుఁ బురమ్ముఁబురీవనమ్ములున్ ॥ * *

* ఉపమాలంకారము. *

౪. సీ ॥ కమనీయయంత్రతంత్రములచే విలసిల్లి సన్మార్గలంఘన సరణిఁ దనరి । పైపూఁతవన్నియల్ పచరించియంచిత మణిమాలికాస్ఫూర్తిఁ గణ నకెక్కి । చిత్రాంశుకనిరూఢిఁ జేసి యగముమించి పరిఖాప్తి నెంతయుఁ బరిఢవిల్లి । జోకమీఱభుజంగ లోకసంగతిఁ గాంచి ప్రద్యుమ్నలీలల రహి వహించి । శోభమానకవాటంపుసొంపుమిగిలి । సతత సుఖ్యాతిమహిమ జేసంతసిల్లి । వెలయువిటవర్యురీతి నప్పేటికోట । కదియుకొమ్మల సౌం దర్యగరిమవలన ॥ * *

౫. వ ॥ అట్టివిశాలంబగుసాలంబునకుఁ గ్రొత్తడంబు ఘటించుకొత్త డంబున ॥ * * *

* ప్రకృతాప్రకృతశ్లేష. *

౬. సీ॥ అలనృసింహునియద్దినాగ్రహదశనొందియగుఁగ్రినివలెఁజాల సుకుర్మీటి। నలినసంభవుమాటకొనలుముఖంబులనాని తమ్మియందమున జాళమ్ముఁగాంచి। సత్ప్రబంధముపోల్కిసారధ్వనినిగుడ్చి శక్తిభృద్గతిశిఖియుక్తినొంది। సూకరపతిమేరనేకపద్ధతిఁబూని యలరువిల్తునిభంగినవతనుతఁగని। ద్రుమముపహినున్నచోటఁబాఁదుకొనియుండి, తుటికవైవడి నల్లమందుపాడిమెక్కి।రాజువిధమునసరిపురిరాజివేచి, వటిలునోడకనె పరంగివగపిరంగి॥ * *

౭. తే. గీ॥ అన్నమునసున్నమునసృపుల్బన్నమొంద। నెన్నిమందులిదుదురారయెన్నిమంకు। లట్టిదొకశూరకర్మమె యనునెట్టి। యెల్లమందులగెలుపొందునల్లమందు॥ ౮. పంచచామరవృత్తము॥ కుటింగటస్ఫిరంగిగుండుగుండువారిదారిమే। దురంబునాదురంబులో నెదుర్కొనంచెనంగుచోఁ। బరస్ఫురత్తురంగపాళిచాళిఁదాఁకిదాఁకితచ్ఛరీరపారవశ్యకృత్ప్రసంగిసంగతిందగున్॥ * *

* ఉత్ప్రేక్షాలంకారము. *

౯. క॥ పరిఖాజలగతకైరవ। సరసిజములుగగనతార సమితియుఁ దనరన్। బురవప్రలక్ష్మిపదముల। శిరముననర్పించువిరులచెలువంబనఁగన్॥

* రూపకాలంకారము. *

౧౦. చ॥ పరిఖనువార్ధిలోఁగలయపారతరంబగు స్వర్ణముల్ పయో। ధరవరతస్కరుండుగొనిదాటఁగఁదత్పురలక్ష్మిగాంచిభీ। కరమణిగోపురోపరిముఖధ్వజహస్తముసాఁచిమోదపాం। డురకరకాళిదంతములు దుల్లఁగసీరదసంజ్ఞవర్తిలున్॥ * *

౧౧. క॥ ప్రాసాదకేతువులుమరు। దాసాదనమునఁజరించనవిమత్పురికిన్।వాసవపురియెనయేవివి।ధాసమవైభవములందుననుగతిఁదెలుపున్॥

* అక్కలివడిసీసము. *

౧౨. సురవైరిసోమకాసురహరణాత్తభా సురవేదముఖర భూసురగ

ణంబు । జన్యకుంభిన్య సౌజన్యాభియాతిపర్జన్యోగ్రపవనరాజన్యకంబు । భవసఖనిధిపరాభవచమత్కృతిపటూభవదమితధనూరుభవకులంబు । ధరవహాగ్రజబలోద్ధరణకేళివిధాన ధరశక్తియుతహాలధరజనంబు । చతుర కవిబుధగాయనసచివరసిక । నటవిటీవీరరాహుత్తభటచయంబు । దనరు నప్పురి మహిమంబుధాతకైన । భుజగకులనేతకైనను బొగడఁదరమె ॥

పైపద్యమునకర్థము.

సురవైరి - దేవతలకువిరోధియైన. సోమకాసుర- సోమకాసురుని. హరణ - హరించుటచేత. ఆత్త - పొందఁబడిన. భాసుర - ప్రకాశించెడి. వేద - వేదములచేత. ముఖర - మ్రోయుచున్నటువంటి. భూసురగణంబు - బ్రాహ్మణసమూహముగలది. జన్యకుంభినీ-యుద్ధభూమియందు. అసౌజన్య - సౌజన్యరహితులైనటువంటి. అభియాతి - శత్రువులనియెడి. పర్జన్య - శరదములకు. ఉగ్ర - భయంకరమైన. పవన - వాయువులగు. రాజన్యకంబు - రాజసమూహముఁగలది. భవసఖ -శివునిమిత్రుఁడగు కుబేరుని యొక్క. నిధి - నవనిధులను. పరాభవ _ తిరస్కరించుటయందలి. చమత్కృతి - చమత్కారమందు. పటూభవత్ - సమర్థమగుచున్న. అమిత - అసంఖ్యమైనటువంటి. ధన - ధనముఁగలిగిన. ఊరుభవకులంబు - వైశ్యసమూహముఁగలది. ధరవహాగ్రజ - గిరిధరుఁడైనకృష్ణుని అన్నయైన బలరామునియొక్క. బల - బలమును. ఉత్ - ఉన్నతముగా. హరణ-హరించెడియందలి. కేళి - విలాసమును. విధా- చేసుటచేతను. అనధర _ కొద్దిపడనటువంటి. శక్తియుత - సామర్థ్యముతోఁ గూడుకొన్న. హాలధరజనంబు - హాలికులనియెడి జనులుగలిగినది. ( కడమ సుగమము )

౧౩. తే, గీ ॥ పుష్కరస్ఫూర్తిఁజెన్నొంది భూరిదాన । పటిమ చేమించి వైరిప్రభంజనప్ర । శక్తిఁగని నీలరుచిఁబొల్చి సరసగతుల । ఘనములన మీఱు నప్పురిగజచయంబు॥౧౪. తే. గీ॥ అమరలక్షణములను ఛందములమీఱి । యతులగతులను బదచమత్కృతిఁజెలంగి । కందములమించి సత్క

వికావ్యసరణిఁ। బొలుచునుత్తమహయములప్వరమునందు ॥ ౧౫. చ ॥
చిలుకపతాకయున్జెఱుకుసింగిణియున్విరియంపకోలలున్ ।దొలఁగఁగఁజే
సి తత్పురముతోయజగంధులతో విహారము । ల్సలుపఁగ వేడ్క-తోడ బలు
జాడలరూపులుదాల్చి నట్టిపూ । విలుతునిమూర్తులోయనఁగ వీట విటుల్
జరియింతురెప్పుడున్ ॥ * *

* రూపకాలంకారము *

౧౬. చ ॥ అలకలెజాలసూత్రములుహారసమంచితరత్నరాజియు ।వ్వ
లయము పూసలాత్మచెలువంబగు పుట్టికగాఁగఁగామినీ । కులమనుధీవర
వ్రజము కూరిమిచేష్టల మేఁతచేతఁజూ । పులవలజిక్కఁజేయు విటపుంగ
వమత్స్యములన్బురాంబుధిన్ ॥ * *

*అపూర్వప్రయోగము.*

౧౭. చ ॥ అలుగువహిన్వెలార్చి పొగరందముమీఱుచు స్నేహమూ
నుప ।ట్టులనోరపైదలిర్చియుదుటున్గసుచున్నసమాస్త్రికేళిలోఁ ।బలు
మొనలాని మాత్మగలపగ్గెలు తగ్గులుజేసిపోవులునన్ । గలసి చరింతురెవ్వి
లువకత్తెలుమాయసికత్తులోయనన్ ॥ * *

*రసపారిధాన్యరూప ద్విరుక్తిసీసము.*

౧౮. మిలమిలబెళుకుచూపులుపేరెములుబాఱఁగలగలగజ్జెలు గులుక
రింప । ఝుణఝుణహస్తకంకణములుమోయంగ గణగణ మొలనూలు
గంటలులియఁ । దళతళకమ్మలు తళుకుఁజెక్కులుడాయఁగిలకిల నగవులు
సొలపులీన । గమగమమైకదంబములుగుభాళింపరివరివగుచ్చెలరవణమెస
ఁగ । మిసమిసలరత్నభూషణమ్మెఱయమెఱయ । రవరవలగుబ్బలొండొం
టి రాయుచుండ । నిగనిగఁగడాని కాశెలుజిగిదొలంక ।మినమినమెఱుం
గురంగునెమ్మేనులలర ॥ * *

౧౯. సీ ॥ తులకించుజిలుఁగుదువ్వలువపైఁటచెఱంగు జాఱువాపొళ్లు
వసంతమాడఁ।జెమటకస్తురిబొట్టుచెమరిఫాలములపైనలకంబులకువింతచె
లుపుఁదెలుప । జడలసడ్లినవన్నెసరులఘుమ్మనితావి మిండతుమ్మెదలకామె

తలుసేయు । బిరుదండెలర్ఘుళంఝుళరవమ్ములు త్రివండిసమితిగుండెలుఝల్లుర్ఘుల్లుగానంగ । సౌలపునడపులగౌనులు నులివడంగ । బిరుదులకుగాంగ నొరయుచుంబురముపీధి । మేళములంగూడి విటులతో మేలమాడి । కొనుచు వత్తురు వెలజాతికొమిరెలెపుడు ॥ ౨౦. ఉ ॥ వాడంగనీకంగొప్పివ్వరులువాసనకున్స్వరువంపుసంపదల్ । పీడంగనీకంబుపొడులు వేమలుపోవరిగాడ్పుసోంకులన్ । గూడంగనీకంబల్లవులకోరిక లీరిక లెత్తకేళివలన్ । బూడగనీక నమ్ముదురుబోటులు దప్పరింబూవులెప్పుడున్ ॥ ౨౧. సీ ॥ ఇందురమ్మనుచుంజోటిచ్చి తివాసిపైంజెయివట్టిగూర్చుండంజేసియతనిం । దోడతోడం దొడంజేర్చి గడుమంచిబుక్కానుంబూతుగాకంచు ముంజేతనునిచి । కట్టిజవ్వాజిచొక్కమటంచుంజెవులందుంజేర్చి చెక్కలగోరంజేరందీసి । గంబురాయిట్టిదెక్కడలేదుచూడుమాయని రవకనురెప్పలందుంజరిమి । యిట్టిచెయ్యలంగూరిమింబుట్టజేసి । పల్లవులచేతరొక్కమప్పరిమళములు । వెలలపేరిటదోచియువ్విటంబొల్తు । రలరుసరులమ్ముప్రాయంపు టలరుంబోండ్లు ॥

*నారికేళపాకము.*

౨౨. సీ ॥ సారవత్ప్రవరోజ్జ్వలదంఘ్రిశృంగారనూపురంబలిబిలిగోపురంబు । గణనదుర్లభమణిగణఘృణిచుంబితగోపురంబలిబిలిగోపురంబు । ఘనమునిజనచిరంతనపుణ్యసగణికి దాపురంబలిబిలిగోపురంబు । కీర్తితమోక్షలక్ష్మీపక్ష్మలాక్షికిం గాపురంబలిబిలిగోపురంబు । కాంతచిత్రవర్ణనితాంతకాంతియుతవ । నీపథమధులిట్శుకపిక నికరకలక । లారవావృత వృషభాచలాగ్రమునకు । మూపురంబైనయలిబిలిగోపురంబు ॥ *

*వృత్త్యనుప్రాసము.*

౨౩. తే. గీ ॥ హరియుహరియును హరియుంగాసరియుం గరియుం । గిరియుంగరియును బలుసెమ్మిపురియుదరియు । దరియుర్ఘురియును జమతియు విరియుసురియు । నరియుగంబునుదనరియుండవ్వచరియు ॥ *

౨౪. సీ ॥ కొండలరాయనింగొలుచుకవులకు బంగారంపు ముడుపు

మోకాళ్ళముడుపు । పరమదాసవ్రాత పాపంబులెల్లనుగడలకుండుడుపు
మోకాళ్ళముడుపు। దిటమున నెక్కునెంతటివారికోదవించుఁ గన్నంతజడు
పుమోకాళ్ళముడుపు । నానాదిగాగత నరసంతతికిఁబునర్గమనంబు లుడు
పుమోకాళ్ళముడుపు । తడుపులిడనట్టి మేనులువిడఁపుఁజూపు । నొడుపు
మదినెంచి తపములుగడుపుమునుల ।పొడవులెత్తిగించుజేఁకటినిడుపుగుహ
ల । కడుపాలుపలరు నిడుపుమోకాళ్ళముడుపు ॥ * *

*యతిభేదము.*

౨౫. ఉ॥ స్వామితమోపహారి కురుసారససారససారసారజా । తా
మితభంగచారికి మదానవదానవదానవర్ధిత । శ్యామతనూవిహారికళిజాల
కజాలక జాలకాతిద । క్షామలకైరవారికవిసారవిసార విసారధారికిన్॥

పైపద్యంబున కర్థము.

స్వామితమోపహారికిన్ - స్వామి - కుమారస్వామియొక్క స్వామి
శబ్దమునకునిఘంటువు, స్వామీ స్కందేపి అని నానార్థరత్నమాల. త
మః - అజ్ఞానమును. అపహారికిన్ - పోఁగొట్టెడిదానికిని. ఉరుసారససార
ససారసారజాతామితభంగచారికిన్ - ఉరు అధికమైన. సారస - సర
ససంబంధమైన. సారస - తామరలయందలి. సారసంసరసీరుహమనియ
మరము. సారస - బెగ్గురుపక్షులయొక్క. పుష్కరాహ్వస్తుసారసః అని
అమరము. అర - శీఘ్రముచేత. శీఘ్రంత్వరితంలఘుక్షిప్రమరందుత్రమని
అమరము. జాత - పుట్టిన. అమిత - అధికమైనటువంటి. భంగ -తరంగ
ములచే. చారికిన్ - సంచలనముగలదానికి. మదానవ దానవ దానవర్ధిత
శ్యామతనూవిహారికిన్. మద - మదముఁగల, అనవ - నూతనముగాని.దా
నవ - దనుజులను. దాన - పరిశుద్ధిచేయడముచేత. దానంగజమదేత్యాగే
శుద్ధిఖండనయోరపి అనినానా. వర్ధిత - వృద్ధికాఁబడిన. శ్యామ - నల్లనై
న. తనూ - దేహముచేత. విహారికిన్ - ఒప్పుచుండేదానికి. అళిజాలకజా
లకజాలకాతిదక్షామలకైరవారికిన్. అళిజాలక - తుమ్మెదలసమూహము
లకు. జాలక-వలలుగానుండెడు. జాలక - మొగ్గలచే. అతిదక్ష - మిక్కిలి

సమర్థమై. అమల - నిర్మలమైన. కైరవ - తెల్లగలువలయందలి, అరికిన్ - చక్రవాకములుకలదానికి- జాలంజాలకమిత్యేతెగవాక్షా నాయమార్గణే। దంభకుట్మలయోశ్చాపి॥ అనినానార్థరత్నమాల. అవిసారవిసారవిసారధారికిన్ -అవిసార-బలిష్టమైన-విసార మత్స్యములయొక్క-విసారశ్శకలీ అని అమరము. విసార - విశేషమైనబలమును. ధారికిన్ - ధరించినదానికనని క్రిందిపద్యముతోనన్వయము.

౭౬. క ॥ హారికిరినేత్రపాలిత । వారికినిజదాసదురితవారణరాజీ । వారికిశ్రిత కవిరాజికి । వారికిఁగోనేరికతులమగసిరులిడుచున్ ॥౭౭.సీ॥ వెలసిపూదేనెకాల్వలనిగుడ్చునురేపునెత్తావితెమ్మెరల్నినుచుమాపు । వలకారిదొమ్మితేఁటులనల్లడలరేపుమరునకందిచ్చుముత్తరముతూపు । సంజీవనీముఖౌషధులనెల్లెడఁజూపుఁబుణ్యాంపుఁదోఁవకుఁబూటకాపు । శుకపికశారికానికరంబులకుఁబ్రాపుబడలికలన్నియుఁగడలబాపుఁ । జిన్నిచిగురులనింగినిజేయుతోపు। తేటకొమ్మలకొనలమిన్నేటిదోపు । పువులవెలయుచుఁబాపముల్దివియుతోపు। లుద్దిలేదనఁదగుతోపుపెద్దతోపు॥ ✽

✽ ఉభయస్ఫురణము.✽

౭౮. చ॥ కనకనగాధినాయకశిఖాముఖజాగ్రదుదగ్రశీఘ్రలం । ఘనఘనకాంచనాబ్జకళికాతిలకాళిగరుద్గురుస్ఫుటాం । జనజనకప్రభాసితలసత్సితసారసనంగభంగమ । జ్జనజనకల్పితాభిమతసత్పురుషార్థముపాందుతీర్థముల్॥ ✽ ✽

పైపద్యంబునకర్థము

కనకనగాధినాయక - మేరువుయొక్క. శిఖా - శిఖరములయొక్క, ముఖ- అగ్రములయందు. జాగ్రత్- ప్రకాశించుచున్న.ఉదగ్ర అధికమైన. శీఘ్ర- వేగముఁగల. లంఘన- గతిగలిగిన. ఘన- మేఘసదృశములయినటువంటి. కాంచనాబ్జకళికా బొందామరమొగ్గలయందు. తిలక- తిలకప్రాయముగానుండే. అళి- తుమ్మెదలయొక్క- గరుత్ - తెక్కలయొక్క, గురు- అధికమైన. స్ఫుట- వికసించినటువంటి. అంజనజనకప్రభా- కాటు

కనుపుట్టించెడిప్రభ చేతను. అసిత- నల్లనై. లసత్ - ఒప్పుచున్నటువంటి. సితసారస- తెల్లదామరలయొక్క. సంగ- కూటమిగలిగిన. భంగ- అలలయందు. మజ్జన మునుగుచున్న. జన- జనులకొఱకు. కల్పిత కల్పింపఁబడిన. అభిమత- ఇష్టమైనటువంటి. సత్పురుషార్థము-ఒప్పుచున్నధర్మార్థకామమోక్షములుగలిగిన. పాండుతీర్థముప్రకాశించుననిక్రియ అధ్యాహారము.

౨౯. సీ॥ సంతతతపనితసజ్జన వృజినవిభంగముహురజహజ్జహద్బహువిహంగ । లసితసముద్ర భటసముద్రవరసంగ సకల తీర్థైక నిజప్రసంగ । యుత్పత్తిధ్వనిదదర్భ్యభయపార్శ్వరథాంగగౌరీశవిశ్రుతమనోరథాంగ । మృదులవాసితగంధకదళికేతకులవంగధరణీరుహాగ్రపతత్ప్లవంగ । యూర్ధ్వసారంగసారంగయుక్కుడుంగ । కలితసారంగముఖవిహంగముపతంగ । పుంగవగరుద్గణానిలభంగురాంబు । కణమణిఖచితశృంగ యాకాశగంగ ॥ ౩౦. సీ ॥ కాండపాండిమహారి గగనధున్యుపమానహాటకపంకేరుహప్రసూన । కమనీయనవనీతఖండహాసనఫేనమహనీయ తరజీవ మణినిధాన । నాగాహితపాత్రిహముణకనిమంత్రణమీనపులినఘనానానాగఫలవితాన । సతతనిజస్నాతసాధుకిల్బిషదానసతతవీచిగాతిరస్కృతనదీన । దానవారాతిపాదపద్మభరలీన । మానసానూనసోనూయ మానదీన । మానవారికి గురియు హిమంపుసోన । వానమాపు మొకముబయకానికోన ॥ ✱

✱ శబ్దార్థోభయశ్లేష ✱

౩౧. మ ॥ తనులాపుల్ప్రకటింపుచుక్ మొగములక్ దట్టంపుఁగెంపుల్ జనిం। పను దారమ్ముగ గా జహంసతతిపద్మవ్యూహముక్ జొచ్చినే ।ర్పునఁ దద్వాహినియందమందతరివారుగ్గాంచుచుక్ జోడువీ। డనిమత్తారికులంబు తోరణముజంటక్ జేయులీలాగతిక్॥ ✱ ✱

✱ గౌడరీతి ✱

౩౨. చ॥ అగమహిమావలోకనసహస్రఘనాఘనఘోటకీభవ । త్ప్రిగుణ ఘనాఘనౌఘ నిభ భద్ర ఘనాఘన సంఘ చంకన । ద్గగన ధునీ

పనీపతదఖండఝురీలహరీపరంపరా । త్యగణితఘుంఘుమార్పితగుహాప్ర
తిఘోషము ఘోష మొప్పగున్॥ ... *

పైపద్యంబునకర్థము.

అగమహిమావలోకన. అగ - (వేంకట) గిరియొక్క. మహిమ- మహిమను. అవలోకన- చూచుటయందు. సహర్ష - సంతోషముతోఁగూడికొనిన. ఘనాఘన- దేవేంద్రునియొక్క. ఘోటకీభవత్ - గుఱ్ఱములగుచున్న. ప్రగుణ- ముఖ్యమైన. ఘనాఘనౌఘ- మేఘసమూహములకు. నిభ- సమానమైన. భద్రఘనాఘన- భద్రజాతియేనుఁగులచేత. చంకనత్- ప్రకాశించుచున్న. గగనధునీ- ఆకాశగంగయందు. పనీపతత్ - దుముకుచున్న. అఖండ- సమగ్రమైన. ఝురీ- సెలయేఱులయొక్క. లహరీ-ప్రవాహములయొక్క. పరంపర - గుంపులయొక్క. అతి- విస్తారమైన. అగణిత- ఎన్నశక్యముగాని. ఘుంఘుమార్పిత-ఘుంఘుమధ్వనులచేతనీయఁబడిన. గుహా- దరులయందు. ప్రతిఘోషము ప్రతిధ్వనులుగలిగిన. ఘోషము- గొల్లకుప్పము. ఒప్పగున్- ప్రకాశించును. ... *

ఇందుకునిఘంటువులు.

శక్రఘాతుకమత్తేభ వర్షుకాబ్దాఘనాఘనాః. అమరము.

ఝూరీఝురీఝలశ్చాపి. అమర శేషము.

౩౩. క॥ ఏతాదృశవిభవమ్ముల । శీతాచలసేతుమధ్యసీమోర్జితవి। ఖ్యాతావినూతనహరిని । కేతనసువిశేష శేషగిరివరమలరున్ ॥ ౩౪. సీ॥ నకులకులమ్ములుత్సుకఫణిఫణములచాయఁజాయలగొండ్లిసేయువెపుడు। గన్నెలేళ్లకునెల్లఁజన్నుఁబాలెంతయు బాలెంతపులిసొంపులీలనొసఁగు। నెమలికీరముబిడారముల మెలఁగుసారెకీరముల్ చిత్రబిడారములును । మదవినాగములుసింగములుతోఁపుఁదోఁపులజోడుగాఁగూడియే నాడునాడు । భయదరభసశరభసముదయమునుఁబ్రోచు। సాహసోదారభూరచక్రమచట । జాతివైరంబులేకనుజ్జాతిగాఁగఁ। గన్నువిన్కలిదిన్నె యోఁదున్నకతన॥

౩౫. వ॥ అయ్యహిమమహీధరంబు హిమధర బువిధంబున సర్వమంగ

శాభ్యుదయనిధానంబును, మేరుశిఖరిగరిమధర్మస్వరూప రంజితంబును, రాజతశైలంబులీలనారూఢనీలకంఠగుహాభిరామంబును, రాఘవసైన్యం బుతేవసుగ్రీవనీలగజగవయపనసరమణీయంబును, శ్వేతద్వీపంబునుంబలెఁ బ్రధానపురుషశోభితంబును, కృష్ణునిపగిదివేణునాదవిలసితంబును, దాన వారివత్సంబుడంబునవనమాలికావీక్షణీయంబును, నలువనలువగునలువద నంబులనలువునబహుశ్రుతులచేవిశ్రుతంబును, నీలగళుజటాజూటంబు నీ టుననాకాశగంగాప్రసిద్ధంబును, ధనదాస్థానంబుపోలికఁబుణ్యజనానంద కరంబును, పురందరపురంబువై ఖరిసుమనోమందిరంబై, పఙ్క్తిరథసంప దుపలాలితంబైయయోధ్యానగరిగరిమఁదనరియు, ఆరామాభిరామంబై విభ్రమబహుళతాలక్ష్మణద్యుతినలరియు, శుభశరభరతాస్పదంబై శత్రు ఘ్నమహిమనమరియు, ప్రకటరాజసగుణోన్నతంబయ్యు లోకేశ్వరశోభి తంబై, సత్ప్రబంధంబునువరారోహాంగంబునుంబోలె నానావిధాలంకా రవస్తుధ్వనిరుచిరంబై విలాసంబులనొప్పుచు, రాకానిశీథియునురంభాకదం బంబునుంబోలిచంద్రానుగమంబై ప్రసన్నతాకారంబుననమరుచు, మంద రాస్థలంబునుశంకరసఖపురంబునువనంబునుంబోలెవిలసద్గంధర్వనికరంబై లతావితానంబునువనేచరమందిరంబును రాజసౌధంబునుంబోలె జాలకా వృతంబై, వీణాకల్పనంబునువసంతాగమనంబును సముద్రంబునుంబలెఁబ్ర వాళాతతంబై, భాగ్యవంతునిశాంతంబునునందనంబునురాగంబునుంబో లెసంతానకాంతంబై, పద్మాకరంబును కువలయంబునువిష్ణుపదంబునుంబ లెరాజహంసమంజుళంబై, శంఖచక్రాదిసాధనంబునుగురుతరవారివాహి నీ నివహంబును నిజాంతస్థభూభృద్వారంబును ఘనాగమనంబును రాజా భ్యుదయంబును బాడబోదారతేజంబును మహామందరాగాభంగ స్ఫూర్తి యునమరి అన్వర్థకమలాధిపాహ్వయంబై, సురశాసనాస్పదంబయ్యు న సురశాసనాస్పదంబై, ఏకశరభమహావనధుర్యంబయ్యునేకశరభమహావ నధుర్యంబై, నిశాధిక జ్యోతిర్లతాధామరూఢంబయ్యు ననిశాధికజ్యోతి ర్లతాధామరూఢంబై, నవరతాహీనశృంగారోన్నతంబయ్యుననవరతా

హీనశృంగారోన్నతంబై, వారణగంధంబయ్యునవారణగంధంబై, సమంబయ్యునసమంబై, ఒక్కొక్కదిక్కునశతసహస్రారామనవనదీఝరీపరీతంబును, ఒక్కొక్కచాయననపాయచిత్రవర్ణశ్రీపర్ణకుముద సముదయసముద్యన్మకరందస్యందిబిందుబృందాస్వాదతుందిలేందిందిరసందోహ సంగీత భంగీతరంగితానుషంగాంబులోలనాళీకజాల డోలాందోళనఖేలద్బాలమరాళ చంచూపుటత్రుటదరాళ మృణాళ విశాల ప్రభానిస్తంద్ర చంద్రికాసారంబులగు కాసారంబులనలరుచు నొక్కొక్కచెంతఁగాంతలతాంతకుంతాక్రాంతనితాంతతాంతాబ్జ కాంతకాంత వేదికాంతారామరకాంతాకాంతకాంతై కాంతరతాంతశ్రాంతివారకచేలాంచలజాయమానపవమాన వలమాన విటపిపటలంబులంగనుపట్టుచు నొక్కొక్కవంకఁ బొంకంబగునేణాంకపంకజాప్తోపలోపలాలితసారహీరపద్మరాగమరకతప్రముఖమణిఘృణిరమణీయంబగుచు నొక్కొక్కయిక్కదహరాకాశవిహారమాణపరమాత్మానుసంధానసమింధాన పరమానందానుభవపరిపాక తృణీకృత లౌకికవ్యాపారపారీణప్రసిద్ధులగు సిద్ధులువెలయుచు నిప్పగిదినలరుచుండు వెండియు॥ ... ... ✽

✽ చౌపదములు. ✽

౩౬. 1. సతతభక్తియుతసన్మునిజాలా। కృతనుతులమరాగలుపృథుశీలా
కృతయుగముననుసుకృతమయిలీలా। క్షితివృషగిరియనఁజెలఁగునుజాలా॥

2. సీతావరుఁడూర్జితముగఁజేరుక్। రీతిఁగనినదారినిబొల్పారుక్
త్రేతనుహరినిధరించినచారు। ఖ్యాతినిగరుడనగంబనమీఱుక్॥

3. వెలయుజవ్వనఁపువ్రేతలపొందుఁ। గలిగినకృష్ణునికతలెందెందు
దళముకొనఁగనగుద్వాపరమందు। నలశేషాచలమనఁజెలువొందు॥

4. కలియుగమునఁజేకాన్కలనలరుఁ।గొలిచియిచ్చునక్కొలదినిసిరులు
ఖలువిడినొసఁగెడుబహువైఖరులు। నలువుగవేంకటనగమనవఱలు॥

౩౭. సీ॥ కలికాలకలుషాంధకారఖండనచండపటిమఖగంబువేంకటనగంబు। సాధ్వాళిసాధ్వససర్పదర్పావైకగరుడఖగంబువేంకటనగంబు। క

విదీనతాబ్దసంఘాతఘాతానల్పకల్పాశుగంబు వేంకటనగంబు । పరతురు
షాకశరహర రాఘవామోఘనటదాశుగంబు వేంకటనగంబు । ప్రబలకన
దీషణత్రయభావముక్త । సూక్తిసక్తవిరక్తిసచ్ఛక్తియుక్త । భక్తజనచి
త్తచింతితముక్తిదమున। చటులభావనగంబు వేంకటనగంబు॥ ౩౮. సీ॥ గు
రుదరీముఖర్ఝరీవరలహరీవారఘుమఘుమనిస్వనక్రమనిగాఢ। మగమాంత
కాంతనిష్యందిసస్మకరంద తుందిలేందిందిరామందగీత। మాపద్భిదోల్లస
దపవర్గకామినీప్రాపకజపశీలతాపసగణ । మదితిజేక్షణహర్షకృదదభ్రి
శుభ్రాభ్రసఖమహాభ్రంకషశిఖరనికర। మబ్ధిని స్తబ్ధఘనసత్వహాతివిచలద
భంగరంగదుత్తుంగతరంగవర్గ। ఘళఘళార్భటిసందర్భకవనకవిజ। నామి
తతపఃఫలంబు శేషాచలంబు॥ ... ... *

※ హరిగతివేంకటశైలరగడ. ※

౩౯. 1. శ్రీలసదలమేల్మంగాసంగీ ※ స్థేమవిశాలము వేంకటశైలము
నాళీకభవాదివినిర్మితస ※ న్మణిమయసాలము వేంకటశైలము
2. జలయంత్రోఘనాఘనధారా ※ స్రవదబ్జాలము వేంకటశైలము
కలకలరవయుతశుకపికనికర ※ గ్రసితరసాలము వేంకటశైలము
3. తాలతమాలక్రముకలకుచముఖ ※ దాడిమసాలము వేంకటశైలము
సాలఘుమతియాతిచింతితకైవ ※ ల్యఘటనలోలము వేంకటశైలము
4. నానాసూనరసోద్భవకుల్యో ※ న్నతకల్లోలము వేంకటశైలము
మానవనాయకదీయమానస ※ న్మదశుండాలము వేంకటశైలము
5. జాతపాపనాశనపాపవినా ※ శనకీలాలము వేంకటశైలము
ధాతురూపవంశవివరభవశ ※ బ్దవరాభీలము వేంకటశైలము
6. సంసారచ్ఛలబలవద్దహన ※ జ్వలనజ్వాలము వేంకటశైలము
కంసాహితకలహంసకందసం ※ ఘాతవినీలము వేంకటశైలము
7. ప్రకటితకుందముకుందమకరవర ※ పద్మసునీలము వేంకటశైలము
మకరధ్వజతోరణచామరపర ※ మపదోత్తాలము వేంకటశైలము
8. ంగంగగళిఖకోపరిపరిశోభిత ※ బలభిన్నీలము వేంకటశైలము

గంధద్రుమసంవేష్టితభుజగా ※ గ్రజకాకోలము వేంకటశైలము
9. శ్యేనానూనాళిఖగకళిశన※చిరకాకోలము వేంకటశైలము
దానవభేదనతల్పవికల్పవి※ధాయకతూలము వేంకటశైలము
10 కంతుసమింధనచందనపరిమళ ※ ఖనివాతూలము వేంకటశైలము
సంతతసేవితభాగవతావే ※ శసువాచాలము వేంకటశైలము
11 గంధగజాసురహరణాశ్రితజా※గ్రద్యుతిశూలము వేంకటశైలము
అంధుప్రస్ఫుటమర్కటకీటక్ర ※ తాతతజాలము వేంకటశైలము
12 మహనీయచతుర్దశభువనావన ※ మందిరజాలము వేంకటశైలము
గుహాపుష్కరిణీచరజలకరణీ ※ గురుతరజాలము వేంకటశైలము
13 రాజితరాజీవకుముదసముదయ ※ రంజకజాలము వేంకటశైలము
నైజపుణ్యభూమ్యపనిర్మితతత ※ నాళీనాళము వేంకటశైలము
14 సారరసాభవకిటిదంతవిభా ※ సారసనాళము వేంకటశైలము
దారుణకేసరికాసరసంయుత ※ తతభూగోళము వేంకటశైలము
15 కకుబంతనిరంతరపరిమళక్ర ※ త్కనదమ్రనాళము వేంకటశైలము
ప్రకటఫలితకదళీజంబూముఖ ※ భాసురకోలము వేంకటశైలము
16 ధవశిఖిఘూమితకౌశికతరుచయ※దారుణకోలము వేంకటశైలము
కవిదారిదోర్వ్యదదనామకభి※ల్లరకుద్దాలము వేంకటశైలము
17 అతులపురజనవృజినఘనహననస※దాదిమకోలము వేంకటశైలము
పతితయవనపురలంకాపురహ్ర※త్పావనివాలము వేంకటశైలము
18 కాండవికాండతరీకృతసరసీ ※ ఘనశైవాలము వేంకటశైలము
తాండవవేల్లోద్దండలాసికో ※ క్తభరతతాళము వేంకటశైలము
19 జనభోజనదర్శనభయదసుద ※ ర్శనకరవాలము వేంకటశైలము
ఘనపులినావృతదీర్ఘఝుల్లరీ※కల్పితవాలము వేంకటశైలము
20 హరిదురువాసితకుంకుమకస్తూ ※ ర్యతిజంబాలము వేంకటశైలము
పరిపరివిధములఁబెనఁగొనియెదుపా ※ పంబుసరాళము ॥ వేం
21 మకరీపత్రకనద్రామామణి ※ మంజుసలీలము వేంకటశైలము

సకలజననికరభవహృద్వ్యా*షనికృత్తైలము వేంకటశైలము
22 చమరీవాలజపవనరణితవం * శవిలసద్దైలము వేంకటశైలము
అమరభ్రమరకచాగీతప్ర * త్యారవద్దైలము వేంకటశైలము
23 కాకోదరతతిపతినామవిశృం*ఖలకృత్కేలము వేంకటశైలము
లోకేశ్వరనిర్జరవరసన్నుత*లోలుపశైలము వేంకటశైలము
24 ప్రాభవభవమ్మృదుశైత్యమాంద్యసౌ * రభయుగ్వేలము ॥ వేం
వైభవహావఘూమశ్యామలతా * వాటిస్థూలము వేంకటశైలము
25 కందరబృందరటన్నిర్ఝరదలం * ఘనజంఘాలము వేంకటశైలము
స్యందనకరితురగగరుడవాహన * సంభ్రమహేలము ॥ వేం
26 అతులబహిర్ద్వారవితానకకృత*హాటకచేలము వేంకటశైలము
గతిసురభీకృతనైకదిగంతర*గంధబిడాలము వేంకటశైలము
27 కమలభవాకరకలితవిహారణో*త్కంఠమరాళము వేంకటశైలము
అమితవిమతపాషండమచాపన* యననారాళము వేంకటశైలము
28 వరవనతుండిలభద్రోన్నిద్రా * వనశార్దూలము వేంకటశైలము
గురుతరశాఖిశిఖోద్యద్డింభ * ద్గోలాంగూలము వేంకటశైలము
29 సింధురకంధరసంఛన్నోపల * శేఖరకూలము వేంకటశైలము
సైంధవసింధురచంద్రమణీవిలా* సజననమూలము వేంకటశైలము
30 అనయపుళిందపురందరనిర్మిత * హారికుకూలము వేంకటశైలము
అనఘముతపసులకనుపునుకజ్జా * యఁపుకండోలము ॥ వేం
31 మొక్కువరాలందిడునువరాలుక * పురతాంబూలము ॥ వేం
గ్రక్కునతనుబోగడర్థులకొసఁగును * కనకదుకూలము ॥ వేం
32 తపులఁగఁగనె రేలుపగల్గుదివిజ*దనుజులయాలము వేంకటశైలము
అవిరళమృగయోత్సవధావచ్ఛా*గాదిసృగాలము వేంకటశైలము
33 సూటిగఁబోగడనిఖిలులన్నీలకుఁ * జొక్కపుగాలము ॥ వేం
ఏటను బ్రహ్మోత్సవమున సుజనుల * కిచ్చువిరాళము ॥ వేం
34 ప్రాకటచతురాస్యోక్తనిగమసా*రంపునిరాళము వేంకటశైలము

ఏకాంగులకును వైష్ణవులకు సిరు * లిడు హేరాళము వెంకటశైలము
35 నాక్షాదాధిపు పట్టినహరియుం * దఁపు వింటాలము వెంకటశైలము
ఆక్షేలసవర్ణిత విగ్రహమగు * హరిమణికీలము వెంకటశైలము
36 ఎసక మెసఁగ దిశఘూర్ణిలు వేలుపు * టింతుల మేళము ॥ వెం
వసుధాధీశాంతఃపుర కాంతా * వారనిచోళము వేంకటశైలము
37 లంబుగ నెలకొనపసులకుఁ దాపసు * లకుననుకూలము ॥ వెం
అంబరచుంబి కదంబ కదంబమ * హోహింతాలము వెంకటశైలము
38 శోభితవిద్వత్కృవిరచితాకృతి * స్తుతిధారాళము వెంకటశైలము
ఆభపథోన్నతి పెరిగానుకయున్నది పాతాళము వెంకటశైలము
39 గజహయపుష్కలము పుష్కరతారు * పుష్కబలపిఫాళము ॥ వెం
భజయింపనిజనులకుఁ జూపునద * ప్పకగోపాలము వెంకటశైలము
40 కొలిచినవారలకనువారమునొన * గూర్చుసుమాళము ॥ వెం
తలఁచినభక్తులకభిమతశుభమతి * దయనిడు వేళము వెంకటశైలము
41 ఇరువుగనుండెడునరులకుఁ గోర్కుల * నిడుఫలకాలము ॥ వెం
పరిపరిగతులనుయతులాత్మలఁదఁల * పఁగఁదగుశీలము ॥ వెం
42 హరినతఫాలము వెంకటశైలము హరులదువాళము వెంకటశైలము
దొరువులదాళము వెంకటశైలము దొరలకు మేళము వెంకటశైలము
43 వెంకటశైలము విబుధావాలము వెంకటశైలము వినమితసీలము
. వెంకటశైలము విగతికరాళము వేంకటశైలము వెన్నునిపాళెము॥

* అనుప్రాసదళవచనము. *

౪౦॥ అట్టిగట్టునఁ జదలతుదల మొదలఁ బొదలు విరిబొదల రొదల వద లుచుఁ గదలెడు కొదమతుమ్మెదకదుపుల నెదుగఁ బదిలముగఁ గుదురుఁ గనిన నిరుకప్పుకప్పుటకొప్పులగుగొప్పకొప్పులు, పున్నమవెన్నెలచిన్నెలమిన్నల మిన్నెల్లఁ జెన్నలరన్నెలకొన్నక్రొన్నెల నెలయించ నెవరు నెన్నఁదరులు, రేరాజాల తెలిడాలునగఁజాలు వాలుగన్నులజిగిగలవాలుగన్నులు, పొం

కంబుగుజింకలజంకెంచు బింకముఁజూపుచూపులు, శంపాలతికలసొంపునిం పుసంపంగిసంపద గుంపులఁబెంపు పెంపున స్ఫుటమ్ములయిన నాసాపుట మ్ములు, శ్రీవర్ణ సవర్ణంబులగు కర్ణంబులు, నిద్దపుటద్దపుటుద్దులతళు కులఁజెక్కుఁజెక్కులు, నిగరాలమగఱాలనిగరాలగనుని తాంతకాంతదం తంబులు, పగడంబులజగడంబులపైజగడంబులుసేయ విడంబించుపదవుల పదవులగుపెదవులు, వలమురిమురువులచలమరితనంబుసజయించునగ్గలంబు గలగళంబులు, చొక్కపుఁజక్కఁదనంబులజక్కవకవఁగవకవనవ్వునిబ్బ రఁపుసిబ్బెపుటుబ్బుగబ్బిగుబ్బలు, బిసమ్ములవసమ్ముగాని వెక్కసమ్ములా డనారజమ్ముగుభుజమ్ములు, ఆకసంబుఁ గేకసల్గొట్టి కాకుసేయుటకౌనను కౌనులు, అవక్రచక్రంబునాక్రమించినఘనజఘనంబులు, రంభాస్తంభసం రంభంబువెడలంగడలకుగడలుకొలుపుదొడలు, నాళంబులగుతూణంబు లజాణతనంబులాడి ధిక్కరించునిక్కులకిక్కులౌపిక్కలరుపిక్కలు, సర ససారసవిసరంబులపసదనంబులనిరసించు టొసపరి మిసమిసలుదెసల నె సఁగనాస్పదంబులగు పదంబులుగలిగి వాలుగంట్లపడగకొమరమరు మరు వెలిదమ్మివాలుగంట్లకై పుసొలపు మెలపులవలపుగొలుపు వాలుగంట్లకింపు లునింపు నవ్వనంబుసురపతియాస్థానంబుకైవడిసుమనోవిరాజితంబై, రా జానుగ్రహంబులీలనపరిమితఫలానుకూలంబై, అనుకూలాంగనారత్నం బువిధంబున ననవరతోత్సవకరంబై, పారావారంబు మేర వాహినీసమా గమస్థలంబై, మార్తాండునిరీతిఁగమలానందకరంబై, కంఠీరవంబుచాడ్పు నఁగందరమావిలసితంబై, భారతంబుచందంబునభీమార్జుననకులసహదే వశోభితంబై, వినాయకునిపగిది సువర్ణపత్రమంజుళంబై, మహానటునిజ టాజూటంబువై ఖరియహీనభోగాస్పదంబై, నిగమనికరంబు తేవ నిరదవ్యా జటాధరంబై, కుకవిప్రబంధంబుమర్యాదజాతివార్తాశూన్యంబై, దూతి కలతెఱంగునఁబల్లవగాగం బొనగూర్చుచు, సాదిపోలిక తావులమావుల బోవిదిసేయుచు, సౌరభావరణంబునకళికామితోత్కర్షఫలంబున కరంబు సొంపుసంపాదింపుచు, భాసురకేసరంబులురాజితాతుతలును,అసమాన

సారలసమాన పరాగపవమానడింభములు చెలువలరుచలువతెరలును, శారికావారసుకరకలకలరవంబులుకొ్రత్తముత్తైదువపాటలును, ఫలాపేక్షాయాతనూతన రాజకీరావళులునిచ్చలంపుంబచ్చలతోరణంబులును, కేకికేకారావంబులు వందిమాగధబృందమంగళాష్టకంబులును, కోకనదసముదయంబులుమెట్టుంబుట్టికలును, కింశుకముకుళంబులు సురుచిరదీపంబులును, పికకులకలకుహూకారంబులవార్యతూర్యరావంబులును, కిసలయవితానంబువితానకంపుందానకంబును, కుంచకళికాసందోహంబు మీసరంపుసేసముత్తెంబులును, జనులుప్రియంపడి చూతమనుజూతంబునవకంపుంబెండ్లిచవికయును, తత్ప్రసవిసరరసలుబ్ధంబులై చుట్టుపోంలివా్రలినమదాళినీశ్రేణిన ల్లపూసలచాలును, తన్మధ్యభాగలంబమానఫలగుచ్ఛంబుతాళియుంగా వసేంద్రిరామాధవుకల్యాణమందిరంబు తెఱంగునందుఱంగలించుచుఱియును॥ ... ... ... *

* ద్వంద్వప్రాసకందము *

౮౧. వనమునిఖిలజనసంజీ । వనముసకృద్దర్శనాభివర్ధితపుణ్యా । వనమునిరంతరమునిసే । వనముపగతజీవనముసువనపావనమై॥ ... *

౮౨. వ॥ వెలయుందత్ప్రదేశంబున॥ ... *

* ప్రకృతాప్రకృతశ్లేషయుక్తసాగరోపమాన వనవర్ణనసీసము *

౮౩. అశ్రాంతసౌమనస్యామోదకృద్రసుసారముద్భవరస కారణంబు। ఈరప్రవాళశితద్విప్రవాహసత్త్రాహభ్రమోత్కలికాకరంబు । గోధికాహరిశంఖకోలపోతస్థలరాజీవరాజీవరాజితంబు।బ్రహ్మకళాగూఢబాడబరాగప్రకాండవిఘాషరంగత్తటంబు । నగుచుశంకరవరబాణహరిపవన। శశధరాభ్యుదయాన్వితశ్యామలాభ్ర। సహితకమలాదిజనగురుస్థానమయ్యె । సంగురంగుగవనరాశిసరసీవనము॥ ... *

* రూపకాలంకారము *

౮౪. సీ॥ వనమహీస్థలికొల్మినునకింశుకప్రసూనంబులంగారవారంబులచటి । యళిసమూహంబునల్లులుమందపవనుండు...

ముతళిరు । టాకుజొంపములు తీవ్రానలజ్వాలలు వనపక్షిరవముతజ్జనితా
రవము । కమలకర్ణికతాయికదునొప్పకేతకిప్రసవదళంబులుపట్టుగార్లు।
గాంగనామనియనులోహంకారకుండు । మదనునకుజిగురువాలునుమంచివి
రుల । శరములునువాడిగాంజేసిబిరుసుపదును । పువ్వుదేనియనించెనాం
బొల్చునచట॥ ... ... ✱

మధుమాసవర్ణనము

✱ సప్తానుప్రాసచరణసీసము ✱

౪౫. ఒకమేరమ్మాకుసౌరభకిశోరకసమీర మొకరయోరవరకీరపికవిహా
ర । మొకచోటనాఖేటసకలాటపికకూట మొకబాటవనఘోటకకులఘూ
ట । మొకపొంతసులతాంతనికరాంతరప్రాంత మొకచెంతఫలసంతతికుజ
కాంత । మొకలోయఖగనాయకకుదాయసముదాయ మొకచాయసుర
గాయకకృతగేయ । మమితసారససారసకుముదనికర । మధురసాసార
మధురసామధురసార । భృంగసంగీతభంగితరంగితాఖి । లాగమంబుదలి
ర్చుచైత్రాగమంబు॥ ... ... ... ✱

✱ లయగ్రాహివృత్తము. ✱

౪౬. అంతమువిత్రప్రసవకుంతము విచిత్రసులతాంతము నిరస్తము ని
శాంతము తరుశ్రీ । మంతము గళన్మధు వసంతము పికోల్లసదుదంతము ఘ
నస్తురసవంతము రసాలా । క్రాంతమువిటీవృత వనాంతము హితానిల
నిశాంతము కనచ్ఛుక శకుంతము నికుంజో । ద్భ్రాంతము కరాళికుల
కాంతలసమంచిత వసంతము తనంతన నితాంతము చెలంగెన్॥ ... ✱

✱ ప్రాససీసము ✱

౪౭. ఔరగంధపుమెట్టుచారిందా రెడుపొంపకోరసోంకినసికయూరు
టకును।తీరైనపాండ్యరాణ్ణారీకుచోదారహారావళీయుక్తచారుగంధ। సా
ర పంకవిహారహారిత్రైమెనిబిడశృంగారవనంబులంజేరిసమీతి।సారససారసనా
రసౌరభములుచూరలుగొనుచుగర్వాములదు। మారనులుదూటిహిమవా
రిపూరమాని। పేరెములుబాటిమిగులగంభీరముగను। సారెపురవీథిగడిజే
టిస్వారివిరుగు। మేరనందందమందసమీరణంబు॥ ... ✱

* రూపకాలంకారము, అపూర్వప్రయోగము *

౪౮. ఉ ॥ ఆననసేఁటి మోఁతయెయు పాంగము గాఁగఁబి గాగ్రనాడ మే । గానము గాఁగ నాము శుకస్ఫుటపత్రరవంబు మర్దళ। ధ్యానము గాఁగ లేఁజివురు బాహులు ద్రిప్పల తాంగనాళి నెం। తేనియు నాఁడఁజేయుఁ బురి తెమ్మెరనట్టువపూవుఁదోఁటలన్॥ ... ... *

* శబ్దచిత్రసీసము *

౪౯. తనసుదర్శనలీలతనసుదర్శనలీలకరఁణిపుణ్యజనవర్గంబు బెంపఁ। దనవిగ్రహోన్నతిదనవిగ్రహోన్నతివలెనసమాయుధపటిమ జెలఁగఁ । దనదు శ్రీవత్సంబుతనదు శ్రీవత్సనట్లఘునమాసంగతిలలిఁదలిర్పఁ। దనదుదరస్ఫూర్తితనదుదరస్ఫూర్తిగతిశరజాతాచ్ఛకాంతు లెసఁగఁ। బరిఢవిలుసిద్ధసాధ్యనుపర్వశర్వ । విధివిధుబ్రధ్నపాధోధివిబుధనాథ । భావనుతిరూఢిగూఢపాత్వరిబృఢాఖ్య । భూరిధరణీధరవిహారహారిశౌరి॥ ... *

౫౦. క ॥ తురగావరూఢుఁ డైభూ । భరముడిపెడునపయశంబుహరిహారముగా । నరలోకరక్ష ణార్థము । తురగముసెక్కెనని జనులుతొడరి నుతింపన్॥ ౫౧. సీ॥ ప్రణవంబు రమణీయమణిఖలీనము గాఁగఁ బొల్చు నిద్దా మొగముట్టు గాఁగ । దపసికన్నాపము త్తెఁపుఁదలాటను గాఁగఁ బందు వెన్నెలదృష్టిదండ గాఁగ । బలుసంజడంబు కెంబట్టుపల్లము గాఁగ మొదటిపల్కులుముప్వపదము గాఁగ । వినువాఁకతరగలు వెల్లజల్లులు గాఁగ నాల్మించు కెంపుహబ్బాయి గాఁగ । జోడనలమీఁటిలేఁబొందు జోడనంగఁ । బరగుచున్నట్టి గరుడఁడన్ గరుడునిపయిఁ । జేరినందిత ధారావిహారహారి । సరణివాహ్యాళి వేంకటస్వామి దలఁచి॥ ... ... *

* షడ్రేతూపమానాద్యంతయమకవచనము *

౫౨. అప్పుడప్పన్నగనగవిభుండానందమందిరంబైన యానందమందిరంబు పేర్మిమందిరంబు గా నొయ్యన వెడలి కడలికడ లెత్తిమొరయు వడువున నడవడి గలనడవడిని యడుగడుగు వెంబడి బొడము బడలికల డంచి తడబడక బుడిబుడి మొక్కలిడి యెడనెడఁ బొగడు పౌరజన జయజయనినదంబు

టునఁ దనకుమారిక యైనసలమేల్మంగనాంచారునుఁజోడితెమ్మని బుఖ్యార్యుఁ బోండ్లఁబంచిన వల్లెయనివచ్చి యచ్చేడియలుదమతమయిచ్చలమెచ్చు లెచ్చ విచ్చలవిడినచ్చెంగటనున్న మానికపుబొమ్మమానినింగనుంగొని ప్రేమాని యమ్మా నీకోర్కులీడేఱెలెమ్మని, నీనెమ్మదిఁ దలంచిన వేంకటాచలపతినీ పతియగుటకు నతివేగముగాఁదోకొనివచ్చి పెండ్లిచవికలోవసియింపఁజేసి నిన్ను వెన్నునకుసాకల్యముగాఁగళ్యాణంబు సేయందలంచి మీతండ్రియార్ద్రహృదయుండై ధృతినినుఁబిలుచుకరమ్మని ప్రేమమ్మునమముంబంపెననిపలుకునప్పుడునఁ బట్టజాలనిసంతోషంబుహల్లీసకంబుసలుప మందాక్షమందాక్షియైయున్న నక్కన్నియను జెంతనున్న పుష్పాడిదిన్నెనువసింపఁజేసిసంపంగినూనెనించిన రతనంపుగిన్నియఁగర్పూరతాంబూలంబులు విడుచఫలంబులు శోభనాక్షతలు కుంకుమరసంబునఁగదంబించినపచ్చిపసపునలుంగునమర్చి బంగరుపళ్లెరంబెదుటనుంచి దీవించి నుదుటనక్షతలు గీలించి కుఱంగటను నైదువలుపాటలుబాడ వేడుకమీఱునప్పుడు॥ *

౫౭౦. మ ॥ అలకల్ చిందులుద్రొక్కఁ గౌనువడకన్ హారాళి నర్తింపఁజె। కుచ్చులుఫాలంబుఁజెమర్పఁ బైఁటయెదవీడోక్కల్ జెందబంగారుగా। జులుటోకివ్వఁగనూర్పులెచ్చఁదఱులచ్చోనిక్కఁదాళస్థితిన్। దలయుంపెన్ గనుదోయిసొక్కనొకకాంతామాళిమంగాంబకున్ ॥ ౫౭౧. క ॥ పల్లవపాణులుకొందఱు। బల్లెరములఁబూనిఱవలబంగరుగాజుల్। ఘల్లురనసుంకుఁజెరెగిరి। యల్లో నేరేడటంచునయ్యిందిరకున్ ॥౫౭౨. చ॥అటునిటుజిక్కుగొన్నకుఱులందముగాఁగొనగోళ్లదువ్వియి। కుచ్చటముగనూనెఁబోనెడనుగొజ్జెఁగనీరునఁదోచిరాచియొ। కట్టనిరువాయఁగాఁడి డిచిగొబ్బునవిప్పికదల్చిచందనం। బటకలిఁబ్రామెనొక్కకుటిలాలకయంబరరాజుపట్టికిన్ ॥    ...    ...    ...    *

※ చతుర్విధశృంగారము. ※

౫౭౩. సీ ॥ జలకమార్చిమడుంగుజలుఁగుదువ్వలువనుదడియొత్తి

చిత్రవస్త్రంబుగట్టి। ఘనసారకుంకుమకర్దమంబొకపాటిసెటిపూఁతగాఁ గమైనిండనలది । వలపెచ్చ మొగలితేకులుకొంతగానరాఁగీలుకొప్పొకవం కగీలుకొలిపి। యాపాదమస్తకంబఖిలభూషణమణీహారవల్లరులచే ననువుప ఱచి । కాంతలీరీతిఁజతురశృంగారగతుల। నలరిసైసేయనాకవింతచెలువు గాంచి । మదనసామ్రాజ్యలక్ష్మినాఁబొదలమిగుల । సారరుచిమించునాం చారుసౌరుఁటూచి ॥ ... ... ... ❋

❋ చతుర్యమకయుక్తాక్కిలివడిసీసము. ❋

౫౭౪. ॥ దరముకంఠంబుమందరముచన్గోలుకందరమునాభిసుద సోదరముపలుకు । ఘనమువేనలిఘనాఘనమునెన్నడతటిద్ఘనముమేనుఖగ లంఘనముచూపు । బింబమధరమిఁదుబింబముమోముతద్బింబముబొట్టుశ్రీ బింబముచెవు । ఉరులుముంగురులువిపురులువేళ్ళంట్లసవురులుకురువుల లయలలువళులు । తమ్ములడుగులుచెక్కుటద్దమ్ములకుల । తరుణకుంద ములలరుదంతములజిగి । యులకటీరతటంబుకోయిలస్వరంబు । గాఁగమన నాతిగమనాతిగరుచిగనిరె ॥ ... ... ❋

౫౭౫. వ ॥ అనివినుతిసేయుచుఁదనుఁదోడితెచ్చు చేడియలంగూ డుకొని ॥ ... ... ... ❋

❋ ఉపమాలంకారము ❋

౫౭౬. సీ ॥ కొమ్మొగుల్వడగండ్లుగుమ్మరించినరీతి నళిజాలుకొ ప్పులోవిరులురాల । శీతాంశుముద్దిడఁజేరురోహిణివలె మొగమునముత్తె పుముక్కెఅమరఁ।దూఁడునఁగెందమ్మిదోఁచినచాడ్పునఁదళుకుటారంటిపా క్కిలిజెలంగ । జక్కవకవగూడతెక్కలించుకవిప్పినగతిఁజన్గవమకరికలు మెఱయ । నమపులకుమూఁగునంచచప్పుడులనంగ । బవరిమొలనూలిగం టలరవళినిగుడ । దండనెచ్చెలియిచ్చుకై దండఁగొనుచు । వచ్చెఁదనతండ్రి మోలకులచ్చియంత ॥ ... ... ... ❋

౫౭౭. గీ ॥ అచటిమణిపీఠముననుశ్రీహరివసించు । సమయమునఁ

జంద్రకళయతిసంభ్రమునఁ । గనకభృంగారుగొనియుదకములుబోయఁ । గడఁకబదములుగడిఁగిభూకాంతుఁడప్రమ ॥ ౫౪౮. గీ॥ అర్చనలుజేసిగంధమాల్యాదులొసఁగి । జీరకగుడంబుహరివలచేతఁదాల్ప । వైఖరినొసంగిజలములవార్వఁజేసి । యటసుఖాసీనుఁగావించినట్టిమెడను ॥ ❋

❋ యమకము. అపూర్వప్రయోగము. ❋

౫౪౯. గీ ॥ శోభనాభీష్టదానాభిశోభిమైన । మోహనాభీరభీరుముసోహనకు । నాభినుతనాభిసారంగనాభిఁదెచ్చి । నాభినామంబునొకనతనాభిదీర్చె ॥ ... ... ... ❋

❋ అపూర్వప్రయోగము. ❋

౫౫౦. గీ ॥ ఇంతియోర్తుసామికెదసూటిసీటున । తేటతాళితగిభిదిరకకోప । లశకలంబుమంజులప్రభాదూర్వాద । ఖమునఁదొడగివిడని క్రమముదోఁప ॥ ... ... ... ❋

❋ ఉత్ప్రేక్షాలంకారము. ❋

౫౫౧. చ ॥ అలవడస్వారివచ్చిమరుఁడాత్మనుబోవుచుపైటభృత్యులౌ । నిలుమనవారలచ్చటనునిల్చితదశ్వమునీలితాత్రిటిచే । నెలకొనఁగట్టిడాలెదుటనిల్పిరొనాహరిదాల్చువక్షమం । దలతిరుమాలరాజిలుకతాళియుఁగస్తురిపట్టెలుందగౌ ॥ అంత ॥ ... ... ❋

౫౫౨. క ॥ ఒకచోఁగచసుమవాసన । యొకచోఁదాంబూలచంద్రయుక్తపరిమళం । బొకచోమెయికుంకుమస । జ్జికమగునెత్తావిహరికిఁజెలువంబెసఁగౌ ॥ ౫౫౩. సీ ॥ కలమువేదనుకొనువలకేలఁగీలించిపార్థయొక్కతెకాంతఁదోడితేఁగఁ । జెలువపాపడనొక్కచెలిగంధగజయానచిలునవ్వుమోముపైఁజెమటఁదుడువఁ । గొమ్మయొక్కతెచాలగుబ్బపాలిండ్లపైనిసుమంతజాఱుపయ్యెదసమర్ప । మృగనేత్రియొక్కతెచిగురాకుఁబోఁడినుౌగొప్పునఁజెదరినకురులుగూర్ప । బిత్తరముజిమ్ముచూపులమొత్తమంఘుక్రి । లందునీలాలయంజెలనందమందఁ । బ్రేమయయునుసిగ్గుహర్షంబుఁబెనఁగొనంగ । సరగనాంచారుమునుబెండ్లిచవికఁజేరె॥ ... ❋

* ఉపమాలంకారము. *

౫౮౪. క ॥ నెలవుగఁజేరిననచ్చెలి । కెలనకదమిమీఱనిలిచి కేశవుఁ డొప్పెన్ । వలరాచయాకమామిడి । నెలగొమ్మనుపండుడాయుచిలుకయుఁబోలెన్ ॥ ... ... ... *

౫౮౫. క ॥ అంతటభూసురకామిను । లంతంతనువివిధభూషణాలంకృతలై । వింతలుగమణులనారతు । లెంతయుఁబళ్లెరములందునిడికొనివేడ్కన్ ॥ ... ... ... *

* సకలయమకము. అపూర్వప్రయోగము. *

౫౮౬. ఉ ॥ వాలుమెఱుంగుమేనిజిగివాలుచొకాటపునూగుటారుమేల్ । వాలుగడాలురాయనిరవాలుమిటారపుఁబల్కుచందుసాఁ । బాలునొసల్ప్రసూనములవాలువరాళులుచూపునెమ్మిబల్ । వాలుకచంబునాచెలియవాలుగనీయురవాలునయ్యెడున్ ॥ ... *

౫౮౭. వ ॥ అనుచుననిచిననమ్ముల ॥ ౫౮౮. గీ ॥ వలయనగవలయితధరావలయమునకుఁ । బతివిగమ్మన్నరీతినారతులుద్రిప్పి । భువినినాచంద్రతారకంబుగసుఖించి । యెప్పుడుమనుమనుక్రియఁబొడవెత్తిరప్పుడు ॥ ౫౮౯. క ॥ పుడమిఁగలసాములందఱు । వడినితనికి సాటిఁబోలవచ్చినవారి । న్నొడసిపడవైతుమనుక్రియ । వడినెత్తావిపూలఁద్రిప్పివైచిరిమిగులన్ ॥ ... ... ... ...*

* ముద్రాలంకారము. మత్తకోకిల. *

౫౯౦. ॥ గానవైఖరినందుఁగొందఱుకాంతలయ్యెడఃజేరిసో । బానయంచొకపాటఁబాడఁగఁబాడినంతనెవింతయై । గానుపింపఁగఁబూర్వశోభనగాథలెల్లనుమీఱఁగా । మానినుల్కవగూడిపాడిరిమత్తకోకిలరీతులన్ ॥ ... ... ... ... *

౫౯౧. క ॥ అంతటఁగూరిమియల్లుని । సంతసమునడాయఁజేరి జనపాలకుఁడున్ । గాంతాయుతుఁడైమణిపీ । ఠాంతరముననుంచివిప్రులనుమతిఁజేయన్ ॥ ౫౯౨. గీ ॥ పసిఁడిచెఱఁగులుగలమధుపర్కమిచ్చి । స

కలమణిమయరుచిరభూషములొసంగి । రమణనిర్వరగోత్రనామములు జెప్పి । యనుఁగుటల్లునిఁబ్రార్థనమాచరించి ॥ ౫౯౩. క ॥ సుముహూర్తమనుచుసాధు । క్రమమునభూసురులుబలుకఁగాభూవిభుఁడు౯ । రమణియుమనముననడలొక । క్రమముననడపుచునుగౌతుకము మెఱయంగ౯ ॥ ౫౯౪. క ॥ అభ్యంతరులగుదారలు౯ । సభ్యులువినుతింపఁ బెండ్లిజగతిన్నియతి౯ । తుభ్యంప్రజాదిసత్క । ర్మభ్యఃప్రదదామియని కరమ్మునఁగన్య౯ ॥ ౫౯౫. సీ ॥ దారఁబోసియున్నతదనంతరంబున । బంధుజనులు మోదభరితులగుచు । నిరువురకునుసిగ్గు తెరజాలదేయంచు । నవ్వుకొనుచుఁదెరనొనర్చిరంత ॥ ౫౯౬. క ॥ మరుఁడానడుమను నెలకొని । గరగరిగరువగనుదమ్మికలువల కోరుల్ । సరిమార్చి యేసెనోయన । నిరువుర నెఱిజూపులమరె నిరువురమీఁదన్ ॥ ౫౯౭. శా ॥ రాకాచంద్రముఖీజనంబులు మది౯ రాగంబులుప్పొంగఁగా । జోకల్గూడుకవర్ణభేదముల చేసొంపుల్ జెలంగన్బికా । నీకోదారరవంబుమీఱబుధులెంతేసన్నుతుల్సేయఁగా । రీకళ్యాణముఁబాడిరష్టగరుడాద్రిస్వామికింపొందఁగ౯ ॥ ౫౯౮. క ॥ చెంగటనుజేరిధవళము । రంగుగవినుపింపనిజకరమ్ములనలమేల్ । మంగకుఁబ్రేమన్గళమున । మంగళసూత్రంబుఁగట్టెమరుగురుఁడంత౯ ॥ ౫౯౯. క ॥ పుత్తడిపళ్లెరములఁదెలి । ముత్తియపుంబ్రాలునించిముదమునమంతుల్ । హత్తియిరుగడలనుండఁగఁ । ఉత్తమలరశౌరిబ్రాలుజెలితలనుంచె౯ ॥ ౬౦౦. క ॥ కొప్పునజాతినతలఁబ్రా । లప్పుడుసతికొప్పవింతయైచూపట్టకు౯ । గప్పుమొగుల్ముత్తెంబులు । కుప్పలుగామేలువానగురిసినభంగి౯ ॥ వ ॥ అట్టిసమయంబున ॥ *

* ఉపమాలంకారము. అపూర్వప్రయోగము. *

౬౦౧. క ॥ కులుకువలిగబ్బిగుబ్బల । కలిమిచెలి౯ హారికరమ్ముఁ గైకొనుటొప్పె౯ । వెలిదామరవిరిమొగడలు । గలకమలినిగమిచిసట్టికల హంసబలె౯ ॥ ... ... ... *

* సప్తోపమానోపమేయయథాసంఖ్యాలంకార సీసరాజము. *

౬౦౨. ॥ ఘనశుకాబ్జమృణాళకంబుశైలకరభ, కచవచఃపదభుజా

రబూమిక్రఁగ నిగుడి ప్రేమగనియగు లచ్చిమగని నిగనిగనిమేనుగని పొడగని యెడ తెగని పొగడిక నెసఁగనిలిచి వేతెఱకతలఁపు రానీక నీకటాక్షసుధోర్మి కానీకమ్ము కమ్మక మేనంగు ప్రిమ్మరించుమనుచు భావంబున సాష్టాంగనమస్కారంబుతోఁ దదుచితబహుమానంబులొసంగి దనపట్టినిఁ బట్టుగాఁ జేపట్టుమనిమనివిగాఁ బరికించి మెచ్చించి బంపి జెలువంది వందిమాగధ కైవారంబులుమీఱ సమీర బలశాలినై యాలో నాలోచనఁ జేసి ఖలమదకల కేసరి తనకేసరియైన దేవేరితో బంధుయుతంబుగాఁ బరివారంబునుం దానును నిజపురంబు జేరి, కొలుచువారిఁ దదావాసంబులకనిచి చంద్రకళతులగల చంద్రకళతో నాకాశరాజనిభ యశోవిశదుండగు నాకాశరాజు నందనునిభ క్తియు నజనందనుని శ క్తియుఁ గలిగి యాశాతటీనిస్తులప్రశ స్త యశ స్తరుణీ స్తనోపరిభాగాగ్రహారంబులఁ దేజోవిరాజితంబగు నిజపురంబు ద్విజరాజరాజాగ్రహారంబుల దాన శీధు సాగర శిక్య శీకర మద ఘర్మ మేఘాష్టమదధారావారంబులకుం దావలంబగు దంతావళంబుల నమరుచు నభిమానవిధూతసుయోధనుండును నభియాతిచేతోభయదాయోధనుండును నఖిలసస్త్రాంగసాధనుండును నహీనశయనారాధనుండును నశ్రాంత తత్వబోధనుండును నపరిమితశ్రీధనుండును నై యలంకృతుల మెఱయు చమత్కృతుల ముఖ్యకృతులు కృతులఁ దనుఁ బొగడ సకలభోగంబుల ననుభవింపుచునుండె నక్కడ శ్రీవేంకటేశ్వరుండల మేలుమంగనాంచారుతో నపరంజికుచ్చెల నొప్పారు బికిలిపారుకుచ్చులు నింద్రగోపంబు రూపంబు జగజంబారికుచ్చులు జొట్టుసరిగపనిసింగంపుఁ బ్రతిమల యల్లికపసమించు ముసనాబును - బొంకంబగు గుంకుమపువ్వునించిన పచ్చతాప్తాపరపుగనుపఱపును, నిద్దంపుఁ బసిమిహూరుమంజిబిల్ల నేతపట్టుజూపట్టు పచ్చడంబును - దళుకులుగులుకు జీవదంతంపుగుత్తంపుగొడియలును - గ్రిమ్మాని పఁడ్లకై మలసిచుట్టువాప్రిలిన రాచిలుకల తెఱంగున బచ్చఱాల కెంపురవల చెక్కడంబు రంగారు బంగారు చిలుకలదిండ్లను - జీనానూలితాప్రిళ్లును - నేనుఁగుకొమ్ముపోటుపెరుకు గతిన రుకులాకు జీర వెండపీటికనులివంకయగ్గిసోఁకుడుపొక్కిడి

౹లుగుముక్కునొక్కుపుప్పిచీమదిండియేకలమ్ము సెలవునిమదగణుపులేంత
యు చుమురుసన్నముగమకంబునీలధవళరక్తహరిద్వర్ణంబులు మొదలుగాం
గలదుర్గుణంబులులేక వీఁకగాఁబసపునిగ్గుచేమొదటినుండిపోయగమ్మునఁబె
రిగి వెనకనెనిమిది ముంగల తొమ్మిది నడుమకుఱుచగణుపులీరైదు నొకటి
గలిగి యోరశిరంబుగా తెలుగంటిదారవింటితెలుగంటిన కొమ్మును, బికిలి
షపన్నాగంబును, సూర్యపుటపు టాఱుగునుగల యందలమ్మునధివసిం
చి, యాత్మీయసేనాపరివృతుండై ముక్కులతుదలఁ జుక్కబొట్టులు జెవు
ల మూయు కళ్ళాయిలు కటులసీలికాసెలు జొనిపినకుఱుచపిడెమ్ములుజం
కలవ్రేలెడు తోస్త్రానంపుఁదిత్తులు బదంబులబిగువారు బిల్లమెట్లునిరుకువీఁ
పులు సందిళ్ళగడియంబులు కాయలు గాచిననెగుభుజంబులపైఁదడిబట్ట పొ
త్తులుదనరు బెస్తలుసిస్తుగా మోచినిబ్బడుగు ముండ్లడియంగాలజడుపువై
సరంబోరడియడుగులోజతనము మోరడిబలిమికంబొద్దిక బొట్టడి చిట్టడి
మోపనబదిలము మించదుగు దువాళి సమాధానజల్లికలుప్పరము కిరదు
పాదబెళుకడుగులోదాటునిబ్బరము జడుకులోజీవదాన పాదొత్తుగల్లుక
రె కప్పు పటముతాకుడు మైసుళువుమారువెంబడి మెదుగుడు సెలపుచో
రుగొమ్ము మోపడుగు నీగడికండబలిమి లాగుమోపులసొబయలు బిగువు
మొల్లడిపదిలము హెచ్చరికస్వామిపరాకనవిని సంతసిల్లి కంసారిమునువు
సారివెడలినదారిని దుముదారిగా వేగంటిదునేదారి రాజసమ్మునగుమీసర
మ్మునఁదచ్ఛుభవాసరమ్మునవచ్చునప్పుడప్పడవాళ్లెతెంచిసాష్టాంగదండంబు
లాచరించిలేచిశంకలేకసంకలఁజేతులిడుకొని యందుఁగొందఱుకరమ్ములవా
తెఱలుమాటుకొని తగ్గిమెల్ల నెసవినయంబుగా నోలోకనాయకా యీయి
క్కనొక్కమొక్కలంపుబోయ రాయిడిసేయుచుదేవరను గనుంగొనువాఁ
డై యున్నాఁడనిన ననితరసాధారణదారుణ భుజప్రతాపాటోపంబుదీపిం
ప విజయభేరీదంధణధ్వానంబులు దిక్కులదర రథగజతురగపదాతులతో
డఁగదలివచ్చునదియ జైత్రయాత్రాసంరంభంబని విజృంభించుచుఁ బాషండ
వ్యూత్పుటభేదనంబగు నిజపుటభేదనంబునకుఁ జేరునయ్యభ్యంతరంబున॥ ❁

## —※ నాగదత్తోపాఖ్యానము. ※—

### ※ ద్విరుక్తిరూపకనియమదళత్రయఘటితచరణసీసము. ※

౬౦౬. రసరసాధికసంతమసమసారగవిహాయసయసాధూన్నతి హర్మ్యకంబు। ధరధరార్చకమహీసురసురాజక వైశ్యవరవరావరవర్ణ గురుతరంబు। మదమదావళబలాస్పదపదాత్యాజికోవిదవిదాశ్వ శతాంగ విలసితంబు। నవనవామోదసూనవనవాప్యుత్థకైరవరవాన్విత బంభరవ్రజంబు। వెలయుఁజారావ తారావకలితలలిత। భావసంభవకేళికా ప్రాభరూఢి। వారవారణయానాంఘ్రివనజరణిత। విలతమణినూపురంబుతిరుపతిపురంబు॥ ... ... ... ※

### ※ పైపద్యమునకర్థము. ※

రస - సువర్ణమయమైన, రసా - భూమియందు, అధిక - విస్తారమైన, సంతమస - చీఁకటివలెనున్న, మసార - నిలయములను, గ - పొందిన, విహాయస - ఆకాశమును, య - పొంది, సాధు - ఒప్పుచున్న, ఉన్నతి - ఔన్నత్యముగలిగిన, హర్మ్యకంబు మేడలు గలిగినదియు, ధరధర - మందరధరుఁడైనవిష్ణువునకు, అర్చక - పూజకులైన, మహీసుర - బ్రాహ్మణులచేతను, సు - లెస్సయగు, రాజక - రాజసమూహముచేతను, వైశ్య - కోమటులచేతను, వర - నిధులచేత, వర - శ్రేష్ఠులైన,అవరవర్ణ - శూద్రులచేతను, గురుతరంబు - మిక్కిలి యధికమైనటువంటిదియు, మద - మదయుక్తమైన, మదావళ - ఏనుఁగులచేతను, బల - బలిమికి, ఆస్పద - స్థానమైన, పదాతి - కాల్బలముచేతను, ఆజి - యుద్ధమందు, కోవిద - చతురులైనవారలను, విత్ - వధించునట్టి, అశ్వ - గుఱ్ఱములచేతను, శతాంగ - రథములచేతను, విలసితంబు - ప్రకాశించునట్టిదియు, నవనవ - మిక్కిలినూతనమైన, ఆమోద - పరిమళముగల, సూన-పుష్పములుగల - వన - ఉద్యానవనమందలి, వాపి - నడబావులయందు, ఉత్థ - పుట్టిన, కైరవ - తెల్లగలువలయందు, రవ - ధ్వనితో, అన్విత - కూడుకున్న, బంభర - తుమ్మెదలయొక్క, వ్రజంబు - గుంపులుగలిగినది,

వ॥ ఆపురవరంబున॥ ౬౦౭ ॥మ॥ కలఁడభ్యస్తసమస్తశాస్త్రనిగమగ్రంథా
ర్థసంఘర్షని । స్తులవాచారభటీధురాధరితసింధుప్రోల్లసల్లోలని । ర్మల
కల్లోలఘుమంఘుమారవయశోమాన్యస్వకీయప్రథా । కలనాథర్మ్యుఁడు
మాధవుండనెడుసత్కర్ముండుధాత్రీస్థలిన్ ॥ ౬౦౮ ॥ గీ॥ అతఁడుబహు
కాలమునకొక్కసుతుఁడుగలుగ । జాతకర్మాదిశుభవిధుల్సంఘటించి ।
భూరియిడినాగదత్తుఁడన్పేరుఁబెట్టి । ప్రేమఁబోషించివడుగునుబెండ్లిసే
య ॥ ౬౦౯ ॥ గీ॥ అక్కుమారుండువినయవిద్యాతిశయము । లెనయఁది
నుపతిపట్టణంబునఁజరించుఁ । దండ్రికన్ననునెఱవాదితనముమంచి । తనము
గ్రామణితనమువర్తనముఁగలిగి ॥ ౬౧౦ ॥ సీ॥ అపఠితాగమమనభ్యస్తశా
స్త్రక్రమంబపరిశీలితనిగమాంతమనను । భూతషడంగవిఖ్యాతియనుపలబ్ధ
సాహితీమర్మప్రసంగమవిది । తప్రాథకావ్యసందర్భచాతుర్యబోధితగాన
విద్యాప్రథితరహస్య । మకృతయాగాదిక్రియాసత్కలాపమకాలోచితపు
రాణమననవరత । కీర్తనీయహరిధ్యానగీతలెందు । మందునకునైనలేకస
మస్తమెపుడు । కరతలామలకంబుఁగాఁబరఁగెనతని । ధరణిసురుమాత్రు
గానెట్లుదలఁపవచ్చు ॥ ౬౧౧ ॥ వ ॥ అంతనాగదత్తుండప్పరియాశ్వారుతీ
ర్థంబుచెంతఁగొంతకాలంబున ॥ ౬౧౨ ॥ శా ॥ ఏతాచారుఁడుదుర్మదాం
ధుఁడగుచున్వేశ్యాంగనావాటులన్ । ద్యూతక్రీడలఁజౌర్యవర్తనలచేదుస్సం
గదోషంబులన్ । జ్ఞాతోజాతవశంవదుండయిజరియించెన్లజ్జఁబోనాడిస ।
ద్వ్రాతంబున్దనుజూచికోయఁగమహావ్రాత్యస్థితిన్మీఱుచున్ ॥ ౬౧౩ ॥ సీ॥
గుడిగుడిగుంజాలుచిడిగుడిచింకణాబిల్లగద్దెనబొడ్డిచిల్లగోటి । చిరిసింగ
ణాబంతితెరుముడుమెండుసు వెన్నెలకుప్పలుకన్నుకట్టు । చీటికిమొటికా
యచింతాకుచుణుదులు బులియాటలునుజిట్లబొట్లకాయ । దూరనదుంక
ముల్దోపిడియాటలు బంతియాలంకిదీపమ్మానములు । పొట్టగీరనగింజలు
బొంగరములు । కచ్చకాయలుదాఁగిరిమ్రుచ్చులాట । బంతిమెకమాటజిం
దరపరపులాట । లనెడుశైశవదుర్వర్తినధిగమించి ॥ ౬౧౪ ॥ క॥ సటలు
దడవటలునటనలు । మటుమాయలుజాటువగలమాటలవింత । ల్గుటిలత

యుఁ దెలిసి పాఱుఁడు । విటవిద్యకు బిరుదు వేసి వికవికనగుచున్ ॥ ౬౧౫॥
కం॥ నిరతముఁ జదరంగంబున । గిరిజల సాగటాల నారికేళఫలములన్ । స
రిజేసి యొడ్డు విడుపులు । తెఱకులబందెమిడి గెలుపుఁ జేకొనియవలన్ ॥... ※

※ స్వభావోక్త్యలంకారము. ※

౬౧౬॥ సీ ॥ పికిలిపిట్టలును లావుకలు బిచ్చుకలును గాఱుపుల్లుల జేరి కేరిజ
ములఁ । గైదులవలిచలఁ గాట్లాట విడుచుచుఁ గోడిపుంజులఁ దన్నులాడనిడు
చుఁ । బొట్టేళ్ళ సన్నలఁ బెట్టుచు గిజిగాండ్లఁ బిలుపు దీయుచు జీనువులను బై
టఁ । బారాడఁ జేయుచుఁ బారాల పల్లటీల్ గనుఁగొంచు రెయి వేఁటలను ది
రుగుచుఁ । దీంద్రవయస్సెచ్చఁ జేకత్తి కాండ్రఁ గూడి । గరడి మాష్టీల జెట్లతోఁ
గత్తిసాము । పెనుఁగులాటలొనర్చుచు బేరజంపు । టారజన్మునఁ గడుగ
డిదేరఁ దలఁచి॥ ... ... ... ... ※

౬౧౭ ॥ క ॥ మల్లియలు సన్నజాజులు । మొల్లలు సంపెఁగలు మొగలి
పూజ్జేమంతుల్ । మొల్లముగను వరుసగ రం । బెల్లెషుబువు దండఁ గోరసిగఁ
జుట్టివడిన్ ॥ ... ... ... ... ... ※

※ అపూర్వప్రయోగము. ※

౬౧౮ ॥సీ॥ మంచుసన్నంపు రుమాలు బిగ్గర జుట్టి తొడి సన్నకాసెల చల్లడము
తమిని । దేవపూజార్థమై దెచ్చి దాఁచినయట్టి గంధముఁ బదనిచ్చి కలయ నలఁ
ది । నీర్కావిదోవతి నెఱికగన్పడఁ గట్టి వలిపెదుప్పటి వలెవాటు వైచి । ను
నుగోపిచందనంబున నానర్చిన నూర్ధ్వపుండ్రంబు పై వ్రేల్మిబొట్టమర్చి । కేల
నున్నట్టిహత్తంబు వేళముగనె । నేలనిది మోవనింకని నేల వైచి । బాల పైఁ
బ్రేమ మిగులదు వాళిమీఱ । మదనపరితాపదోధూయమానుఁడగుచు॥.. ※

※ ప్రాస భేదము. ※

౬౧౯ ॥ ఉ ॥ వ్రేలిమి వ్రేల్వఁ జెప్పుదును వ్రేల్చు మొగంబు వధూలలామ
కై । చాలుగ సంధ్యవార్పఁ దుద్రి సంధ్యల వార్చునువంట వార్పులా । బాలిక
యింటఁ దంద్రిసలుపన్గననొల్లఁను దేవపూజయే । వేళలలంజతల్లియిలు వే
లుపు మాతకిదున్న ప్రిణామముల్ ॥ ... ... ... ※

౬౨౦॥ చ ॥ ఒకవెలయాలిమీఁదనిలుపోపనికూరిమిగల్గియింటలో । స
కలముదెచ్చియిచ్చిననుజవ్వనిమెవ్వనినిచ్చమెచ్చకే । సకినెలతూఁగుటు
య్యెలనుజక్కనిసామిగరారయంచుమా । రకదనచాతురిన్నిలువరమ్ముగఁ
గూడిచెలంగెనయ్యెడన్ ॥ ... ... ... *

❀ అచ్చతెనుఁగు. ❀

౬౨౧॥ క ॥ చికిచికినఱసినబొమలును । గొకివికిమెడయెఱుఁగుమూ
తిగుంటనొసలుపాఁ । పకడెమ్ముపోలుటడుగులు । బికిలినబుట్టంబుఁగూని
వీఁపఱచునుడుల్॥ ... ... ... ... *

❀ జాతి. ❀

౬౨౨॥ సీ॥ పాడింటివలెసందుపట్టుఁదప్పినమేనుగానుగఱోలువీఁకఁద
గుకొను । కోవెలతముకుపైకొడుపులగతిఁబొట్టటోకిచ్చువేళ్లజంఘ్లుబోకినో
రు । నంజివేసినతాటిగింజకైవడితలగచ్చకాయలవంటికాయకండ్లు । వికలంపుఁదెడ్లపోలికడొంకుచేతులు పందిటిగుంజలపగిదికాళ్ళు । మంటితలప
ట్టుకుంటిరాకంటివేళ్ళు । నొంటిపలునుంటతుంటలుగంటుముక్కు । వింటిరూపంబుబొగచుట్టవిడపుఁదిత్తి ।గలిగిచెన్నొందునవ్వెలవెలఁదిత్తల్లి॥.*

౬౨౩ ॥ సీ ॥ చిటిచాఁపక్రిందఁజేర్చినముస్గుదామరతెల్లజిల్లెమప్రత్తిది
వ్వెవత్తి । యొక్కఁడుతోనూరువక్కలబరణియుగావుకరాటంబుగాజు
టద్దె । మరుదైనతిపిరికిన్నెరతమ్మపడిగంబువస్నెకోకలచందువాపిరంగి ।
పనిగిండిచిటికెనపావురాల్సొగటాలునుంజలుగొరవంకపంజరంబు । గం
దవడిపువ్వుపొట్లముల్గద్దెపీఁట । కాసెకంచెలగజ్జలగ్గలపుటగరు । ధూప
ములుపుట్టములవేటిపాపబెత్త । మిదుపువిశ్వాసిగలపడకింటియందు॥. *

❀ ఉపరిసురతము. ❀

౬౨౪॥ ఉ ॥ దర్పకశాస్త్రమార్గమణితస్ఫుటగల్లచపేటమచ్ఛ్రీయు ।
కూర్పరతాడనంబమితగుంభితకంకణకింకిణీరవం । బర్పితచుంబనోద్భవద
ధరావృతమీక్షణపారవశ్యము । న్సర్పవరాఖ్యబంధగతిఁజాతురిగల్గినకూఁ
తుడాయుచున్ ... ... ... *

౬౨౫॥ క ॥ రాజీవకేతనాదిమ। రాజీవాశుగముఁ రీతిరాజిల్ల కయా। రాజీవంజీవాక్షివి। టాజీవభవద్విలాసమరుటగనుదు రే॥... ... *

## ❁ జాతివార్త. ❁

౬౨౬॥ సీ ॥ ఇంతిరో మనవీటవింతగా మును పెలుకెటుకో యటంచాక యెటుకసాని। యే తెంచెనముగ వేయోయవ్వ మొకసుద్ది సెప్పెద బాగేవు సేయుసూవు। కొల్లాపురమ్మానపొల్లాపు లేదొండుఁ దలఁచితివది గాదుద యవిటుండు। గడకేగునిను బాసికన్న దిపెఱవానినిన్నుఁ జేర్చునెఱుంగ నేర వీవు। గానఁదరకటబురకట గాదు మేలు। జేరుబురకనితోడి తేతారుకాణ। యొందు రెండేదినాలనోదుండినాదు। మాటమఱువకుమనిపోయెమ ఱచినావె॥ ... ... ... *

౬౨౭॥ మ ॥ చెలుముల్లప్పకమున్న గూర్మి లెదలన్జిట్టాడకన్మున్నఁ బోటు లుబైకోకయమున్న నెచ్చెలులువీడ్కోల్ గాంచునట్ మున్నమా। టలునీవే సనుమున్న దట్ దోలఁగి దాఁటన్జూచునమ్మున్న గాఁ। దోలఁగంగావలదే చెలుల్బోటులపొందుల్నీటి పైవాస్త్రత లే॥ ౬౨౮ ॥ గీ ॥ ఇంతినీకుఁ దెల్పనీరసంబ గునేఁ। చెలివిశఱ కునింకఁగల తెఱంగు। నన్నుఁ జేరబిలిచినమ్మింకఁదా మర। పాకునీటిచందమయ్యెమనసు ॥ ౬౨౯ ॥ క॥ తెల్లనివెల్లనుబాలని। యుల్లంబుననుండి గుడినియుండియు గుడితాస్త్రి। ల్లల్లఁదెగఁగోయుఱెటుఁగ క। గల్లదిమైకుడిచినింటికడయే రెండుట్ ॥ ... ... ... *

## ❁ అపూర్వప్రయోగము. ❁

౬౩౦॥ క ॥ ఱాబొమ్మకుగిలిగింతలు। నీబోటినిజేలుశఱచినేఁడిదెచు ట్టం। బైబమయించెనుపన్నుట్। సాబా సేబాలవానిసరసకుఁదీయ కే॥ *

౬౩౧ ॥ శా ॥ ఓ రామామణినీదుతోడిచెలులయ్యో సర్వసౌఖ్యంబుల। న్మేఱన్నీవొకటిత్తగానివలకున్మేనంబవైచిక్కితే। శ్రీరామాయనివీనులన్గది యఁగాఁజేదోయిగీలించిమె। వ్వారేమాదురొతమ్మిచూలియిటుగావాస్త్రి సెన్నలాటంబునట్ ॥ ౬౩౨ ॥ గీ ॥ నీవిలాసంబురూపంబు నేర్పునోర్పు। నడవిలోఁగాయువెన్నెలలయ్యెనకట। యుట్టిమానిసియేనిన్ను మట్టుమీఱ!

నేలువాఁడు, దయన్నీకు మేలువాఁడు ॥ ౬౩౩ ॥ క ॥ నినువంటివారి నెందఱఁ। గనుఁబ్రామినవాఁడొ వీఁడు కటకట నీచూ । పునకు నితఁ డెట్టివాఁడై । గనుపించెనొ నెట్టి వేళఁ గలసితొ వీనిన్ ॥ ౬౩౪ ॥ చ॥ అడిగినఁ దెచ్చువాఁడొ గడునందమునన్ననవైనవాఁడొ మే । ల్నడవడి కాఁడొ వీటఁ దగునాయక మైచరియించువాఁడొ చే । విడిముడి గల్గువాఁడొ దలవెందు ప్రికలందఱు రాకమార్కు । ల్మడుపులువానగాఁ గురియ ముట్టవు గారణ మేమి కూఁతురా ॥ ౬౩౫ ॥ ఉ ॥ ఏమని నీకుఁ దోఁచెనిది యేమని యూరక చూచియుందు నే । నేమని యోర్చుదాననిది యేమని మానుప నేర్తు వీఁడుని । న్నేమని గారవించెనిది యేమని నీకు సహించె నక్కటా । కోమలి యింత గాక మనకున్న గునేయిటువంటి చైదముల్ ॥ ... ... ... ... ✻

## ✻ అపూర్వప్రయోగము. ✻

౬౩౬॥ క ॥ ఈలాగున వానితో నవ్వు । టాలకుఁ బన్నిదమిడి సాగటాలాడఁగ నో । టాలగు నీకర్థేందుని । టాలాయని దక్కఁగొనుక టాలలి తాంగీ ॥...✻

౬౩౭॥ క ॥ ఓరమణి నీదుపిక్కలు । దారలనగు మోవి పంచదారలనగుస్వ । ద్ధారలనగుఁ జెలువమృతపు । దారలనగు నుడిన ఖాళి దారలనవ్వున్ ॥✻

## ✻ యమకరూపత్రిప్రాసకందము. ✻

౬౩౮॥ పున్నాగమునగు నీయా । ర్పున్నాగము గేరు నీదు పాక్కిలి బటువా । పున్నాగమునగు నీనడ । పున్నాగము నెనయ కథముఁ బొందితి తగవే ॥...✻

సీ

౬౩౯॥ తెలియ వనితీయవా తెలుఁ రమణిసారంబు రమణినీ నెన్నొసల్ రసతిలకము । పొలఁతి నీ మోము ప్రబోధచంద్రోదయ మతివ నీనవ్వు కావ్యప్రకాశ । మబల నీచూపు టొయ్యారంబు కౌముది కలికి నీ మేనలంకారసరణి । కొమ నీకనుంగవ కువలయానందంబు మగువ నీ చన్దోయి మంజరిగతి । మెలఁత నీకొప్పు మేఘసందేశ మయ్యె । గలికి నినుఁ జూచినంత నెగలుగున తను । విద్యరసికుల కెల్లనుర్వీస్థలమును । గాఁగ నినువంటి జాణ కీఖలుఁ మదగునె ॥ ......✻

౬౪౦ ॥ సీ ॥ జాజికాయయుఁ గురాసాని యోమము వస చెంగల్వ మర్లు

మూతంగిపచ్చ । యొన్నులు మ్మొతవిత్తులేనుcగు మదముపచ్చికతుంచుపుర్వు
మైచెమటమన్ను । గంబూరగుల్లసున్నంబుc గాల్మడిచేతనూరినీడనెదడి
యూటినంతc । బసరవుగొమ్ము మేల్బరణిలోపలనుంచి విడిగురిగింజంత
విడెములోన । నిర్చెcగాcబోలులేదేనియింతవాని । పైదమాసున నేవేళc
బ్రక్కcజేరి । గడియసేపెడ తెగలేక కలసిమెలcగc । గారణంబేమి దెల్పవే
గలికిమిన్న ॥ ౧౮౧ ॥ గీ ॥ చాఱపప్పనుగసగసల్జాజికాయ । సెనగలను
ములుపత్రియుమునుగపువ్వు । కొబ్బెరయుమందపాలతోcగూర్చి త్రావి ।
యబ్బుదబ్బఱకాcదునీకబ్బుటగునె ॥... ... ... ❋

❋ అపూర్వప్రయోగము. ❋

౧౮౨॥ క ॥ చెల్లcబోహిందోళకధ। మ్మల్లకుcదీయమోవిగలుగుమది
రాక్షిమ। తల్లికిపాణితవాణికి।వల్లెయొయీటాటుకూటువలపొనరింపన్॥

❋ అపూర్వప్రయోగము. ❋

౧౮౩ ॥ ॥క ॥ నాచిన్నిబిడ్డవినుతను । శ్రీచిన్నముగలుగుదారనుజేర్పక
వృథగాc । జూచుచునోచెనొకోసీ । చేచిగురాకిట్టిబెట్టచెట్టునుబట్టన్॥..❋

౧౮౪ ॥ క॥ కుటిలుcడపకారిజూదరి । లూటలూటకాcడాగడీcడులోభి
ఖలుcడుదు । ర్వ్యటుcడుబలురోగితక్కరి । మొటిగిడిచాపనగరాసుమట్ట
కుమబలా ॥ ... ... ... ... ...❋

౧౮౫ ॥ సీ ॥నీవుగల్గుటకుగాదేవళ్ళగుళ్ళcబ్రాణాచారవిధులెల్లనలవ
రించి । నోములువేలెస్సనోcచివెన్నుcడుదయచేసినయంతనేచీరజిక్కి ।
తెలుపెక్కిచెక్కులు వళులుబ్బcగనిగౌనుబలిసినెన్నడదొట్రుపాటుcజెం
ది। చను మొనలక్కప్పానిమసుదావిపైయూసగలిగి వేవిళ్ళెచ్చికనులనలcత।
బొడమియిటుcదొమ్మిది నెలలుకడుపు మోచి । మంచిలగ్నంబుననువిన్నుc
గాంచినాము। కరణమొనరించిసంతోషకలితనగుచు । నేటcబెంచినదానివి
న్నూటcబెంచి ॥ ... ... ... ... ❋

౧౮౬ ॥ మ ॥ కొసరున్పల్కులు తప్పులేయడుగులుగ్గుగ్గోరుటల్బాచి
దాని। గుసుమాళంబులుముద్దికాయవగపోగుల్గాజులున్బొబ్బమలున్ । రసపు

న్దామెతుగజ్జలందియలుదోరంబైనపుల్గోరుకొ్రిం । బసవున్దాల్గుబుసంబు జెన్నలరునీబాల్యంబుఁజూచంతటన్ ॥ ... ... ❋

❋ అపూర్వప్రయోగము. ❋

౬౪౭ ॥ గీ ॥ వయసుగనుపట్టుచోనాదువాంఛదీరె । ననుచునెరియించినిన్నునన్నసుపనింక । భారమనిదెల్పినేనునీబల్కుబడిని । నమ్మిమనజాతి నడవళ్ళనాయముగను ॥ ... ... ... ❋

౬౪౮ ॥చ॥ తెలిపినవన్నియున్దెలిసితేకువవేకువమోముమజ్జనం । బల వునఁజేసిగన్నుఁగవయందునఁగాటుకరేకఁదీర్చ్చమే। లలికమునందుఁజాఁదిడి యొయారవుగుబ్బలవాడఁగుంకుమం। బలఁదికచంబుదిద్దిఅవికన్నుకముద్ధరిం చివేడుకన్ ॥ ౬౪౯ ॥ గీ ॥ వేగభుజియించిపోఁగఁదాౖవివిడెముఁజేసి । సఖులతోఁబొ్రద్దుసుద్దులజరిపిసంజ । వేళఁబచ్చనగిల్కుపావాలుదొడగి । బుడతకైదండఁబూనియిల్వెడలిబైట ॥ వ ॥ నిలిచిన॥ ౬౫౦ ॥ చ ॥కనిదొ రలాసఁజేసియుడిగంబులఁబంపినకీలెఱింగిమా । మునఁజిగురొత్తులేనగవు మోసులసమ్మతియాటఁదెల్పివెం । టనెయెదురేగిబూపుచికటారులఁగా నుకొనర్చినవారిఁదో । డ్కొనిబువుసజ్జనీవుతమిఁగూడకవీడఁగనాడియ క్కటా ॥ ౬౫౧ ॥గీ ॥ వలపుతలకెక్కివానిమందులకుఁజిక్కి । జాతమెల్ల నుబోయునీజన్మమేల । యొక్కనికిదక్కిచొకమైయున్నచెలిని । సూళకే రినివెదకినఁజూపఁగలవె॥ ౬౫౨ ॥ క॥ ఏసొమ్ములేటివస్త్రము । లేసుఖమే భోజనంబులీవలపేలా । వేసమ్ములుగాసములకు । నాసలురూకలకుగా వెయదియట్లుండెన్ ॥ ... ... ... ... ❋

❋ అపూర్వప్రయోగము. ❋

౬౫౩ ॥ క ॥ తొఱుఁగుతమినిన్నుఁజెలులం । దొఱునలరతిదేవిరూపు తులనీరేఖం । దుఱుగొనులుజవ్వాడన్ । దుఃఖమున్నదలవదలఁగజనులుధృ తులువడిన్ ॥ ... ... ... ... ... ❋

౬౫౪ ॥ గీ ॥ గుడికిముద్రవేసుకొనికులమునవన్నె । వాసిఁగాంచిమా టవాసిఁబెఱిగి । సానిమగువలందుజాణవైమగనాలి । పాటుకోర్చితెట్లు

పద్మనయన ॥ ౬౫౫ ॥ గీ ॥ జక్కవలఁబోలు నీగుబ్బచన్నులేడ । పేనియురమేడ యువిశొన్ని వెతలుగాక । కతలు నీబ్రతుకేఁక సేమిగలదు దూరి । కూళమారి విధాత చేకూర్చెనిటుల ॥ ౬౫౬ ॥ సీ ॥ గుడిపాము వలెబుసకొట్టిన న్వాకట్టుమాటఁ బన్నినయట్టి మంత్రవాది । దనుఁగని పెంచు దల్లినిజోగురాలుగా బండుకట్టిన యట్టి పాఁపజాతి । కన్నుల జగమేలు గలికికొమ్మను నిన్ను మగనాలిఁ గాఁ జేయు మాయలాఁడు । తరువాత నినుఁ దెచ్చి దాసిఁ జేయఁదలంచియదను వేచిన యట్టి యాతతాయి । గుఱుతులాకకొన్ని మఱపులుకొన్ని వెతలు । కొన్ని దాసలుకొన్ని యుంకువలుకొన్ని । వలపులసికొన్ని దనకుఁ దోడళ్లుకు మదిని । గలుగఁజేసెనితండు నాకన్నులాన ॥ ౬౫౭ ॥ ఉ ॥ ఓర్వరియాందు, సత్యవిభవోజ్జ్వలు నందురసజ్ఞలీలలన్ । నేర్వరియందు, భోగముల నెక్కొనుజక్కనివానియందు, బెం । పేర్పడ నూరునందు, జగదేకవదాన్యునియందు, మిక్కిలిన్ । గూర్పదురింతు లొక్కయెడఁ గూర్తురె, వీనివిచేటికూరుపుల్ ॥ ౬౫౮ ॥ మ ॥ ఊఱుముల్గాంతనముల్విచారములు నిట్టూర్పుల్విధిందూరుట । ల్గుఱుతుల్బాసలు దప్పవావులు ననుంగుల్గోపముల్నమ్మిక । ల్మారువుల్మోహములొడ్లనేరములు నేమంబుల్సహాయంబుఁ గాఁ । బరులన్జిక్కులఁ బెట్టకొందు రెలఁగుల్బాటిల్లు నేయెల్లెడన్ ॥ ౬౫౯ ॥ గీ ॥ ఏటివెలయాలి తనము వీఁడేటివిటుఁడు । పాతపంచాఁగ మెక్కడి పాతకంబు । వెలఁదికొకపుట్టజాలదే బెళుకులేని । మిండగనివానికౌఁగిటనుండు సుఖము ॥ ౬౬౦ ॥ క ॥ ఒకనిపడకింటిపొరువున । నొకనిన్మజ్జనపుటింట నొక్కనిమొగసా । లకునొక్కనినుంచితగులక । నొకనికొకకం డెఱుఁగనీక నుండుకుమారీ ॥ ... ❋

౬౬౧ ॥ క ॥ ఇత్తెఱఁగున నీదత్తరమున । బత్తిగలుగఁ బోర్చుతల్లి బలికిన స్త్రీణాం । చిత్తంచలాచలంబను । సుత్తమవచనంబుఁ దలఁచియువిదగలంగెన్ ॥ ... ... ... ... ❋

❋ శోకరసము. ❋

౬౬౨ ॥ క ॥ కలఁగుచుఁ గాటుకకన్నుల । జలబిందువులురులనవరసాలకిసలయా । కులకోకిలకాకలికా । కలనాకలనాదకంఠకాకుధ్వనితోన్

౬౬౩ ॥ గీ ॥ గోరఁగన్నీరుమీఁటుచుఁజీరచెఱఁగు । మొగముపైఁజేర్చి తుడ్చుచుమగువబిగువు । కౌఁగిటనుజేర్చిలాలించిగారవించి । విటుఁడనీతో డనేఁజెప్పినటులవెలఁగు ॥ ౬౬౪ ॥ క ॥ కాదనకుము పెనుమాళ్లప । సాదముబుచ్చుకొనియెండజల్లబడినయా । మీఁదటనీయిలుసేరుము । నీదయనున్నారమిచటనెమ్మదిననినన్ ॥ ౬౬౫ ॥ సీ ॥ చెదరినవిరులజార్చిగఁజుట్టి నగుమోములబసపంటినమణుంగువల్లెవాటు । గెమ్మోవిపైఁజిన్నిగెంపులచిమచిమల్దరళాక్షిబుక్కిటితమ్మలంబు । గుంకుమఁజనుగుబ్బగుమ్మెఱాల్జిటులగంధపురొమ్మునెలవంకకవురుచంక । జూఫ్రులనిదురకుజొక్కగన్గవలకెంజాయలుభుజముపైసానకత్తి । వారరమణీమణీతుపావసరకుసుమ । కాండసంగ్రామపరిచితగ్లానివలన । నలయునెమ్మేనుదనరమధ్యాహ్నవేళ । వెడలెఁబడకిల్లుభూసురవిటవరుండు ॥ ౬౬౬ ॥ క ॥ కొంచకబిరబిరనడుచుచు । నించుకదలవాంచివచ్చునెడనెడపకనే । తాంచలములుజలకణముల । మంచుగురిసినట్లుగురియమార్గమునందున్ ॥ ... ... ✻

✻ అపూర్వప్రయోగము. చతురక్షరయమకము. ✻

౬౬౭ ॥ తే ॥ గీ ॥ కంతుకంబు విలాసంబుగళముడంబు । కంతుకంబు విలాసంబుగనుకుచంబు । నెఱసరినిమించుమించు కేలూరప్రభాడము । నెఱసరినివెంపుజెంప్రగా నెలఁతనడుము ॥ ... ... ✻

౬౬౮ ॥ గీ ॥ హరిపదముఁబోలుజవరాలిగౌనుకొను । మిక్కటద్దములనుగ్రామచెక్కుఁజెక్కు । గులుకుదేఁటులకింతిముంగురులుగురులు । గరిమనిలకన్నకన్నజఘనముఘనము ॥ ... ... ... ✻

✻ గూఢతృతీయసీసము. ✻

౬౬౯ ॥ జవరాలిచిఱునవ్వుచవిమోవినెమ్మోముచంద్రబింబమ్ము [illegible] తనవధరించుఁ । దలిరాకుఁబోడిమన్నలుకులుహస్తముల్గళముసి[illegible]జైవైఖరిధరించు । చిలుకలకొల్కిచూపులుసెన్నదముకుంతలములునీలా[illegible]భ్రభవిభ్రమముమీఱుఁ । గామినీమణినాసకటిగుబ్బచన్గవకనకాచలోన్న[illegible]తిగరిమమీఱు । వెలఁదిపైజిగినఖములువేళ్లుమెఱుఁగు । రిక్కలగునింతి[illegible]పనులాకృతియునూరు

ఉనవరంభాస్థితిజయించువనితనమప్పు । జడయమూగారునాగాథిసరణిఁ
గెల్చు ॥ ... ... ... ... *

౬౭౦ ॥ క ॥ అనిపొగడిగడియకల్లల। గనియుదుగనివలపుసెకలగ
నికలగనిగనె। మ్మనమునఁగినుకన్గొనక।న్గనుసన్నప్రసన్నతనిడికటకటఁబడు
చుగా ॥ ౬౭౧ ॥ ఉ ॥ తీరనికౌఁగిలింత లెడత్రెవ్వనికోరికలంగకంబులన్ ।
జేరినచమ్మటల్మెఱుఁగుబెట్టనికూరుములొండొకళ్లువే। సారనిజిట్టకంబులు
నుశయ్యసమోపరిసంగమంబులన్ ।నూరటలొందునెమ్మనములొక్కటి
యైనదిమెంచివెండియున్ ॥ ... ... ... *

## * సమసురతము. *

౬౭౨ ॥ సీ ॥ తలఁపువెంబడిగానివలకారిచిన్నెలుకలకూజితముగాని
పలుకఁబడులు ।పునరుక్తములుకానిపొందికమాటలుసొక్కించుటకుగాని
చూపువగలు । తమిసురతప్రేరణముగానిలేనవ్వులాచుంబితముగానియధ
రములును । కౌఁగిళ్ళసడలింపుగానిమై పెనువులకలరేచుటకుగానిబలు
చెణకులు । గాఢసీత్కృతిసహితంబుగానియూర్పు । లలయికతెలుంగ
మికిగానియారజములు । నాత్మఁదలఁచినలేవయ్యోనారనేను । నాలతొంగి
యుఁగ్రీడించువేళలందు ॥ ... ... ... *

## * అపూర్వప్రయోగము. *

౬౭౩ ॥ ఉ ॥ బాలికఁదల్లిబిల్వనఁటబల్కకయుండినగీలెత్తింగిడా । కే
లఁగుచాంతు కాంచలముగీల్కొనిమోవికిద్రివ్వవెన్కకున్ । వాలినవాత
లంపనెడిబేడసఁబట్టదొడంగుమారుచే । గాలపుజివ్వబోల్చెలిచొకామె
యిమెమ్మోయిడాయనబ్బునో ॥ వ ॥అనుచుననిచినమనంబున॥ ... *

౬౭౪ ॥ క ॥ ఇల్లాలిమేనసగమును । దల్లిపయిన్సగముగాఁగఁదక్కి
నసొ । మ్మెల్లనుపోకడబెట్టిన । నిల్లనిమొకటునికెడందమిటునటుకలఁగన్॥
౬౭౫ ॥ సీ ॥ తందనాలుబాడియందమా మెనటన్నవానిపై మీఁదిదువ్వలు
కవైచి । మెడకౌరితనములునడచుగత్తెరకాంద్రకిచ్చకమ్ములుగాఁగ మెచ్చు
గొసఁగి । పిలువుఁడ్ ... వరాకనిలిచినబోఁటికిపోవట్టుగావేదుకొక్కమి

చ్చి । వడిదంబులకొకింతజడియక నోకమాటలోనవైవెయ్యాటులైనవా సఁగి । వీటిలోమిడి మేలవువిటునివిధము । సాంగఁగొన్నాళ్ళనిజపిత్రుసంచి తంబుఁ । బొల్లుగాఁజల్లియది మెల్లసళ్లుటయును । దల్లడిల్లుచుదుర్మార్గత ల్లఁజూంపు ॥ ... ... ... ... ... ✻

## ✻ అచ్చ తెనుఁగు. ✻

౬౭౬ ॥ క ॥ వాకడిదముచేకత్తియ । బోకలునాకులునుబూనిబుడత గొలువఁగా । మేకొనిఢీకొంచపయను । వాకటుచాలించియింటివాకిటికి వలెన్ ॥ ... ... ... ... ... ✻

౬౭౭ ॥ క ॥ వగదప్పితిరిగి విటగిన । పగిదిన్దలవాంచిమెల్లబంధులు దెగడ । న్మొగసాలవచ్చినిలిచిన । వగసాలకజననిదొమకవచ్చెన్వానిన్॥

౬౭౮ ॥గీ॥ ఇంటియిల్లాలిచేఁదలయంటఁజేసి । మజ్జనముభోజనంబునమర్చి పిదప । వీడియము మొసంగిసాత్త్వికజాడనున్న । కొడుకుతలదువ్వుచునుతల్లిను డివెనిట్లు ॥ ౬౭౯ ॥ ఉ ॥ గట్టులు వేద విద్యలక గారము శాస్త్రవివాదరూ ఢికి । న్బుట్టినయిల్లుశీలతకుభూస్థలినట్టిగృహస్థునందునీ। యట్టికులైకపాం సనుఁడునకక్కటగల్గునేయాణిముత్యము । ల్బుట్టెడుదామపర్ణిమటిబుట్టక యున్నదెయోటిగుల్లయున్ ॥ ౬౮౦ ॥ ఉ ॥ సాధుతనంబు నన్మెలఁగిసజ్జ నుఁడంచునుమంచివారుని । న్నాదరణంబొనర్పవినునట్టిది మేలుగణింపఁజె ల్లదీ । జూదరియంచుబల్కువినుచున్సరియించుట లెల్లవీతమ । ర్యాదములో ప్రయోజనములర్థములేమహి దేవజాతికిన్॥ ... ✻

## ✻ నారికేళపాకము. ✻

౬౮౧ ॥ శా ॥ బంధుద్వేషదవాగ్ని గంధవహముల్ బాపావలంబా క్షతాగ్రంధుల్, సంచితవిత్తభూరుహకుఠారంబుల్గా, సుసంసారజీర్ణాం ధుపప్రస్ఫుటపాత హేతువులు, వేదాంతజ్ఞదైర్వాఖ్యలైనీ । గంధేభంబులు, వా రకామినులవీక్షల్ నీవపేక్షింతువే॥ ... ... ... ✻

౬౮౨ ॥ సీ ॥ ఉత్తముండవురు తత్త్వవేత్తయునిర్జితేంద్రియుఁడుదుర్జన జయాధికుఁడుసర్వ । శాస్త్రార్థపారగుఁడస్త్రశస్త్రవినోదిసకలభూతహి

లునవరంభాస్థితిజయించువనితనమప్పు । జడయునూగారునాగాళిసరణిఁ
గెల్చు ॥ ... ... ... ... ❋

౬౭౦ ॥ క ॥ అనిపొగడిగడియకల్లల। గనియుచుగనివలపుసెకలగ
నికలగనిగనె। మ్మనమునఁగినుకన్గానక।న్గనుసన్నప్రసన్నతనిడికటకటఁబడు
చుణ్ ॥ ౬౭౧ ॥ ఉ ॥ తీరనికౌఁగిలింతలెడఁబ్రెవ్వనికోరికలంగకంబులన్ ।
జేరినచిమ్మటల్మిణుఁగుబెట్టనికూరుములొండొకళ్లువే । సారనిజిట్టకంబులు
మళయ్యాసమోపరిసంగమంబులన్ । నూరటలొందునెమ్మనములొక్కటి
యైనదిమెంచివెండియున్ ॥ ... ... ... ❋

❋ సమసురతము. ❋

౬౭౨ ॥ సీ ॥ తలఁపువెంబడిగానివలకారిచిన్నెలుకలకూజితముగాని
పలుకుఁబడులు ।పునరుక్తములుకానిపొందికమాటలుసొక్కించుటకుగాని
చూపువగలు । తమిసురతప్రేరణముగానిలేనవ్వులాచుంబితముగానియధ
రములును । కౌఁగిళ్ళసడలింపుగానిమైపెనుకువల్కళరేచుటకుగానిబలు
చెణకులు । గాఢసీత్కృతిసహితంబుగానియూర్పు । లలయికలెఱుంగ
మికిగానియారజములు । నాత్మఁదలఁచినలేవమ్యొనారనేను । నాలతాంగి
యుఁగ్రీడించువేళలందు ॥ ... ... ... ❋

❋ అపూర్వప్రయోగము. ❋

౬౭౩ ॥ ఉ ॥ బాలికఁదల్లిబిల్వఁటబల్కకయుండినగీలెఱింగిడా । కే
లఁగుచాంశుకాంచలముగీల్కొనిమోవికిద్రివ్వవెన్కకున్ । వ్రాలినవాత
లంపనెడిబేడసఁబట్టదొడంగుమారుచే । గాలపుజివ్వబోల్చెలిచూకామె
యిమెమ్మొయిడాయునబ్బునో ॥ వ ॥అనుచుననిచినమనంబున॥ ... ❋

౬౭౪ ॥ క ॥ ఇల్లాలిమేనసగమును । దల్లిపయిన్సగముగాఁగఁదక్కి
నపా । మ్మిల్లలనుపోకడబెట్టిన । నిల్లనిమొకటునికిడెందమిటునటుకలఁగన్॥
౬౭౫ ॥ సీ ॥ తండనాలుబాడియందమామెనటన్నవానిపై మీఁదిదుప్పటిఱు
వవైచి । మెడకౌఁరితనములునడచుగత్తెరకాంద్రకిచ్చకమ్ములుగాఁగమెచ్చు
లొసఁగి । పిలుపుఁ వరాళనిలిచినబోఁటికిరోవటుగావేడుకొకట

చ్చి । దడిదంబులకొకింతజడియక నొకయూటలోననె వెయ్యాయిలైననొ సఁగి । వీటిలోమిడి మేలవువిటునివిధము । సాఁగఁగొన్నాళ్లనిజపిత్రుసంచితంబుఁ । బొల్లుగాఁజల్లియది మెల్లసళ్లటయును । దల్లడిల్లుచుదుర్మార్గతల్లజుండు ॥ ... ... ... ... ... ❁

❁ అచ్చతెనుఁగు. ❁

౬౭౬ ॥ క ॥ చాకడిదముచేకత్తియు । బోకలునాకులునుబూనిబుడతగొలువఁగా । మేకొనిధీకెంచపయను । వాకటుచాలించియిుంటివాకిటికవలెన్ ॥ ... ... ... ... ... ❁

౬౭౭ ॥ క ॥ వగదప్పితిరిగి విఱిగిన । పగిదిన్దలవాంచిమెల్లబంధులుదెగడ । న్మొగసాలవచ్చినిలిచిన । వగసాలకజననిదొమకవచ్చెన్వానిన్॥ ౬౭౮ ॥గీ॥ ఇంటియిల్లాలిచేఁదలయంటఁజేసి । మజ్జనముభోజనంబునమర్చిపిదప । వీడియమొసంగిసాత్వికజాడనున్న । కొడుకుతలదువ్వుచునుతల్లినుడివెనిట్లు ॥ ౬౭౯ ॥ ఉ ॥ గట్టులువేద విద్యలకగారము శాస్త్రవివాదరూఢికి । న్బుట్టినయిల్లుశీలతకుభూస్థలినట్టిగృహస్తునందునీ। యట్టికులైకపాంసనుఁడునకృటగల్లునేయాణిముత్యము । ల్బుట్టెడుదామ్రిపర్ణిమఱిబుట్టకయున్నదెయోటిగుల్లయున్ ॥ ౬౮౦ ॥ ఉ ॥ సాధుతనంబు నన్మెలఁగిసజ్జనుఁడంచునుమంచివారుని । న్నాదరణంబొనర్పవినునట్టిది మేలుగణింపఁజెల్లదీ । జూదరియంచుబల్కువినుచున్జరియించుటలెల్లవీతమ । ర్యాదములౌప్రయోజనములర్థముులేమహిదేవజాతికిన్॥ ... ❁

❁ నారికేళపాకము. ❁

౬౮౧ ॥ శా ॥ బంధుద్వేషదవాగ్ని గంధవహముల్ పాపావలంబాక్షితాగ్రంధుల్,సంచితవిత్తభూరుహకుఠారంబుల్,సుసంసారజీర్ణాంధుపరిస్ఫుటపాతహేతువులు,వేదాంతజ్ఞధైర్యాగ్నినీ । గంధేభంబులు,వారకామినులవీక్షల్నీవపేక్షింతువే॥ ... ... ... ❁

౬౮౨ ॥ సీ ॥ ఉత్తముండురు తత్వవేత్తయునిర్జితేంద్రియుఁడుదుర్జనజయాధికుఁడుసర్వ । శాస్త్రార్థపారగుఁడస్త్రశస్త్రవినోదిసకలభూతహి

తుం డుశాంతచిత్తుఁ । డతిథిపూజాపరుండార్తావనుఁడునయశాలిసమును
డుసుజ్ఞాననిష్ఠుఁ । డర్థవంతుండుసదాచార సంపన్నుఁడీక్షణత్రయుదూరుఁ
డింగితజ్ఞుఁ । డన్నదానచణుండుమహానుభావుఁ । డుపితృభక్తికల్పుండు
నిష్కపటగుణుఁడు। సత్యవచనుండునిఖిలలక్షణతనుండు । శౌరికీర్తనయు
తుఁడుసజ్జనుఁడు గాని॥ ... ... ❀

❀ ధ్వని. ❀

౬౮౩ ॥సీ॥ అవివేకియున్మత్తుఁడలసాత్ముఁడజ్ఞానియపకారిదుర్మార్గుఁ
డప్రసిద్ధుఁ । డనృతవాదిపరాంగనాసక్తుఁడల్పుఁడునాస్తికుఁడధముఁడన్యా
యపరుఁడు । మూఢుఁడపూజ్యుండుముచ్చుజూదరిపందజాల్ముండుమిత్ర
వంచకుఁడులోభి । గర్వాంధుఁడుశఠుండుకాముకుండు దరిద్రుఁడుమలినుం
డుపతితుండుకుజనుండు। కొండియుఁడుహింసకుఁడు పానిదుండగీఁడు।బం
ధుదూషణుఁడసమర్థుఁడంధుఁడగుణి। తల్లిదండ్రినివిడనాడుతనయుఁడీవట।
యుండరాదారహరియాజ్ఞనోతనూజ॥ ... ... ❀

❀ ప్రాసభేదము. ❀

౬౮౪ ॥క॥ మిత్రునితేజము విశ్వా । మిత్రునిశక్తిగలదంచుమెండుగ
మిథ్యా । మిత్రస్తోత్రమువిననువి। ధాతృఁడునీరీతినీదుతలవ్రాసెనో కో॥ ❀

❀ అపూర్వప్రయోగము. ❀

౬౮౫ ॥క॥ నీనారినివీడియుడా । నీనతచేదాసిడాసిచెడితిరుగకుమా ।
నానోముఫలమనిననే । నోనాడఁగలేనురాతనూజాతవరా॥ ... ❀

❀ ఆదియమకము- అపూర్వప్రయోగము ❀

౬౮౬ ॥క॥ పారావారగభీరయు । దారోదారోర్జితగుణతతతవి
ద్యా। మారామారాజితగృహ । మేరామేరాగవింతేమెరమెరకొమరా॥

౬౮౭॥క॥ మదిరాగిలదోనిప్రే । దిరానేఁడెంతవింతయవ్యోనుబైపై ।
మదిరాక్షికొనఁగనాసా।మ్మదిరాజూచుకొని వెడలుమనునినుతనయా॥ ..❀

❀ ధ్వని- ప్రాసభేదము ❀

౬౮౮॥ క ॥ లోకమునఁదల్లిదండ్రుల । వాకొనరింపుచునుపత్నివదలక
బంధుల్। లోకులుమేలనిపొగడెడి ।నీక్రియసత్పుత్రకులుచరింతురుపుత్రా॥ ❀

❀ సమాసగతపూర్ణార్థి. ❀

౬౮౯ ॥ క ॥ చల్లదనంబునువితరణ । ముల్లాసముచక్కఁదనమునుర్వీ స్థలిరం ।జిల్లకళాభావుకుఁడై । హల్లకహితరీతితనయయలరుదువుగదా॥

❀ ప్రసాదము. ❀

౬౯౦ ॥ సీ ॥ బ్రహ్మచారిద్విజపటలికినీడంబు గృహికుముదావళికిం దుబింబ । మఖిలవానప్రస్థహరిణాళికుటజంబు,యతిదేవతతికిపుణ్యస్థలం బు । బాంధవగణపాదపములకుమధువేళ, సజ్జనమణులకుసాగరంబు । మార్గణకమలసంహతికిభానూదయం బాశ్రితశిఖులకబ్దాగమంబు । హరికథాదిమనిగమాప్తికక్రభూమి । సకలశుభపరంపరలకుజన్మదేశ । మమితసత్కర్మఫలములకాస్పదంబు । నైననీయిల్వరుసనెంచరాకుమార ॥ ❀

❀ దుష్కరప్రాసము. ❀

౬౯౧॥ క ॥దాహ్లీకహయాధిరోహణ । యాహ్లాదకరోరుమానసాంబుజభక్తి । ప్రహ్లాదసుస్వరజితఘన । నహ్లాసశరత్ప్రపూర్ణనాయనివదనా॥ ... ... ... ... ❀

❀ కాంతి. ❀

౬౯౨ ॥ సీ ॥ తుల్యలేనిదమయంతిగలవానిగలవాని కొమరునికొమరుని కొమరుమాపు । మొనకిమ్మకొను నెమ్మె ననయమ్మననయమ్మననయమ్మగను మేటియయ్యయోర్పు । తులకించుపసిఁడిమిన్నలమించు నలమించునలమించునెనసినయతనియీవి । రవణాలచౌలచొక్కపురాలకపురాలకపురాలమునగెల్చుకడిఁదియశముఁ । బూనివిలసిల్లునీవంటివానికిటుల । యింటలేనట్టినడవడిమెట్టులొదవె । కొదలుదీరెనునీయట్టికొడుకుగలుగఁ । దల్లిదండ్రులకిపుడుపీతనయతనయ ॥ ... ... ❀

౬౯౩॥ గీ ॥ గునియయుజాత్సెగ, చెక్కటగోరు, మోవి । కెంపు,లత్తుకను దుర,గంధంపుచిటులు । వాతపసపంటువలువతోవచ్చినట్టి । పుత్త్రయిది కానినడతకుపులుగుగాదె ॥ ౬౯౪ ॥శా॥ నామాటల్వినసేరకేని యతినున్న న్భస్మహవ్యంబుగా । కేమీదానఁబ్రయోజనంబుగలదేమేలన్నఁబూర్వంబు

వట ॥ రామాదుల్పితృవాక్యపాలకులు గారా వారునీసాటిరా । రామం
డొడ్డఁగనేలరాతనయరారాలేచినావెంబడిక ॥ ౯౫ ॥ సీ ॥ దీపితత్రాం
తిప్రదీపంబుకోపంబు, పాపసర్పాంధకూపంబుకోప । మాపూర్ణనయక
శాత్కపంబుకోపంబు, బంధుసస్నేహదీపంబుకోప । మాపాదితప్రభా
లోపంబుకోపంబు, భయదవచోస్త్రచాపంబుకోప । మాపదుగాృనలా
టోపంబుకోపంబు, పౌరుష్యగుణకలాపంబుకోప । మంబరసుమాత్యబద్ధ
రూపంబుకోప । మంబుజాక్షుకృపాదురాపంబుకోప । మంబికావేశహే
తుధూపంబుకోప । మగుటకోపంబువలదుమాయన్నవినుము ॥ ౯౬ ॥
మ ॥ అవివేకాస్పదమాపరాంగనలసఖ్యంబేడనీయాయబూ । కవిశిష్టాన్వ
యమేడనిర్దయుఁడవై గారాబుటిల్లాలిశీ । లవయోవిభ్రమధన్యనిట్లలంచమే
లాతల్లినిన్దంఁడ్రినిక । జివుకజ్జేయుదెపుత్రనీవెప్పుడుదాసీనప్రచారంబులక ॥
౯౭ ॥ గీ ॥ అన్నయేలయ్యనినువిన్నకన్నవారు । గానివాఁడనఁదలవంచి
యేనుమెలఁగ । నాఁడునాటికినీకానినడతచేతఁ । గులమునిల్లునువేఱుకాఁ
దలఁచినావు ॥ ౯౮ ॥ సీ ॥ సాధువర్తననమాచారసంతతగుణోత్తరుఁడై
నతండ్రినిఁదలఁచవన్న । యాయజూకమహాశ్వవాయవరేణ్యుఁడైదగుమేన
మామనుదలఁచవన్న । సత్యవ్రతాచారనిత్యవర్తనలనుత్తమనైననన్నెదఁ
దలఁచవన్న । కులరూపగుణములఁదులలేనియావనోజ్జ్వలమైనయిల్లాలిఁ
దలఁచవన్న । పౌఢలగుతోడివారలఁజూఁడవన్న । వాడలనుసజ్జనశ్రేణిఁ
గూడవన్న । యాడికలకోర్చుమతివిడనాఁడవన్న । నేఁడుమొదలుఁగఁగీర్తి
రాఁబూడవన్న ॥ ... ... ... *

## * దారిద్ర్యా పాకము. *

౯౯ ॥ క ॥ పదునాలుగేండ్లపాయపుఁ । జదురాలిన్ముద్దరాలిఁజక్క
నియాలిక । వదలుదురెయుకటయదినా । పొదగిఁటిలోనిదురఁబోవఁబో
సఁగునైతనయా ॥ ... ... ... *

౨౦౦ ॥ ఉ ॥ కొమ్మనునేలుకొమ్మకడికుందనమీనిసుమమ్మరెమ్మరే । గు
మ్మతుపాసిరేకనిదికోవుజగాజగ్రమ్ముతెమ్మెర । త్నమ్ముబెడంగురంగువి

డిదాల్చినపైఁడిగనమ్ముబొమ్మశ్రీ । లమ్మరునమ్మయిట్టి నవలానవలానొక
చాలఁబోలునే॥ ... ... ... ❋

❋ సుకరప్రాసము. ❋

౨౦౧॥ క ॥ అరవిందాననదీధితి । కురువిందరచాంశుకంబుకుచఁగ
నినబల్ । గురువిందగింజవాతెఱ । సరవిన్దగులికుచకుచనుసడలన్దగునే ॥

౨౦౨ ॥ శా ॥ అన్నానిన్ననిమెత్తిపెంచి యుపవీతాన్వీతుఁగావించి
యూ । కన్నెన్బెండ్లియొనర్చిమీరిరువురున్నారాముచేనొప్పఁగాఁ । గన్ను
ల్లల్లఁగఁజూతునంచుమదిఁగాంక్షల్మిఱనేనుండఁగాఁ । జిన్నంబుచ్చితివిన్నినా
ళ్లునను దుశ్శీలుండవైపుత్రకా॥ ౨౦౩ ॥ శా ॥ సారస్యంబునఁదంద్రికన్నసు
గుణశ్లాఘుండవైభూమిభృ । ద్ధారాదత్తసమస్తవిత్తములచేతన్ సత్కళా
విత్తముల్ । జేరన్ సత్కృతిజేసినీవలరనీక్షింపంగమాబోటులౌ । వారా
సింపరెచందమామపొడుపావారాశిచందంబునన్ ॥ ౨౦౪ ॥శా॥ ఏమీప
ల్కవు నేనుబిల్వ, దయలేదేనీకునాయయ్యనీ। న్నేమంటిన్సుకుమార, నామె
డనుదప్పేదీకుమారగ్రణీ, । నామీఁదన్ జలమేలరాతనయ, నన్మన్నించరా
పెన్నిధీ, । నీముద్దుల్గననోఁచినాఁగదరతండ్రీ,నీతిపారంగతా ॥ ౨౦౫ ॥మ॥
అనినన్నాటకులోఁగనట్టులనెవాఁడట్టిట్టనాకూరకుం । డినఁదానెంతయు
సంతసించియనుమానింపన్దలంపేదివు । త్రునకున్ బ్రీతిఁగవానిపైమమత
యొంతోకానిమైనున్నసా । మ్మునుదాఁగోడలికిచ్చిసూనుభవనంబున్ జే
రఁగాఁబంచినన్॥ ❋

❋ అపూర్వప్రయోగము. ❋

౨౦౬ ॥సీ॥ కొలనికెలంకునందలి గుజ్జుతేమావి చెంగటఁజలువగొ
జ్జఁగులఁదగిన । సురపొన్నదరికినుత్తరపుఁగ ప్రపుటనంటులపజ్జఁబొగడ
లంటులనెగడిన । వెనుమల్లెలఁగల సంపెఁగలఘుమంఘుమల్గలగొనిసోర
ణగండ్లదారి । గనివచ్చుగరువలిఁగదలుజంత్రింపుఁబ్రతిమలువాయించుమద్దె
లరవళికి । దొలుతసుతికోయిలయొసంగఁదొడగొర । వంకతాళములుగ్గడిం
పంగనెమలి । సకియనటియింపమరునాట్యశాలలీల । పంతువగబొల్చుకేళీ

గృహాంతరమున ॥ ... ... ... ❋

౭౦౭ ॥చ॥ చికిలికిరీటిపచ్చరవజెక్కడపుంబనిపాదపట్టెలన్ । రకమగుబూదిదాల్పువిడిరాజిగిచొక్కపుఁబెచ్చుకోళ్లపై । సకినలపల్కుగన్నిరడసంతసగూర్చినజంటపోగుట । ల్లికగలకీలుమంచమునవేవడిఖాడబుఁడబ్బురంబునన్ ॥ ౭౦౮ ॥చ॥ చెఱఁగులునాల్గుసుర్కిడలఁజేసిబిగించిగడున్వెలార్చుపూ । పఱపునబవ్వళించిదనపైదలిరాకకుఁగల్వనేస్తిబల్ । చుఱుకుచురంగురంగుగలసోరణగండ్లనుదృష్టినిల్పిద । త్తఱపుదువాళిచూపువెడిదంబునఁజూచుచునుండి యవ్యేడన్॥ ... ... ❋

❋భావశబలితము.❋

౭౦౯॥మ॥ చెలిపల్కెప్పుడు విందునోనగరెనాశీలంబుఁగన్గొన్నగాఁ । గిలినాకెన్నఁడొసంగునో సకిమృదూక్తిన్ దల్లిబోధింపవా । ర్మలయన్దోసముగాదెనేఁనుదు నాత్మనాతవార్లిద్దప్పనే । నలనామోహినిఁజూడకున్ననికనా బ్రాణంబులెట్లోకదే। ... ... ❋

❋స్వభావోక్త్యలంకారము.❋

౭౧౦॥సీ॥ మొదటనురేకయాకుదురు నగనుపించి మొలకలై మొగ్గలైతళుకుఁగలిగి । గఱిగట్టిపోకలకలమట్టులైబొన్న కాయలయంతలైచాయ లెసఁగి । తాళములంతలైదగ నిమ్మపండులకొద్దులైబొంగరాలుద్దిగాంచి। తాళఫలంబుల తరములై బంగరుకుండల జోడులైగండుమీఱి । కొండలవిధమ్ములైతొమ్మునిండదొరసి సరిగవిరివిగ నొకటొకటొరసిమించి। మొగమునకునెగయుచున్న బిగువుగబ్బి । గుబ్బచన్నుల చెలికౌఁగిలబ్బుటెపుడొ॥ ... ... ... ❋

❋ఔత్సుక్యము.❋

౭౧౧॥సీ॥ తరియించుటెలాగు తలిరుటాకుంబోడి వెలలేని సరసోక్తివిసకయున్న । వడదేరుటెలాగువాలుఁగన్నుల కల్కివలిపెపవ్యెదగాడ్పుసొలయకున్న । తమిబుట్టుటెలాగుకొమిరెపాయపుటన్నుతలమానికపుదండగలుగకున్న । నిదురించుటెలాగునెలఁత వేడెపుగుబ్బనిండుకౌఁగిటనంటి

యుండకున్న। తాపమారుట యేలాగుతమ్మికంటి। గళరవమ్ములుమంజీర కలరవములు। మూలఁబోకమ్మ బెళుకులు మొలకనగవు। లెనయఁజైకొ నిరతినలయించకున్న॥ ... ... *

౭౧౨॥వ॥ అనిదురంత చింతాశబళితాంతరంగుండై కులకాంతమీఁద నాలసియొల్లనితమిను న్నసమయంబున ॥౭౧౩॥ క ॥ సుతుచెంతకుఁదనకో డలి। సతతముగాఁ జేసిపిలువ చలువలరుమరు। త్పతదేలాలతనాలో। లత నాలతకూన తొట్రిలంబడనగుచున్ ॥౭౧౪॥ఉ॥ తచ్చనలాడి బువ్వటడిదం బుగ్రమంబునసన్న లెత్తఁగా। వచ్చినరీతినంతగడువై పునగాఁగిటఁగు చ్చిమెల్లనే। నచ్చెలినంచలంచలదు గామడగాదొడితెచ్చిబిడ్డఁడు। న్నచ్చట నిల్పియేగనురయంబున నొక్కనెపంబుతోఁ దుతన్ ॥౭౧౫॥ఉ॥ ఎప్పుడుబ్రొ ద్దుగ్రుంకుసతి యెప్పుడు జేరఁగవచ్చుదానిసా। మ్మెప్పుడునాదుచేదొరుకు నెప్పుడు వారలతాంగికిత్తున। నెప్పుడుగారవించునిదియేక్రియనోరుతునం చునుండఁగా। నప్పుడెవచ్చెనింతిమగఁడైనదురాత్మునినమ్మవచ్చునే॥౭౧౬॥ క ॥ వెలయాలిచెవ్వులెంతయుఁ। దలఁపుచుఁదద్విరహావహ్ని తాపాలసుఁ డై। కలఁగుబతిఁ గ్రతిచింతా। విలమానసయగుచుఁ జేరివినయంబెసఁగన్॥

*యతిభేదము- అపూర్వప్రయోగము.*

౭౧౭॥వ॥ మెలిముకు కెంపుమేల్చిలువమే పరిఫాపనికీలుచిల్కసూ। కెలవిడిదాచుకుండనపు తొక్కలచక్కని చెక్కపంచుటా। కులుకొనగో టఁజీలిచిభుగుల్కొనుగ ప్రపున్నముంచియు। చ్చెలిమదుపోరనుండితమి సిగ్గునడగ్గరి వీడెమివ్వఁగన్॥ *

౭౧౮ ॥క॥ మదుపుఁగరమ్మునఁగైకొను। వదువునఁ జెలికేలుబట్టివద్దికి దివియన్। బడఁతుకయొదుగుచుమెల్లనఁ। దొడతొడయొఱయన్విరాళితో వసియింపన్॥౭౧౯॥క॥ అత్తఱినినాగదత్తుఁడు। బత్తిగలుగు సతికిదనదు పాడిమటూపన్। జిత్తంబుగరఁగి మోహాప్తుఁ। దత్తరపుదువాళిమీఱద యదైవాఱన్॥ * *

*నవోఢాసంగమము.*

౭౨౦॥సీ॥ సాచీకృతాననోజ్జ్వలమందహాసంబుసకటాక్ష తాటంకచక

తకంబు । హుంకారకంకణక్రేంకారనినదంబు స్ఫురితవక్రీకృతభ్రూవియు
గంబు। కర నిరుద్ధ స్తనోపరిభాగచేలంబుహ స్తద్వయీకృతస్వస్తికంబు । కుం
చి తాంగకక్రియాగుప్తసీమగ్రంథిఘీరసంయుత కోమలోరుయుగము । విలసి
తస్వేదవదనాబ్జవిలసనంబు । గాఢపులకోద్గమంబునుగలుగుసతిని । దోలు
తరతిఁదేల్చెనాగదత్తుండుదనదు । విలువజవరాలికూటమిఁదలచితలఁచి॥

౭౨౧॥గీ॥ అపుడునిట్టూర్పునిగుడించియలరుసజ్జ । నవ్వలవ్వలిమొగము
నబవ్వలించి। మెల్లనేచేతిగాజులుఘల్లురనఁగ । గృహిణిపాదంబులొత్తనిద్రి
తుఁడుబోలె ॥ ౭౨౨॥క॥ ఉండునెడనతని మంచము । దండఁబడపాన్పింతస
రణిఁదనదెఱఁగుమహీ । మండలిఁబఱచి శయించెను । నిండినప్రేమమునఁ
దరుణినిద్రాన్వితయై ॥౭౨౩॥శా॥ అంతన్లేచిలతాంగిమైదొడవులాద్యంతం
బుసంతోషిత । స్వాంతుండైసతిసేయుభాగ్యవశతన్ జంపన్దలంపేదివాఁ
డెంతేనిన్దయలేక పుచ్చుకొని తానిల్వెళ్లి యావేళనే చెంతన్నిల్వకవా
రకాంతయిలుజొచ్చెన్సిద్ధసంకల్పుఁడై ॥౭౨౪॥గీ॥ చొచ్చితననెయ్యురాలి
కిఁజూపిదాని। తల్లిపాతరలాడసొమ్మెల్లనొసఁగె।దలఁచుకోనేరఁడయ్యేమిఁ
దటితెఱఁగు।నింకనిమ్మన్ననేరిసొమ్మివ్వఁగలఁడొ ॥౭౨౫॥క॥ ఇచ్చిననాసొ
మ్మంతయు। మచ్చికరాఁదీసికొన్నిమాసంబులకా। నెచ్చెలినిగన్నజంతటు।
బచ్చెనమాటలనుబయలుపందిలియిడుచున్॥

## అపూర్వప్రయోగము.

౭౨౬॥ సీ ॥పడుచులచేవానిపాదముల్గడిగించిహాయలుఁబావడఁదడి
మొత్తఁజేసి । కైలాగొసంగివేగంబెదోకొనిపోయి తళుకుఁగుంకుమగంధ
మలఁదిచలువ । గట్టించిమొరమెత్తుకపురపుబాగాలవిడెమిచ్చివరములుబ
డసికన్న । లేజవరాలితోరాజసంబుగవాని మంచంబుచెంగటఁజుంచిచీని ।
చాపపైనుండియుచితసల్లాపగరిమ ।నుబుసుఁబోకలనాకకొంతయూరడిం
చి। వెలలబన్నెదుదనకూళతలఁపునేఁడు । గాననేఁడనివెలనేస్తకానిఁజూచి॥

## అపూర్వప్రయోగము.

౭౨౭॥ క ॥ ముంటిమొనసెల్పినటులే । ముంటిమినినుఁబాసినట్టిమొద

లీవరకుట ।వెంటనె రాఁగంటను నినుఁ।గంటని దానంబుఁగఁటకాదే చెలియా॥

❁ కార్వాక్తిప్తము. ❁

౭౨౮ ॥క॥ ఇచ్చునెపఁగనలుగర్జిలు ।నిచ్చియునచ్చియునుజాలునే డెస
పైనా । హెచ్చుగనీవలెనిచ్చునె । యచ్చటిఘనుఁడెపుడుమాధవార్యుని
తనయా? ॥ ❁

❁ చారుతావినోక్తి. ❁

౭౨౯ ॥ఉ॥ కోపనుగానిచూపు, నెలకొన్నవికారములేనిరూపు, సం
తాపమురానిమేపు, నిరతంబునువేసటలేనిప్రాపు, నా । ప్పాపమునేనిఁ
కాపు,కలదాగెపునెమ్మదికోపు,బూమిలో। వైపునసీకెగాకబెఱవారికిలే
దుగదాధరామరా॥ ❁

❁ పంచదశవర్ణయుక్తపాదయమకము. ❁

౭౩౦ ॥క॥ ఔరామాధవయజ్వకు । మారామనుమదనసమరమాధు
ర్యుఁడవై । ధీరావిటార్యయేలితి।మారామనుమదనసమరమాధుర్యుఁడవై॥

❁ ఏకనియమద్విప్రాసలయగ్రాహి. ❁

౭౩౧ ॥ మాఘువనకుందకుసుమౌఘు వలదుత్కటరసౌఘవరణీయజిత
మాఘువచనశ్రీ । లాఘువవచోవిభవనాఘువశమానససుమౌఘువనజవ్రజని
దాఘువసుమూర్తీ । మేఘువదిభోత్తమఘటాఘువలయధ్వనినమోఘువసతీ
డ్యశరలాఘువభుజాజో । రాఘువసమానకవిలాఘువనివృత్తికరమాఘువన
పాలనవమేఘవరదానా ॥ ❁

❁ పైపద్యమునకర్థము. ❁

మాఘు=మాఘుమాసమందలి, వన=వనమున, కుందకుసుమౌఘు=
మొల్లపూరాశియందు, వలత్ = కదలుచున్న, ఉత్కట=అధికమైన,ర
సౌఘు=మకరందప్రవాహముచేత, వరణీయ=ఇచ్ఛయింపఁదగినదియై,జి
త=జయింపఁబడిన, మాఘువచనశ్రీ=మాఘుకవివాక్సంపదయొక్క, లా
ఘువ=మనోజ్ఞానముగల,వచోవిభవ=వాక్యసంపదఁగలవాఁడా? నాఘువశ
మానస=పాపరహితమైనమనసుఁగలవాఁడా? సుమౌఘు=దీనులనెడి, వ

నజవ్రజ= తామరగుంపులకు, నిదాఘవసుమా శ్రీ=నిదాఘలక్ష్మివంటియా కారముఁగలవాఁడా? మేఘవత్=మదయుతమైన, ఇభోత్తమఘట=గజస మూహముయొక్క, ఘవలయధ్వని=ఘంటాసముదయమందలిధ్వనిచేత, అమోఘ=అతిశయమగు, వసతి=గృహముచేత, ఈడ్య=స్తోత్రము చే యఁదగినవాఁడా? శరలాఘవ=బాణవేగముఁగలిగిన, భుజౌజో=భుజప్ర తాపముఁగలిగిన, రాఘవసమాన=రాఘవునితోసమానుఁడా? కవిలాఘ వనివృత్తికర=కవులచులకఁదనములనుపోఁగొట్టుటయందు, మాఘవన=మ ఘవనసంబంధమైన, పాలా=వృక్షమువంటివాఁడా? (అనఁగాఁబారిజాత మువంటివాఁడా?) మేఘవరదానా=మేఘమువంటిశ్రేష్ఠమైనదానముఁగల వాఁడా? ఇందుకునిఘంటుప్రయోగములు. నానార్థరత్నమాల. మేఘా(స్త్రీ) పాటలాయాంస్యాత్ । త్రిషునిష్ఫలదీనయోః॥ మేఘోనిదాఘేకింకిణ్యాం। ఘంటాయాఘటనేచషః । అగురుక్ష్వప్రసిస్సార । మనోజ్ఞేషులఘుస్త్రిషు । ఓఘః ప్రవాహేనివహే।నృత్తన్నత్తంపరంపరాం ॥ దుఃఖైనోవ్యసనేష్వఘం॥

౭౩౨॥ క ॥ మెచ్చితిననినిక్కముగా । నుచ్చాటనజేయఁదలఁచియున్న దియనివాఁ । డచ్చెంగటఁదత్పుతఁగని। తచ్చనికాసునకువెరవుబారకయం తట॥ ౭౩౩ ॥క ॥ ఓరమణిఁయిట్టులేటికి । సారమణీభూషలిడకయసురుసు రనుచుణ్ । దీరనిచింతాభరమున । గూరెదవిత్తెఱఁగుపేరుకొనుమాతెలి యఁణ్ ॥ ౭౩౪ ॥ చ ॥ తొలురతినీవునన్గలిచితోడగుమోవికికావిడాల్కర । మ్ములకునుబచ్చతాకడియముల్ జనుదోయికిహారముల్కటి । స్థలికినిమేఖ లంబును, బదంబునకందెయొసంగిపోరుటి । మ్ములవెనకొటకొప్పుబలముఁణ్ ముడికట్టులఁగట్టితేచెలీ ॥ ౭౩౫ ॥ ఉ ॥ ఏటికినన్నెదుర్కొనవదేటికికొంగిఁ టఁగుర్చిచేరవిం । తేటికివిన్ననయ్యెదవదేటికిచూచెదుటిత్తచూపుల్ణ్ । మాటిటివెందునీకులుకుమాటలునీనగుమోముశేటలో । పాటలపాటలా ధరకృపన్గనుమాయనువానమేటికిణ్ ॥

## మోహము.

౭౩౬॥ సీ ॥ భామనీమోముఁదప్పకజూచుమోహంబునెలఁతనీస్నైసో

కనిలుచుచాళి। చాలనీమధురోక్తులాలించఁగలప్రేమపడఁతినీమోవిముద్దిచ్చు తలంపు । చెలువనీచన్గవఁజేపట్టుత మకంబుగలికిని స్గిలిగింతగొలుపువలపు। లలననీయూడిగంబులకుఁ జాల్పడుమేలువనితనీకౌఁగిటఁ బెనఁగుకుతమి।వె లఁదినీయుపరతిమీఁదఁబొలుచుహాళి । కొమ్మనినుదక్కి-దక్కి-ంచుకొనెడియూ స । ముమ్మరమ్ముగనన్నేచమోడిదగునె । చలముఁజాలించుపరిపూర్ణచం ద్రవదన॥ ... ... ... ... ... *

## * త్రిప్రాసము - అపూర్వప్రయోగము. *

౭౩౭ ॥క॥ వెడవింటిజేనినేనియుఁ । గడకంటనెనేలుకొనఁగఁగలవెల నవలా। పడకింటిలోనవింతగు। కడకంటచరింతెనన్నుఁగాదనియవలన్॥ *

౭౩౮॥సీ॥ మేఁతలూసంగినబూఁతలు బూసినగనుకట్లొనర్చినగాతలిడి న। మందులు బెట్టినసందిటికడసీవికట్లుగట్టారులకుఁగాకయుండఁ।జెరివిన పూవులుచేనంటనిచ్చినవాడెలుగూర్చిన భద్రకాళి। బంపినమోహినినంపిన మంత్రతంత్రములబన్నినగావులమరిచినను । మాయలాడివియొకత్తృణప్రా యముగను । పడకలందులగుట్టికబాళిబెనచి । చెలువునిధనంబుతల్లికిఁజేర్చు నటుల । గావునీనాయెడతలంపులోవెలంది॥ ... ... *

## * వృత్తప్రాససంస్మృతి. *

౭౩౯ ॥సీ॥ ఇదిగదాకొన్నిపన్నిదములనేసీవునెత్తమ్ములాడుపొందికల కూట। మిదిగదానీచేతహృదయంగమంబు గా వీణానినాదంబువిన్నచవిక। యిదిగదాయానాటికొదవినపొలమొల్క-వాదుదీర్చిననెఱవాదిచిలుక।యి దిగదామనము సమ్మదకథాలాపముల్మున్నుబలుక-చునున్నవెన్నెలబయు। లిదిగదా సంభ్రమారబ్ధమదనకదన । సమయసంజాతసమధికశ్రమముదీర। వేడుకల విశ్రమించినబైఁడిమేడ। మఱువనీతోడుదయఁజూడుమందగమన॥

## * కావ్యలింగాలంకారహేత్వలంకారద్వయసాంకర్యము. *

౭౪౦॥సీ॥ కామినీనీనెమ్మొగము పూర్ణచంద్రుండుచెలువనీకనుబొను ల్పైఁఅకువిండ్లు । చివురాకుఁబోడినీచెవులుచక్కి-లములుతొయ్యలినీమోవి దొండపండు । తరుణినీదంతముల్దాడింబవిత్తులుకలకంఠకంఠినీపలుకుతేనె।

యింతినీనునుబుగ్గలిప్పపూమొగ్గలుబోటినీగుబ్బలుతాటిపండ్లు। బాలనీవళు
ల్ సైకపుపాలతెరలు । వనితనీకటిచక్కెరనునుపుదీవి। గనుకమధురాంగి
నీమేనుకమ్మతావి । విటహృదాకర్షణవిధాయివిద్యయయ్యె॥ ❋

{ శ్లేషానుప్రాణితరూపకాలంకార
వ్యక్తోపమాధ్వని. }

౨౪౧॥సీ॥ పల్లవపాణిధమ్మిల్లమభ్రచ్ఛాయమగువసిబ్బెంపుచన్నుఁగవ
సున్న । కంజాతనేత్రివక్త్రముమహాదర్శముమానవతీమణికానుబయలు ।
చిన్నారికన్నియజిగినెన్నొసలుకలచిలుకలకొల్కిపొక్కిలిభ్రమమ్ము । జ
వ్వనిరూపంబుచంచలాప్రియంబువారణయానమూగారుజల్లి । మైననా
కయింతిచూచిసయంతలోన। నెల్లవారలమిగులమోహింపఁజేయు । మహి
మగలనీకునఖిలభూమండలమున । మోహినీనామమన్వర్థమునఁబెలంగె॥ ❋

౨౪౨॥ఉ॥ గ్రక్కునగౌఁగిలించిదెలిగన్నులచల్లనిచూపుజూచినీ । చ
క్కెరమోవితేనియలాసంగిమనోజునికేళిఁదేల్చినా ! యక్కఱబాపుమ
న్నవదనాబ్జమునన్జియునవ్వుఁదెచ్చియా। జక్కవచంటియుట్లనియెజక్కెర
లాలెక్కడుముద్దుబల్కులన్॥ ... ... ❋

౨౪౩॥సీ॥చదువునుగుడికాల్వసాధనయునుకడనోసరించినయట్టియు
నికిఁదలఁచి । వీణాదిసంగీతవిద్యలాజ్ఞకుమళ్లనొప్పగించినయట్టియునికిఁద
లఁచి । దాసదాసీపశుతతిబరామరిసింపకూరకయున్నట్టియునికిఁదలఁచి।
యిల్లాలితోఁబొందునెడజేసియిచటనిన్నొంటియుంచినయట్టియునికిఁదలఁ
చి।యేమిపలుకనీకువెట్లుండునోయనె।దునికిఁదలఁచియగడుమనికిఁదలఁచి।
యున్నదానగానినిన్నెఱుంగకయుండఁ । గలదెచింతకొందుకారణంబు॥

❋ ఇష్టనిషేధాభాసరూపాక్షేపాలంకారము. ❋

౨౪౪॥సీ॥ తలఁపులోఁబాయకనిలుతనపునరుక్తియంతనీసొమ్మననా
ర్యవృత్తి। నినుపిడిమెలఁగలేననసంభావ్యంబు భర్తవీవననభఃప్రసవకాం
తు।తొలుదొల్తనిందురావలెనన్నగర్వోక్తిచనుదెంతునేననచపలగుణము।
మఱుఁడేచుననసాక్షిబరఁగనివచనంబుచలిగాద్పుసెకయనజనవిరుద్ధ। మర

యనీ యధీనమగునన్నలఁచునాక । ళాధరుండనభవదుపాలంబకీలి । గనుక
నేమాటలు నెఱుంగ నెనరునిలుపు । సాగుబడిహత్తగుణవిత్తనాగదత్త ॥
౭౪౫॥ గీ ॥ ఔరయన్నిఁటఁబ్రౌఢవీవాటవింత । గలుఁగయోనాగద
త్తార్య తెలుపుమనిన । నారయన్నిఁటబ్రౌఢవీవాటవింత । గలదు మోహిని
యిడనినన్గాచుటొకటి ॥ ... ... ... ❁

❁ అపూర్వప్రయోగము. ❁

౭౪౬॥ గీ ॥ సమయభేదంబులాత్మరాగంబుగనక । చూచియదుగనిని
నుమెచ్చబూచినానె । దయకురమ్మని చేసాఁచిపయఁటద్రివ్వ । మోహిని
తలంపులోనిను మోహరింప ॥ ... ... ... ❁

❁ వార్త. ❁

౭౪౭॥ గీ ॥ కరముగాజులుఘల్లనకంచెలోరయ । దత్తనిభనాగదత్తనీ
దత్తరంపు । గుత్తగానితనంబెత్తుగుత్తగాను । పంజమాటలఁగూడు నాలం
జరికను॥ ... ... ... ... ❁
౭౪౮॥ మ ॥ అవురాయెంతకుదట్టిగట్టితివి మేలాహాబళామంచివాఁ ।
డవెపోవేతెలుకచోటుఁగానవెకదా, టాటాల్గుణించంగనీ । తవళీవిద్య
లుజూపనోర్చునదివీటన్లేదుమాబోంట్లతో । నవుగాముల్గనట్టిత్రుళ్లకము
కాపోశనపాయమే ॥ ... ... ... ❁
౭౪౯॥ వ ॥ అనిమధ్యధీర పల్కినపల్కులుతనచెవులకుములుకులుగాఁ
గఁబులుకపులుకునఁగనుంగొని యవుడు॥ ... ... ❁

❁ గుణీభూతవ్యంగ్యము. ❁

౭౫౦॥ సీ ॥ గాజుకుప్పెలవంటిగబ్బిసిబ్బెపుటుబ్బుచిన్నిగుబ్బలుగోరఁ
జెనకవెఱచి । చీనిచక్కెరవంటిచెంగావివాతెఱయింతపల్మానసోకనీయ
కళికి । జిగిమల్లెపూవంటిచిన్నారినెమ్మేనుబిగువుగాఁగిఁటనానిపెనఁగఁద
లఁకి। [illegible] సతమ్మనూల్వంటియసదులేఁగౌనుపైనొరగఁగఁబరుండియొర
గఁగొంకి । మనసుదీరఁగనొకనాటియునికిలేక । మోసపోయితిఁగసికాటు
ముచ్చటలనె । నింతలోననేనన్నునీవింతసేయు । తెలుఁగనేరనికతనఁబూ
ర్ణేందువదన ॥ ... ... ... ❁

## ✽ ధ్వని. ✽

౭౫౧॥ సీ ॥ వడగండ్లచేత జేవరగుళ్లునిర్మింపఁబట్టి కన్నుండఁగన్నాపఁ దివియ। నిసుమున్నముసేయనెండమావులనీళ్ళు గావింపనేన్గుఁగన్నానలాఁగ । సీటతాల్ దేవింప నీళ్లుమూటఁగఁగట్టనెడపులిమీసలుయ్యేలలూనర్ప । బొమ్మలపోట్లాట పొనరింపవర్ష ధారలనెక్కి డిగఁబగల్ రాత్రిరాత్రిఁ । బగలూనర్పమాధ్వులశాస్త్రిపటిమదొరల । తలఁపుజంగాలబూటకంబులు గరీబు । కరుణ, కోమటినిజమును, గలికిచెలిమి । నేనుదెలియంగఁగలనె యోసానియవల॥ ... ... ... ✽

౭౫౨ ॥ సీ ॥ పొలఁతిబూరుగమానిపొడవడవికిఁగాయు వెన్నెలచెప్పుడువిద్యబిరుదు । మాష్టీనిబీరంబు, ముష్టిపండండంబు, పలనాటిగొల్లలపాటజాతి । వొమ్మరిపెద్దతనమ్ముతాబొమ్మసింగారమ్ము, బక్కయగారిభలిమి । వెలమతమానమ్ము, వెట్టిజాణతనమ్ము, రాచగబ్బితనమ్ము, నాచురితవు । కోఁతులశివమ్ము, నాలవజాతితపము । శ్రోత్రియుని తెలుఁగుకవిత కింశుకముతావి । జదునిచదువును, బెస్తనేస్తమ్ముపలెను । జేసితీజాడనిఁక నేమిసేయువాఁడ ॥ ౭౫౩. గీ ॥ రావిపువ్వును, బెండులోఁజేవ, పిచ్చుగుంటుపర్వును, గుజ్జుపుకొమ్ము, కాకి । తెలుపు, రాయంచనలుపు, మించులనిలకడ । గలుఁగ, వెలయాలివలపిలగలదెయనుచు ॥ ౭౫౪. గీ ॥ ఇవ్వగౌరగాకయుకొక్కమ్మబాయలేక । పణ్యవృద్ధాంగనామనోబాపద్రవమున । నారివేరంబురీతినిందదుఁదిరిగి । గోఁచికాఁడవ్యేబాపనకోఁడెకాఁడు ॥ ౭౫౫ ।సీ ॥ తలమాసిపువ్వుటెత్తులకుజిల్గురుమాలుబట్టగట్టినతలబట్టగట్టెఁ । బడవవాటునవాటుబడ్డచన్గజనిమ్మకాయగాచినచెయికాయగాచె । నాఁకటిపెక్కువనతివకౌఁగిఁటిసందిచిక్కబారిన మేనుచిక్కబారె । వెకలిమైతిరుగనేవేళసురతికేళికళలుజేరెడుమోముకళలుదేరె । నిన్నియునుగాకయూరకేమేలమాను । వారకాంతలచెంతలఁజేరెనేని। యేకులమేమివర్తనమెట్టిదనక । యేటిగౌరవమేమనిమెన్నగలదు ॥౭౫౬॥ గీ॥ తల్లిదండ్రులువానివర్తనమురోసి । ప్రాణములుదాఁచుకొనెదులాభం

బుగనిరి । వారిశుశ్రూషయందుఁ దధ్వనితయుండె । వాఁడు రెంటికిని జెడి
న రేవణునిబోలి॥ ౭౫౭ ॥ క ॥విచ్చలవిడిలంజలదిన । వెచ్చములకుఁ జూదగా
ని వెచ్చములకుని । పచ్చరమైతనలాహిరి। వెచ్చములకు లేక ముచ్చువిద్యకుఁ
జొచ్చెన్॥ ౭౫౮ ॥ వ॥ ఇత్తెఱంగున కన్యాగదత్తనిభుండగు నాగదత్తుండు ధీ
రశాంతనాయకత్వంబు ద్యాసనంబుఁ జేసి, గానంబు, కవితయు, కొక్కో
కంబు, జూదంబు, దేశభాష, లిపిజ్ఞానంబు, లిపిలేఖనంబు, చరాచరా
న్యధాకరణంబు, విలువిద్యయు, స్వరశాస్త్రపరిజ్ఞానంబు, శాకునంబు,
సాముద్రికంబు, రత్నపరీక్ష, అరదంబుఁ బఱపుటయు, తురగారోహ
ణంబు, మల్లశాస్త్రంబు, పాకచమత్కారంబు, దోహదప్రకారంబు,
ధాతుగంధరసవాదంబులు, కుట్టుపనులవినోదంబు, మహేంద్రజాలంబు
జలాగ్నిస్తంభనంబులు, మొనకట్టు, వాకట్టుజయస్తంభనంబు, వశ్యాక
ర్షణమోహనంబులు, విద్వేషణోచ్చాటన సంహరణకాలవచనంబులు,
పక్షిగతిభేదంబులు, యోగరాగంబు, వచనసిద్ధి, ఘుటికాసిద్ధి, యింద్రజా
లంబు, అంజనంబు, ధ్వనివిశేషజ్ఞానంబు- వంచనంబు, స్వరవంచనంబు,
మణిమంత్రౌషధక్రియలు, చోరత్వంబు, చిత్తరువువ్రాయుటయు, లోహ
కారకత్వంబు, కాసెపనియు, కులాలకర్మంబు, వడ్లంగిపనియు, మేదరప
నియు, జోళ్లునిర్మించుటయు, సాలెపనియు నదృశ్యకరణి, దూత్యకరణి,
వేటసన్నాహంబు, చేరంబు, పాశుపాల్యంబు, కృషియు, మైరేయంబు
లుగూర్పువగలు, లావుకకుక్కుటమేషాదులఁ బోరుహత్తించుటయు, న నె
డు చౌషష్టివిద్యల నెఱింగి, దత్తరమ్మలకొంచలేక యదరుబెదరు సోకనీక మ
దముమీఱ ముదముచేర నొంటికినొంటి దప్పికిదప్పి నిదుర కానిదుర చేసి తన
తో వాసికిను ర్వర నెవ్వరైనా నానబూనుదురా నుదురకన్నుగలదొరవాడు
రు కాకనిఁకనీదైవానుగ్రహంబున నిజదురాగ్రహంబుననుగ్రాదివిగ్రహం
బులు విగ్రహంబుననిగ్రంబు సేయు జాగ్రతనుండేవి, కాదంబరీపానవాదం
బున మోడంబుమీఱిజూదంబున చౌర్యవినోదంబున సంసారఖేదంబు విడి
చి, లజ్జగడచి, మట్టువీడి గుట్టుఁబోనాడి రట్టునకులోఁగ పెట్టునకునాగి,

పెక్కుమాటలొక్కచోటపిక్కటిల్ల తక్కులెల్లబూటు వగలుమాటతెగ లు చాలదెలిసిలీలమలసి వడిసుళ్ళనుబడిగుళ్ళనుజరియింపుచు సిరిపెంపుచు నిజజంఘన్యమాన కైశవగాత్రుండునుతంతన్యమానదురితచరిత్రుండునుపా షత్యమానాంబుస్వీకృత కలితముఖుండును రారజ్యమానదుష్టసఖుండును నగుచునగుచు నందునందునందుఁజెన్నొందువాసరమ్ములు మీసరమ్ములు గాఁజాలకడపటగడపంజాలక॥ ౭౫౯ ॥ గీ ॥ కావుములుబంతిసికముళ్ళగ ద్దగోరు । నల్లదట్టిసబిల్లకన్నంపుకత్తి । బూదిదివ్వార్పుపురువిసుమూదు గోవి । తోలునిచ్చెనమొదలుముందుగధరించి॥ ... ❋

## ❋ అశుభశకునములు. ❋

౭౬౦॥ సీ ॥ ఎచటకేగెదవనియెవ్వగునడుగకతంబళివాపఁదు తారసి లక । తుమ్మెదుపులినక్కతోషువచ్చెదననుపలుకులువీనులవినకపిల్లి । యు ద్దంబుగాకనుగొడ్డురాలెదుటనునిలువక జాగిలంబలుకుడిడక । పాలవె నక్కకుబోకపక్కపైరొప్పకపొనుకుబడినయగ్గిబొగ్గులుదిస । మొలనరుప రపుమైలచీరలునుదూచి । కసవుతొండయుగుడ్డిమూగకటిచిలువ । విధవ కుండేలుపొగవాంటిపిచ్చుగుంటు । నూనెతలవానియెదురుగాఁగానబడక॥

## ❋ శుభశకునములు. ❋

౭౬౧ ॥ సీ ॥ మునుక్షేమకారియాడినపాలకుడినుండియెడమకేతెంచి నఁగుడిభుజమద । రినవాయసంబుదీర్చినపైడికంటెవేక్షలయబలికినబంగా రుకలశ । మెదురైనగుడిపల్కులెనసినగాడిదలెలుగిడవేశ్యలనెలమిగన్న । కలకలదక్షిణగాళిపల్కినమేనజల్లనిగాడ్పువిసరినఁగవగ । బ్రాహ్మణులె దిర్చిననుఘంటరవళివినిన । నైదువలుపాటఁబాడిననశ్వహేష । వినబడినఁ బంధ్లుగానవచ్చినవిమొదలు । మేలుశకునంబులెటిఁగి యవ్వేళలందు ॥

౭౬౨॥ క ॥ ఆయనసేయనిపాతక । మేయనువునలేకఁబురికినెడమైజ నిచా । బోయలఁగూడుకదెలువుల । నాయకులేతేరతానునడుమునడఁ చుచుఁ ॥ ... ... ... ... ❋

౭౬౩॥ గీ ॥ ఎన్నిగోహింసలెన్నిస్త్రీహింసలెన్ని । విప్రహింసలుగు

రువాలపింఛ । లెన్నిగావించెనేమనియెన్నుకొనునొ । పోయెనీతంబు దాపనబోయమదిని ॥ ... ... ... *

౨౬౪ ॥ క ॥ ఆజాడలమెలఁగుచునే । యేజాడలఁగట్టికొట్టియెదలఁగిరాతుల్ । జేజేయనిదనుఁగొలువఁగ । రాజులనగరములుజొచ్చి రాయిడిఁజేయున్ ॥ ... ... ... ... *

## * చప్పన్నదేశనామధేయసీసము. *

౨౬౫॥ మాళవమళయాళమత్స్యచోళవిదేహకురు విదర్భపుళిందకొంకణాంగ । కర్ణాటచేదికొంకణవత్సనింహళమద్రభోటసుదేష్ణమగధయవన । కాశవరాటకేకయకుంతలావంతిసౌరాష్ట్రశబరాంధ్రచేరపాండ్య । ఘూర్జరసాళ్వకుకురుహూణనేపాళబాహ్లీకశకవంగపౌండ్రలాటకోసల కరూశపాంచాలకుత్సనిషధ । సింధుగాంధారకేరళసింగళాట్ట । శూరసేనోత్కళమరుకాశ్మీరబర్బ । రకరహాటాఖ్యదేశముల్ప్రబలితిరిగి ॥ *

౨౬౬॥ ఉ ॥ కామగమైనరూపములుగాంచుకకాంచిగయాప్రయాగమా । యామధురాకవేతనయాయమునాసరయూమలాపహా । హైమవసుంధరాచలహిమాచలరాజితశైలతామ్రప । ర్ణీముఖవాహినీపురవనీనగముల్చరియించియావలన్ ॥ ౨౬౭ క ॥ లోవాడియువావాడియు । చేవాడియుఁగలిగిమిగులసీమారామా । గ్రామాగ్రహారజనపద । దేవస్థానాటవులనుద్రిమ్మరుకతనన్ ॥ ౨౬౮॥సీ ॥ వలుదగుబ్బలమీఁదిచలువముత్తెపుపేరులిరుకునిల్వులదట్టిపొరలఁజొనిపి । సాగిమిక్కుటుజూపిసోగవ్రేళ్లనుమట్టియలుజిమ్మియంకులనఁచితిగచి । యవలివానికిసున్నమందిచ్చిచేదీయుననువునకమ్మలల్లంతమీటి । సందడినలజడినందజేయిమ్మనియుంగరంబులులాగిచెంగవిడిచి । గత్తెరలనొడ్డియాణముల్గత్తిరించి । కుంపటిసుములసవరంపుకుప్పలూచ్చి । కౌసలయువిజూపిమెడనూలికీలువాపి । వరుసవారలవెతలఁబాల్పరచిరందు ॥ ౨౬౯ ॥ క ॥ ఇరువురుముప్వురునలువురు । తెరువులఁదెరువరులఁదామదెరువరులగుచున్ । చూరవగసినొంటిపాటున । మొఱపెట్టఁగఁగొనిరిచేఁ ముదుపులుకడిమిన్ ॥౨౭౦॥ సీ॥నిచు

రించువారిలోనిమురించినటులుండిదొరికినవెత్తుకజరుగువారు। మీవారువీరె రమ్మా వెంటనపిల్చి పడుచులనెగమీటిపరుచువారు । సున్నంబులోపలసా క్కుముందులుబెట్టికలిగినవంకించితలఁగువారు । వెలయాంద్రదప్పుచెవులు దార్చిబంతులునోటిలోనిడిదోచిదాటువారు। కొంగురాలనుపెఁశతలఁగొ ట్టికెడపి । సొమ్ములాగించిసందడిజూణుఁగువారు। తారుదొంగలిదొంగలఁ దామెలతిమి । పట్టుపట్టంచునూడనిబాడువారు ।౭౭౧॥ వ ॥ ఇట్లుదిరిగి తిరిగి యున్నత్తుఁడైననాగదత్తుండు, తత్తడికిత్తుమొత్తంబు మిణుగుర్లఁబో లి, యంబరంబులడంబరంబులు, బంగారు సొమ్ములసింగారంబులు, చూ పులమేపులు, పిలుపుమెలపులు నయమ్ముల భయమ్ములు, కొర్వులనవ్వ లు, యిక్కవలమక్కవలు, గచ్చులమెచ్చులు, గలిఁగి తద్భటులంతనంత గ్గతంబున ॥ ౭౭౨. క॥అందులనుదనివిచాలక । యందటునొకచోటఁగూ డి యదిరామనకీ । సందడిజూణుగులఁదీరునె । తుందుదుకులసామిసొమ్ము దోఁచకయున్నన్॥౭౭౩.చ॥ అనిరథమార్గమందరిగియావలమావులతోటఁ బట్టిమాం । బుధినినినుందుగ్రింకకయమున్నగడగ్గరఁజేరియందటున్।గను కనివెన్నుబొక్కసముగ్రక్కనసడ్డముమూరిజూచివొ। చినటులరత్నకాం చనవిశేషసువస్తులుగొంచువ్రేల్మిడిన్॥ ... ... ❀

❀ అపూర్వప్రయోగము. ❀

౭౭౪. క॥ వెడలహరిభటులుపైకొని । కమవడియాసొమ్ములమవికా స్కలిడుగతిన్ । బడవైచిపోవఁగనివెం । బడియార్పులఁబొడు పొమువే నివదనడరుటయున్॥ ... ... ... ... ❀

❀ అపూర్వప్రయోగము. ❀

౭౭౫. క ॥ నడచినఁబాటుండప్పుడు । కడిశలయరిగె యుధరించికతి వేలుపుబ । ల్దపములుదనునతికినఁగని । కుడిమొదములఁదగ్గియొడ్డుకొనుచు న్నెలువన్॥ ... ... ❀

❀ వీరరసము. ❀

౭౭౬. ఉ॥ గొంతులునొవ్వఁగాఁబరవఁగూతలుగూసినబంటులైతిరో।

పంతములేలనాయెదుట బాలులుదీరుఁడుమైలసంతలో । గంతులుసాగ వంతయునుగానఁగనయ్యెదులెస్సఁగోసెఁగా । మంతరసానిబొడ్డుతృణ మాత్రములో మిముగెల్వకుండినన్॥ ... ... ✻

✻ అపూర్వప్రయోగము. ✻

౭౭౭॥క॥ ఏవాఁడుగలాఁడింపుల । నావడిజగడమునకెదురనగరిపుసుతుఁడైన । నావెఱవకనిలఁగలఁడే। కావుననేనిపుడగెల్వఁగైకొనువరయన్॥

✻ ప్రాసభేదము. ✻

౭౭౮॥ క ॥ నేతునుమంత్రములందఱ । నేతునుదప్రిపులప్రేవులీరణము నకున్ । నేతుబ్రియంపదుపాలువుగ । నేత్రివిధమ్ములనుమీర లెనయేత నకున్॥ ... ... ... ... ✻

✻ రౌద్రరసము. ✻

౭౭౯॥ క ॥ చెఱకులఁబన్నిదమాడిన । తెఱఁగునమీరూపులొక్కతేప నెనసిచే । నఱకుచుబేతాళునకే । డ్తెఱనెత్తురుసాకసాకతీరునసేతున్॥✻

✻ భయానకము. ప్రాసభేదము. ✻

౭౮౦॥ క ॥ నాక్కత్తగాంచుఁడంచును । చీకాకుఁగరెండిమేలచెల్లాచె దరై । మూకబరతెరవిస్తరుక । ఢాకన్ఝూటుధడయుద్భటదుముకుమొనలన్॥ ... ... ... ... ✻

✻ అపూర్వప్రయోగము. ✻

౭౮౧ ॥ క ॥ మిడుగురులురాలఁబొడిచిన । కదువడిదప్పించిలేదుగా యనితారా । బడుగుంబాపనిబాపని । యెడతెగనియ్యకనుజుట్టిమేసల వానిన్॥ ... ... ... ... ✻

౭౮౨॥ క ॥ కేడెముకత్తితుపాకీ । కొడియువిండ్లమ్ములీటెలంగొనితొలుతన్। జోడుబుదాలిచిమేనులు । జోడులుతమకన్నలేదుసూసవికినుకన్॥

✻అపూర్వప్రయోగము. ✻

౭౮౩॥క॥ తనువులనుచెక్కుచెమరక । యనిచేసిననాగదత్తుఁడాసేన నలఁజేర్కొనితూఁచుమార్కొనిధో। రనగరిడిన్పాముచేయురహినెఱ వేస్కన్॥ ... ... ... ... ✻

## అద్భుతరసము.

౭౮౪॥ క ॥ మొనచేసినచోటనధుము । కనుధుముకను సేయుతఱిని కొంచెపుమొనయుఁ । మొనధుముకుధుమముకు మొనయును । గనుపించక జేసియంత కాంతాళమునన్॥ ... ... ... *

౭౮౫ ॥ క ॥ పద్దుగవెన్నునిబలముల । కుద్దుల పేర్పడిదిటమ్ములొద్దిక యగుటన్।గద్దింపుల చేఁజప్పుడు । విద్దెలువినుపించురీతివితతము మెఱయన్॥

## అపూర్వప్రయోగము.

౭౮౬ ॥క॥ ఇది మొనయిదినరుకిదిపో । టిదిమీటిది చూటిదిధుముకిదెంబ డెయనితా । రుదిరిపడిబండ్లుగీటుచు । సదమదముగఁగాలుఁ గేలుజంటఁబ నంగన్॥ ... ... ... ... *

౭౮౭॥ క ॥ హరులున్హరులునుగిరులున్ । గిరులునుగరులున్గరులునుగిరులున్గిరులున్ । మఱియుమఱిసుర మొనర్చిన । కరణిన్సరిఁబోరిపోరిగరుసుదురుసునన్॥ ... ... ... *

## నవరసోపమానయుద్ధవచనము.

౭౮౮॥ఆ యెడ నా యెడవయసుబాయబోయులు దండితనంబునఁజండింపుచు, భ్రాంతంబుఁద్భ్రాంతం బాప్లుతంబావిష్కృతం బాహీకంబవిధంబకరంబవికరంబు, విశ్రుతంబు, మానుషంబు, నిర్మర్యాదంబు, చిత్రంబు, భిన్నంబు, సవ్యజానువు, జానువు, క్షిప్తంబు, ధృతంబు, గుడంబంబు, అంబనంబు, సవ్యబాహువు, వినిబాహువు, త్రిబాహువు, సవ్యోత్తరంబుత్తరంబు, సవ్యకరంబు, తుంగబాహువు, ప్రదికంబు, యోధికంబాపృష్ఠప్రహారంబు, వల్గితంబు, కుంచితంబు, స్వస్తికంబునను ద్వాత్రింశత్ప్రచారణవ్యాపారంబులబదారించి, పరిభ్రమించి, కొలిచినబంటులవలె చారవగల్పించుకొని బిరుదుమాష్టీలయునికిదండయేమరక, చోరులగతి హెచ్చరికదప్పక, లోభులకరణిఁగేలుసడలక, వసంతములాడెదు పెండ్లికొమరుల మాడ్కి నాసనెదు రెక్కి మైనజిమ్మి, కోమట్లవహాని లెక్కపెట్టక, బచ్చలసరవిసరకుఁగొనక, నిస్పృహులవిధంబునఁదృణీకరించి, మాంత్రికులపగ

దిహుంకృతులునిగుడించి, విటుల మీరభయంబులువిడిచి, వీరావేశంబుల నట్టహాసంబులు సేసి, రోసంబులఁ గోరమీసంబులఁ దీఁటుచుఁగలంగక, తొలంగక - తిరుగుడుఁబడక, నైదుఁబడి సేయక - ధీరంబులు చెడక లీలువోక యొడక యొద్దిగిలక వేసరక వెక్కసంబు వేడుక గదుర ససమ సమరంబున సవ్యమండలముగానుండినం బుండరీకాక్షునిగింకరులుసాహం కారులై శంకింపక కడివంక పక్కళంబు గాని మొక్కలంబునడాసి కరా చూరులనరఘూటులు వ్రేసిన భిల్లవల్లభుల త్తెఱంగునకుఁజి త్తంబులుహత్తనీక వడిదరగక, పాటింపక, కూలంబుచూపక,నోసరిలక, సడలక, సందీక, వేగిరపడక, జిరచిరటర లెంచక, చలింపక,చాయదరుగనీక, గడిదలలూని ఝుళిపించియునుతాలించియు, వంచియుఁ గమ్మియుఁ జేకువయుఁ దెలివి యుమదంబును మచ్చరంబును వేరంబునువెరవును తెంపును సొంపును నిం పుమీఱఁబిడుగులు బిడుగులు గదిసినచందంబున ముఖచాళిఖానివారలపై ధాటుధారలుంజూపనప్పట్టునజుట్టుపిట్టలావునై ట్టెంపుఁదాలుపుబలగంబు స్వస్తికంబుననొడ్డుకొని తమకంబులఁగమకింపుచు హుంకుమత్తునతూరి యం పరల పరంపరల మెపరలాడిన హుసియనిదొందడినిపుళిందులు కలకుమీ తి చుఱుకుచూపులుచూచి యెందుఁబోయెదరు నిలునిలుమనిహూఁతలుసేసి గడుసుగొన్నగడిదలలు విఱిచికిఁజొనిపి మేనులుబలులు గాఁజూచి గోవిం దునిసేవకులుచారఁగూడక పేరములుబాఱి లారితుపాకులుసంధించినమేను లువంచిబొంకించినాగదత్తుందు తసబలంబులనెచ్చరించి పరుజులో నెడగం డ్రపిడిపట్టుగట్టిగాహత్తించి పరుఁజుంచుపూనికకై పరుజించి తగ్గితగ్గిడగ్గరి డిగ్గనసంభ్రటితనాట్యములు సేయుజగ్గునకుఁదమ్మికంటిబలంబంటువీడకగం టిమిగంటిబుమేలుమేలని పొగడిగదలని గుడియెడ తెగకంబొడిచివెంబడి మొ లపిడెమ్ములు ఝురీనదిగిచి యత్తఱిమిముకదఱిమి కుప్పిన్నచెమ్మట జెందకతే దబడకబుడిబుడినడలనొ ళ్లొసొకనీకుండ చూచినిలుచుక కఫాలు కఫాలున మారణిబడిబడిబెడాలునజొచ్చిబిడాబిడిసరిబిత్తరులమిడుకదఱిమి హత్తినక డాకడికరంబులయడిదంబులు బెడిదంబులుగావొకటొకటొరసి ఝల్లుఝ

ల్లునమిడుగురులరాలుచు వింజామరల కోవ్రులతేవఁగోలమెఱుంగుల తెఱం గునఁగోలాటమ్ములాడుబొమ్మలకైవడి, మురహరునకుఁబురవిజయేందిరర తనంపుటారతులెత్తిన జోతులరీతిఁగన్పట్టియుండఁగండుమీఱి రెండువెగల నంబులఁజలంబులద్వంద్వయుద్ధంబునకుసన్నద్ధులై, యంతటంతటనందంద నక్కడక్కడ నాడాడ జోడులుగూడి, పాచికలచొప్పున, జంట కరుల్లపోలిక, పాములదారి, తాళపుఁజిప్పలభంగి,శస్త్రాశస్త్రి,కుంతాకుం తి,దండాదండి, ఖడ్గాఖడ్గి,గదాగది, బాహాబాహి,ముష్టాముష్టి,కచాకచి, రోహారి సాహరింబెనంగుచు, మేనులువంచుచుఁదటాలున నేదుఁబందుల చాద్పున నెఱకలునిట్రబొమవనొగ్గళ్లు ఘూడించుచుమసరుచు కొసరుచుఁ దిట్టుచుఁగొట్టుచుఁ బాయుచు డాయుచు జడియుచు నొడియుచుఁగదలు చుఁబొదలుచు మిడుకుచు మెడుకుచు వ్రేయుచు రోయుచు విసరుచుఁ గ సరుచుఁ జిమ్ముచు రెమ్ముచుఁ బొమచుచు విడుచుచు నఱకుచు బెరుకుచు నాఁబోతుల కుమ్ములాటమర్యాదను, బెబ్బులులుతారసించినవరుసను,లు లాయంబులు తలపడిలవడువునను, తగరులు సన్నలదారొక్కన్నవీఁక, తు లువలపోట్లాటమాడ్కి, రక్కాము పుంజులుకఱచి కాట్లజట్టులు గఱచుక నారెలుదుస్సిపాఱువరుస వ్రేటులువ్రేసినమెరవడిని, చలముఁగలిగినపికిలి పిట్టల కిరకిరపెక్కులొక్కని మలపములిడుచుఁగిలకొట్టుచుతెక్కలార్పు చులవెటిలఁద్రిప్పుచుఁబింబములుసేయుచుఁ దలలాడి పుచుఁ గటుకుకట్టుక్కు నఁబల్లుపోఁకబిరబిరఁజట్టుకొని వెలిమైనతావులుముడిగిసరసుకకఱచినకా టులువిడకకాళ్లుపట్టుకపడిమెగరోజుసవతునసు,పిచ్చుకలుకాట్లాడిపట్లుప ట్టెడిజోడున నొండొరువులతనువులుజర్ఝరితంబులై చిరిగితరుణమునసరు ణమునజొత్తిల్లిజొత్తుపాపలవగనుపూఁచిన మోదుగులలాగున రౌద్రరస ము వెల్లిబర్వినయందంబునమించుచుమఱియుఁబెక్కువిన్నాణంబులుసేయుచుఁ బక్కటెమ్ములువమ్ముగా మోకాళ్లనూఁకుచు తలతలందాకుచు కేలుకే లునుజట్టియందుకొనుచు రొమ్మురొమ్మునఁగదియించుచుభుజమును భుజమున నొత్తుచు నడుగడుగునఁదాటింపుచు పీటజోదులనుబడాయింపుచు మదుల

సెదుగరోసమ్ములఁ బెంపుచు వెదరి బెదరి కాంచుచు నలసి సొలసి యలంత జెం
దిచింత జెంది బడలికనొంది వడమించి సేదగాంచి దిటముడిఁగి రుటమడఁగి
లావులు సడలుచుఁ గొంతకొంతయడలుచు మిడిగ్రుడ్లు బిరబిర ద్రిప్పుచు చక్ర
మ్ములనీటునజిరజిరఁ దిరిగి దగల నెగరొప్పుచుఁ జమురుసడలిన దీపంబులకర
ణి తాల్చిన ప్రత్తివత్తుల రూపున నలచిన నిశ్శ్వాసంబ్లసూటిమధించిన రసముని
ధాన దారుచుదూరుచు మెడలు నలసియు, తొడలు బడసియు, మూపులుబ
గిలియు, పీఁపులునాగిలియు, ముక్కులుచదిసియు, చెక్కులుగదిసియు,
ప్రక్కలువీలియు, డొక్కలుచీలియు, బీభత్సాద్భుతరసంబులు బెనంగొ
నఁ బరస్పర విజయేచ్ఛలఁ జిక్కుదీసినటుల, దాయాదుల పాళ్ళుబంచినయు
పమను, రాలుద్రీలిన హావణిక, సంజవేళ జక్కవలుకవ లెడబాసిన చందం
బున, తెరప్రతిమల తులను, కాంతలు సొలయల్కల మాలు మొగంబులు బె
ట్టిన సొగసున నిరువాగిరువాగ్రై జోదుపట్లు పీడిన జాడతోడ నెనిజబలంబులఁ బ
ద్మాత్ముండు జిఉనగవు మొగమునఁ జెంగలింప శాంతస్వాంతంబుతోదయాద్రై
వాఁడగనుంగొని కాయంబుల గాయంబులు మాయంజేసి వొమ్మికయ్యము
నకు సెలవిచ్చిన మోహరమ్ముగునని మొనలో నా వేళ దన సేగుఁ జెంల్లి శృం
గారరసంబు సంబరాలదినుసున దిక్కులు బిక్కటిల్లను ల్లరవు బిరుదధ్వజప
టపటల పటపటాత్కారంబులు, స్యందనఘటిత ఘంటికాఘణఘణాత్కా
రంబులు, మావంతుల హుంకారంబులు, రథికుల సింహనాదసారంబులు,
మదావళుల ఘీంకారంబులు, వాజిహేషాచమత్కారంబులు, రాహుత్తు
లఝూత్కారంబులు, వీరభట హుంపూర్వక కహకహారభటివారంబులు,
దండిదారుల కలకలారవంబులు, క్రేక్కుల కైవారంబులు, సింజినుల టంకా
రంబులు, నిస్సాణంబుల ధణంధణలు, ధమామీల దిందిమ్ములు, విజయశం
ఖంబుల ఘుమంఘుమలు, ఫిరంగుల ధిం ధిమ్ములు, జబరుజంగుల ఖంగురింగు
లు, గుంటిక్రోవుల డబ్బుడబ్బులు, తుపాకీల ఢెళఢెళలు, బాణముల చరచర
లు, లకోరీల రింగురింగులు, పెట్లగ్రోవుల వరుసల ఖంగు పెఠీల్ ఢిమిరింగుక
ఢీల్ ధమీల్ ధాంగుఖణీల్ గభుల్ చబాల్ ధాంధంకరణశబ్దంబుల బ్దంబుల గర్జ

లఁదర్శించి, యొక్కమొగిభూనభోంతరంబు భోరుకలంగనకోలాహలం బువిని మునుపనిచేసినవీరులవీరరసంబుఁగని యిఁకనిల్వరాదని యందునాగ దత్తుండుముందుగాఁగొందఱుపుళిందులుదక్కఁదక్కినబోయలు, మందిభ యమునందిభయానకకరుణారసంబులు కళవళమందనదరి బెదరికన్నెదరి, యళికి, బిట్టుళికి, తలఁకి, దెసచెడి, కలగుండుబడి, హల్లకల్లోలమై, అతల కుతలమై, యట్టిట్టై, యుఱ్ఱూఁతలూఁగి, హఠాత్పలాయనంబుగానెక్కడ నున్నవారక్కడనుంచి కలవస్తువులుడించి, లక్షోపక్షలు, కోటానకోట్లు, తండోపతండములు, పుంఖానుపుంఖంబులు, శాఖోపశాఖలు, నేలయీనిన టుల, మున్నీరువెల్లివిరిసినవైఖరి, పుట్టుయిసుళ్ళకరణి, కాకులజోక, కొం డమ్రుచ్చులబాగున, గాడ్పుచేఁబోవుచాక్కాకులరేక, బుట్టివాయివెడ లుపులుగులమట్టున, చట్టంబులనెగయు నాకాశబాణంబులదుఱుసున, నిచ్చలిచ్చల విచ్చుమొగ్గ విరాలిమొగ్గగాకంచుమించై, చిందరవందరై, చీ కాకై, తారుమారై, పంచబంగాళమై, చెల్లాచెదరై, గజిబిజియై, బెం డాబెడస్సై, కకావికలై, పటాపంచలై, యథాయథలై, జలకెట్టెలతండం బులై, గొఱ్ఱెదాటులై, చెఱుకుబండమీది పోకలై, జల్లించి యొకఁడుపో యినత్రోవనొకఁడుబోక, నొకనివెంటనొకఁడంటక, నొకనిపల్కునొకఁడు వినక, నొకనిమొగంబొకఁడుసూడక, గొందఱుపిలపిలంబాఱి యీఁబారిద ప్పినబలుసాకుఁదిని బ్రతుకవచ్చుననుచుఁదిరిగిచూడక కాలికొద్దివడిఁబాఱు వారును, గొందఱుబిరబిరబోలేక పొట్టిపొట్టలబరువున బుసకొట్టుచునడు గులుదడబడబొరగిలఁబడియతనిభక్తులసూటి పొర్లుదండంబుల వగలఁబొర్లి పొర్లిపోవువారును, కొందఱుదులదులబఱతెంచి దడదడగుండెలు డల్లడము లందగన్నులఁజీకట్లుగ్రమ్మఁదెరవులుగానకనిండు చెఱువులుజొచ్చియఱ్ఱుల బంటినీళ్లలోనిలచి తెలివిదప్పి డప్పి డప్పియనువారును, కొందఱుదుడి దుడి బోయిపదము పదమునదాఁకి మ్రొగ్గిదిగ్గునలేచి కాట్రేడాయీతూఁకుదరిఁ జేర్చి తేనెనీపాలముచుట్లు క్రొవ్వినమెకంబులకకుట్లుతోరణంబులు గట్టించి జాతరలుసేయించెదమని వేడుకొనువారును, కొందఱుబుడిబుడి జనిదూప

ను జాలిబట్టి తెప్పిరిలి తమయాకిరాండ్రసూడఁగలిగినఁ జాలుకంబమురా
యానీకుగలపణ్యారములు సాగింతుమనుచు జగ్గుజగ్గునపరువులెత్తితొడలు
వడంకతొట్రిలిమొగ్గితగ్గుచుదగ్గుచు గేకరించినాలు కలఁ దడిలేకనుమియుకు
లోఁజిక్కిగుబ్బుగుబ్బునమూల్గుచు నీల్గుచుఁబోవువారును, కొందఱుగునగున
నేగిచేరువఁబుట్టలఁజేరువారును, కొందఱు నోటిచీగముల దాసళ్ళుపెల్లున
నోరులఁబూరులుగఱచువారును, కొందఱుతిరుణాళ్ళప్రజనిజముననోవేంక
టేశాశరణుశరణు కావుకావుమని గోవిందలిడువారును, కొందఱు బిరబి
రగట్టు లెక్కువారును, కొందఱు దొందుమేనులనిటు నటుకదలలేక జీని
పందులపొందికను రక్తార్ద్ర వస్త్రంబులతో బ్రాణాచారంబుల మెళకువ
నొదిగి తలక్రిందఁజేతులిడికొని యోవడ్డికాసులస్వామీ యీమాఱు గాచిన
బిడ్డలంగని మీపేరుఁ బెట్టెదమని మ్రొక్కుచుఁగన్నులు మోద్చుకొని యుం
డువారును, కొందఱు దొమ్మరులగుఱుతున నమాసాయనిబడిలీఁగెలవెంబడి
నెగఁబ్రాకువారును, కొందఱుబెరుకు బాపనపిసాసిబోయల నమ్మించి
తొడుకవచ్చిలచ్చిమగనితోఁబోరువెట్టుకొని యండఱుఁజంపనెసురుఁబెట్టె
ననిమోమోటములేక చుల్లరపువాకువాకులదెప్పిచెప్పి శరబడులంజేరువా
రును, కొందఱాసాగదత్తునింగనుంగొని యోరిపాటుబోయీ నీగొనంబో
రబోమె, బెండుమునుఁగుట, గుండుదేలుట, కప్పకాటు, బాపనపోటు, గ
లదానీవుచింబోతు గంబీరంబున గూబజంకెనలుసేయుచు నిన్నాళ్ళవలెని
న్నాళ్ళలో తెరవాటుగొట్టి పొట్టసాకుచు కక్కువమేరనీవలె దిరుగకప
రుసుబుద్ధిపొడమికొఱవిఁదలరాచుకొనువైపునగ్గితోమిడుత యొరసినబ
ద్ధతి, గారుతో దోమఢీకొనుత్రోవ సింగంబుతో జాగిలంబుగవయుజాడ,
బెబ్బులితోసిఁగపులియెదిరించినపొలుపునఁ, దమ్మికంటిఱలంబుతోఁగంటుబ
లాదూరనియెంచక బలాదూరనిన నీనఘుమంత్రపు దొరతనము నీబంటునె
ఱతనముహాస్యరసంబునకాస్పదంబయ్యె, నీవేగెలును, పెగ్గెలుమునుపుగ
వదలుము, యింకనినుగొల్చిన వడిగలతనంబుదక్కదని, మిడిసిపడుమీనుక
రణి, నీటముంచివిడిచిన సొరకాయ యొగసిననిక్కున, బిగిసిమిట్టిపడికేర

ఢంబులుబల్లుగారుడంబులుసాలించి, మెల్లమెల్లనేయవ్వలికివచ్చి, యడిదం
బులువిడిచి గరుడగంబంబులడంబున, గండారంబులబొమ్మలరహిని, మా
నులతీవను, చక్కఁగామేనులునిసుమంతగదలనీకనిలుచువారును, కొందఱు
వంకసిగలూడ మొలఁజుట్టినదట్టులువీడబిళ్ళ మెట్లవాళ్లుతునకలైచీరాడ సొ
క్కవీడెంపుచొంగలు సెలవులపైఁజిందులాడమిడిగవలికనుకన్నెలేళ్లవలెఁ
జెంగుచెంగునదాటి తమపరువులంటువారిలఁగలరేయని కిలార్చి కొలిచిన
కొలువులువీటఁబోనిమ్ము పాటిగీములంజేరిన మేరలుదక్కనని గ్రక్కనసూ
డనిబాడువారునునై, తనబలంబుచదరంగబలమువంటి హరిచతురంగబ
లంబున కూరకయెడారునంబెగ్గడిలనెగ్గి వేటకాండ్రుచొప్పుడువెట్టఁబొద
లువెల్వడిపిట్టలెగిరిపోవుచాడ్పున గట్టులగుట్టల చెఱువులకురువుల డొంక
లవంకల నీరంబులఁదీరంబులఁ గోనలఁగానలఁగలసిన యందుకావంతవం
తఁజెందక బలవంతుండైన నాగదత్తుండు దనపొత్తునహత్తిసావాసంబుచే
సి సాహసంబుగఁగొలుచుబోయజాతంపు పెద్దవాండ్రతో మీరుకంటిరో
కానలేవో పెక్కండ్రు జాతిబోయలీయెడనీలాగాయెనైన నేమాయెనా
మాయలింకసూడుండీసూడుమీకుదిరుగమీకొప్పని వారికొఱ్ఱివ్వనినణఁగింతు
మీకున్నఁజాలుననిననామేటితో వారలోరప్పరవ్వనీయుప్పుదిన్నవారముగా
వునతారునీతోటివారము యెందుకాకరుమవుసాకిరిలేకున్ననినువంటిజన్ని
గట్టులుసాకిరియని సెప్పనేల నీనేలనీనేలచెఱువుతెగివెల్లువఁబోయెడినీళ్ళరి
గట్టఁగూడునా పోయినప్రాణంబులు మగుడునాయిత్తడిపుత్తడివలె యొ
ఱకువచ్చునా సామిదోగులైపాఱిపోయెడివారు తిరుగరానేర్తురా హరిద
ళంబు హరిదళంబు చాయచూతంతేయూతంతేయని పురికొనిపలుకుప
లుకులకతండునిచ్చమెచ్చి యీపరియందఱమొక్కచిదుమై వెంటనే గుంపు
లుడ్డలుతుటుములుమూకలుగా డాకమీఱ నాలుగుకోపులతో నీనినవులుల
చాల్పని, యూతలుగ్రమ్మినవలీలను పొంగుబారినచాయను, వలలువేసినపొం
దికను, సుడిగాలివీచుదెప్పరంబున, కొంగలకుదూఱుబైరిడేగలగతిని,కణ
తిరీఁగలుముసురుకొనుభాతిని, చుల్లరంబులమొత్తంబున, సివంగులుచుట్టు

కొనుహరువున, సరవత్తులవేగమున, రంజకంబుదినుసున, సురటిదిప్పిన ట్లు, తోకచిచ్చునాఁగనెదిర్చిన పగరగుండెలుచిదురిపలుగ విదిర్చవలె ని లనదురివననుచుఁ దమతమము స్తీదులతో సిస్తు గాడో స్తినిచుట్టుముట్టికోపా టోపంబున॥ ... ... ... ...

❁ పాత్రసభేదము. అపూర్వప్రయోగము. ❁

౭౮౯. క॥ మీసలుమెలిబెట్టుచుఁగడు। రోసమ్ములు గ్రమ్ముకొనఁగఁబురో భాగములం। దాశలదురివకేకలిడుచును। దూసినకత్తులను ద్రిప్పుడులుగు డుసువడఁగ॥ ... ... ... ❁

౭౯౦. ఉ॥ వ్రేసినలేమబంతి యనివ్రేటునవెంబడి జొచ్చిబిత్తతిక్। డాసి బెళానలాగెను తటాలున వ్రేసిగుణంబురాటముక్। సీసముకత్తిచాంగ ణ్నృసింహముకొక్కసకెల్లిబెట్టుయు। భ్యాసివిధంబుజూపుచుఁ గిలార్చు చుమేల్జగజెట్లకైవడిక్॥ ౭౯౧. గీ॥ వింగళించియాటవెలఁది చందంబున। కోపులందుమీటియేపుకోన। మిత్రగణములతివిచిత్రతంబైకొన। దైవగణ ములెమరఁదారసించె॥ ... ... ... ...❁

❁ భీభత్సరసము. ❁

౭౯౨. ఉ॥ తారసమైనయంతబెడిదంబుగలో వెలిదప్పి తెప్పసక్। మోరలుబోరలల్ల చనుముక్కులు ముక్కులు చెక్కికేలివాల్। దారులు దప్పనీకననిదారులెటింగి తముక్బిరా, దునే। దారులు మెచ్చశాత్రవవి దారులునైజయమందియున్నెడక్॥ ... ... ❁

౭౯౩. క॥ తప్పినవారలుపాఱుడు। దప్పినవారలునుగోరిలితల్లడప డుచుక్, దప్పటడుగులిడుచప్పుడు। తప్పటబాగెములటంచుదలఁ పుచుమ దులక్॥ ౭౯౪. గీ॥ సేకరించుకతక్కిన మూకనెల్ల। మాయలెడపగలచు క్కబోయమిన్న। కొదమసింగమనాయకకూటికురుజ। ముచ్చుదొరకో లుసన్నాసిచిచ్చు పిడుగ॥ ౭౯౫. క॥అనిమేసబాసఁబిలుచుచు। ననికిక్పమ రలఁబురికొల్పినబలమ్ములుసో। జనమించుకనెనరించుక। గనఁగొంచములం చునెంచకయెపికిలితమిక్॥ ... ... ... ❁

చక్రవాక రంజకుఁడైన సూర్యునికిని, రాజ=చంద్రునికిని, రాజ=యక్షుల కును, రాజరాజ=కుబేరునికిని, రాజ=ప్రభువైనవాఁడా? కంజకంజపా నపానవీన, కంజ=అగ్నిహోత్రునికిని, కంజపానప=అమృతపానముచే సెడుదేవతలఁబాలించు యిందునికిని, అనవీన=అద్యుఁడైనవాఁడా? వీనకాం డ, వి=పక్షులకు, ఇన=ప్రభువైనగరుడుఁడే, కాండ=గుఱ్ఱము గాఁగలవాఁ డా? కాండభాగభాగమందమందరాగ, కాండ=జలముయొక్క, భాగ= ప్రదేశమును, భాక్=పొందిన, అమంద=అధికమైన, మందరాగ=మంద రపర్వతముఁగలవాఁడా? రాగధారిధారిదానదాన? రాగ=మాత్సర్యము ను, ధారి=ధరించిన, ధ=చంద్రునికి, అరి=శత్రువైనరాహువుయొక్క, దాన=ఖండనముచేత, దాన=శ్రేష్ఠమైనవాఁడా? లోకలోకపాలా, లో క=జగములను, లోక=జనులను, పాలా=పాలించేవాఁడా? (నిఘంటుప్ర యోగములు) తశబ్దఃపుంసిసంభోగే । నిశ్చయేకోపపుచ్ఛయోః। ధాతువాద విదాచోరే॥ (ఇతినానార్థరత్నమాలా). రాజాప్రభౌనృపేచంద్రే। యక్షే క్షత్రియశుక్రయోః ॥ పీయూషపద్మయోఃకంజం । కంజోమూర్ధనివేధసి ॥ నానా॥విష్కిరపతత్రిణః ॥ (ఇత్యమరః). ధఃపుంసింద్రేధ్వనౌధ్వాసే। శ్రీ దేధన్వంతరౌఘుటే॥ దానంగజమదేత్యాగే । శుద్ధిఖండనయోరపి॥(ఇతి, నానా,ర).

{ ఆదిద్విప్రాసదళమధ్యత్రిప్రాసనియమాంత్య ద్విప్రాసదళచరణాక్కిలివడిసీసము. }

౮౦౬॥ పురహరాదికసురాసురదురాసదధరాధరవరామితభరా భరణదారి । మదవదాకృతిముదాస్పదమదావళరదాగ్రదగదా భుజవదా వదజనాఘ । ఖలపలాశనబలాతులబలాహకకలాఖిలపలాయనకలానిలని భా(స్త్ర) । భయరయానమదయాన్వయనియామకజయాలయువయా రసమ యాశయవిలాస । హేమభూమసముజ్జ్వలక్షౌమధామ । దీనమానసకృ ప్తాభిమానదాన। నక్రవిక్రమహారకరావక్రచక్ర । పావనావనవేంకటగ్రా వదేవ॥ ... ... ... ... ... *

## ❀ పైపద్యమునకర్థము. ❀

పురహరాదిక=ఈశ్వరుఁడు మొదలుగాఁగలిగిన, సుర=దేవతలకును,అసుర=దానవులకును, దురాసద=పొందశక్యము గాని,ధరాధరవర=పర్వతశ్రేష్ఠమైనగోవర్ధనమనెడు, అమిత=అధికమైన, భర=అతిశయము గలిగిన, ఆభరణ=భూషణమును, ధారి=ధరించినవాఁడా? మద=మదయుక్తమైన, మదావళ=కువలయాపీడమను యేనుఁగుయొక్క,రదాగ్రి=కొమ్ముతుదను, ద=ఖండించిన, గదాభుజ=గదాసదృశభుజమును, వదావద=పలుకునట్టియనఁగాస్తోత్రముఁ జేయు,జనౌఘ=జనసమూహముఁ గలవాఁడా? ఖల=దుర్మార్గులైన, పలాశనబల=రాక్షసబలమనియెడు, అతుల=సమానరహితమైన,బలాహకకుల=మేఘసమూహమును, అఖిల=ఖిలము గాని, పలాయన=పలాయనము చేయునట్టి, కల=విద్యయందు, అనిలనిభ=వాయుసమానమగు, అస్త్ర=బాణముఁగలవాఁడా?భయ=భీతిచేత, రయ=శీఘ్రముగా, ఆనమత్=నమస్కరించువారికి, అయ=శుభావహవిధియొక్క, అన్వయ=కూటమిని, నియామక=అవశ్యకముగాఁజేయుచున్న, జయ=జయమునకు, ఆలయ=ఉనికిమైన, దయారసమయ=దయారసవికారమైన,ఆశయ=హృదయముయొక్క, విలాస=విలాసముఁ గలవాఁడా?(కడమ, సుగమము.) ... ❀

{ భుజంగప్రయాతస్రగ్విణీవృత్త గర్భితదండకరూప
చిత్రసీసము - యెత్తుగీతిద్వ్యక్షరి. }

౮౦౭॥ పూతనాదాసురభ్రాతృసంత్రాణసూర్య ప్రకాశాకృతీయప్రమేయ। శేషతల్పాకరస్ఫీతశంఖారి గాంభీర్యవార్ధీసితాభీమవంద్యా। దంతిరక్షావరాద్వైతమార్గ ప్రభావాత్తచిత్తాధికాయద్రిస్థైర్య। కంజనేత్రాశరఖ్యాత జీమూతసంకాశవర్ణాతిగాకంబుకంఠ। మున్నుమునిమనన మ్మున నెన్నినోమి। నెమ్మనమ్మున నిన్ను నేనమ్మి నాను। నేమమున నేమమున నెన్నునీమనమున। మేననున్నని నెమ్మనీమీను మిన్న॥ ❀

పైపద్యమునందలిగర్భితవృత్తములు.

❁ గర్భితభుజంగప్రయాతము. ❁

1. సురభాతృసంత్రాణసూర్యప్రకాశా । కరస్ఫీతశంఖారిగాంభీర్యవార్ధీ । వరాద్వైతమార్గప్రభావాత్తచిత్తా । శరఖ్యాతజీమూతసంకాశవర్ణా॥ ... ... ... ... ... *

❁ గర్భితస్రగ్విణీవృత్తము. ❁

2. భాత్రిసంత్రాణసూర్యప్రకాశాకృతీ । స్ఫీతశంఖారిగాంభీర్యవార్ధీసితా । ద్వైతమార్గప్రభావాత్తచిత్తాధికా । ఖ్యాతజీమూతసంకాశవర్ణాతిగా॥ ... ... ... *

బహువిధచిత్రకంకణబంధద్విగుణితసీసచరణ చతుష్టయగర్భిత, ద్విపద, కందద్వయ, సమవృత్త, చౌపదయుగళాటవెలఁది, తేటగీతి, మదనవిలసిత, తురంగవృత్త, బహువిధతాళవృత్తాష్టక, ధవళ, శోభాన, గానారాత్రిక, గానజంపె, త్రిపుటార్థచంద్రిక, సువ్వాల, లాలిపదేలా, మంజరి, సమతాడిండిమతాళవృత్త, మణిగణనికర, తురగవల్గనరగడోదాహరణ సంబుద్ధి కళికోత్కళికార్థాహిరీరాగదళ, ముఖారిరాగాటతాళదళ, కాంభోదిరాగరూపకతాళదళ, కాంభోదిరాగసమపద, కన్నడరాగసాంగత్య, కొరవంజిదళరేవగుప్తిరాగసమపద సావేరిరాగైకతాళదళ, బిలహరిరాగాటతాళసమపద, పుష్పమాలికాబంధ, గోమూత్రికాబంధ, శార్ఙ్గబంధ, షోడశదళపద్మబంధ, పాదుకాబంధ, నవరంగబంధ, ఖడ్గబంధ, గుచ్ఛబంధ, ఛత్రబంధ, చామరబంధ, గదాబంధ, చక్రబంధ, శకటబంధ, నాగబంధ, రథబంధ, వీణాబంధ, శంఖబంధ. మృదంగబంధ, పాదభ్రమకబంధ, పాదార్థభ్రమకవింశంతిబంధ భేదకందానుష్టుప్‌శ్లోకాంతర్గత, చతుర్భద్ర, నవరంగ, సర్వతోభద్రాందోళికాబంధయుక్తానులోమవిలోమకంద, భాషాశ్లేషకంద, కందాటవెలఁదిగర్భితాంత్యతేటగీతియుక్తచౌషష్టిభేదచిత్రసీసము.. *

౨౦౮. । సాలగ్ర్య సారససమనేత్రయుగళ నారదరుచికాంతినరఘునప

నిత । సారాగధీరవిశదవీనతురగ భైరవభవ జైత్రభరశుభకరణ । సారా తిహారవిసరచారణహారిసారసహితచంద్రశరజజయనుత । వారాశినారదవరపూజితపదగౌరవకటిఖడ్గగరళగళసఖ । హరినగనిలయగిరిధరయసురదళన । మణిమయమకుటసురమణిమధువిశరణ । కరివరదకువరరుచిరతరవసనన । రహరిలసితదరనిగమవిహారణహారి॥ ... ❀

❀ పైపద్యమునందలి గర్భితములు. ❀

❀ ద్విపద. ❀

1. సారాగ్ర్యసారససమనేత్రయుగళ। నారదరుచికాంతినరఘునపనిత
సారాగధీరవి ❀ శదవీనతురగ । భైరవభవజైత్ర❀భరశుభకరణ
సారాతిహారవిసరచారణహారి। సారసహితచంద్ర❀శరజజయనుత
వారాశినారద❀వరపూజితపద । గౌరవకటిఖడ్గ❀గరళగళసఖ॥

❀ ప్రథమకందము. ❀

2. సారససమనేత్రయుగళ । నారదరుచికాంతినరఘునపనితసారా
ధీరవిశదవీనతురగ । భైరవభవజైత్రభరశుభకరణసారా॥ ❀

❀ ద్వితీయకందము. ❀

3. హారవిసరచారణహారి । సారసహితచంద్రశరజజయనుతవారా
నారదవరపూజితపద । గౌరవకటిఖడ్గగరళగళసఖసారా॥... ❀

❀ సమవృత్తము. ❀

4. సారాసారససమనేత్రయుగళ ।సారాధీరవిశదవీనతురగ
స్సారాహారవిసరచారణహారి । వారానారదవరపూజితపద॥❀

❀ ప్రథమ, మహానవమిచౌపది. ❀

5. సారాగ్ర్యసారససమనేత్రయుగళ।నారదరుచికాంతినరఘునపనిత
సారాగధీరవిశదవీనతురగ।భైరవభవజైత్రభవశుభకరణ॥ ...❀

❀ ద్వితీయ,మహానవమిచౌపది. ❀

6. సారాతిహారవిసరచారణహారి। సారసహితచంద్రశరజజయనుత
వారాశినారదవరపూజితపద । గౌరవకటిఖడ్గగరళగళసఖ॥...❀

❁ ఆటవెలఁది. ❁

7. నారదరుచికాంతినరఘనపనితసా । భైరవభవజైత్రభరశుభకర
సారసహితచంద్రశరజజయనుతవా । గౌరవకటిఖడ్గగరళగళస॥

❁ తేటగీతి. ❁

8. సారససమనేత్రయుగళనారదరుచి।ధీరవిశదవీనతురగభైరవభవ
హారవిసరచారణహరిసారసహిత।నారదవరపూజితపదగౌరవకటి॥

❁ మదనవిలసితవృత్తము. ❁

9. నరఘనపనితా।భరశుభకరణా। శరజజయనుతా।గరళగళసఖా॥

❁ తురంగవృత్తము. ❁

10. తానాతానన॥సారససమనేత్రయుగళనారదరుచికాంతినరఘనపనిత
ధీరవిశదవీనతురగభైరవభవజైత్రభరశుభకరణ
హారవిసరచారణహరిసారసహితచంద్రశరజజయనుత
నారదవరపూజితపదగౌరవకటిఖడ్గగరళగళసఖ॥ .. ❁

❁ బహువిధతాళవృత్తము. ❁

11. తానాతందనతానా॥ నారదరుచిధీరవిశద । భైరవభవహారవిసర
చారణహరిసారసహిత । నారదవరగౌరవకటి॥ ... ❁

❁ అష్టకము. ❁

12. సారససమనేత్రయుగళ । నారదరుచిరఘనపనితా
ధీరవిశదవీనతురగ । భైరవభవభరశుభా
హారవిసరచారణహరి । సారసహితజయనుతా
నారదవరపూజితపద । గౌరవకటిఖడ్గసా॥ ... ❁

❁ ధవళము. ❁

13. సారససమనేత్రయుగళ । నారదనరఘనపనిత
ధీరవిశదవీనతురగ । భైరవభవశుభకరణ॥ ... ❁

❁ శోభాన. ❁

14. సారససమనేత్రయుగళ । ధీరవిశదవీనతురగ

హారవిసరచారణహారి। నారదవరపూజితపద॥ ... ✻

✻ హారతి అనఁగాగానారాత్రికము. ✻

15. సారాగ్ర్యసారససమనేత్రయుగళఘన। భైరవభవజైత్రభరశుభకర
సారాతిహారవి సరచారణహారిజయ । గౌరవకటి ఖడ్గగరళగళసఖ॥

✻ జంపె ✻

16. సారాగ్ర్యసారస సమనేత్రనరనుత । గౌరవకటిఖడ్గ గరళగళసఖ॥

17. హారవిసరచారణ హరిసారసహితచంద్రజయనుత
నారదవరపూజితపద గౌరవకటి
నారదరుచికాంతి నరఘనసారస సమనేత్రయుగళ
ధీరవిశదవీనతురగభైరవభవ॥ ... ... ... ✻

✻ అర్ధచంద్రికలు. ✻

18. కరివరదకువర। హరినగనిలయ॥ ... ... ✻

✻ సువ్వాల. ✻

19. సారస సమనేత్రయుగళ । నారదరుచి నరఘన
ధీరవిశద వీనతురగ। భైరవభవ॥ ... ... ✻

✻ లాలి. ✻

20. సారస సమనేత్రనారదరుచి । భైరవభవజైత్రభరశుభకరణ॥

✻ ఏల. ✻

21. ధీరవిశదవీనతురగ- సారససమనేత్రయుగళ
హారవిసరచారణహారి- సారసహిత- నారదవరపూజితపద॥

✻ మంజరి. ✻

22. నారదరుచికాంతినరఘనపసిత । వీనతురగహారవిసరశుభకర
సారస సమనేత్రచంద్రజయనుత । శరజవారాశివిశదపూజితపద
మధు విశరణమణిమయ మకుటహారి। కరివరదహరినగ నిలయనిగమ॥

✽సమతాడిండిమతాళవృత్తము.✽

23. తక్కతోంగధిక్కతోంగధిమితతోంగధిమితతా
తనన తనన తనన తనన తనన తనన తననా॥
సారస సమనేత్ర యుగళ, నారదరుచి నరఘనా
నీరవిశదవీనతురగ, భైరవభవభరశుభా
హారవిసరచారణహరి, సారసహితజయనుతా
నారదవరపూజితపద, గౌరవకటిఖడ్గగా
హరిన, గనిల, యగిరి, ధరయ, సురద, ళనమ, ణిమయమా॥... ✽

✽ మణిగణనికరము. ✽

24. నరఘననుతభవభరశుభకరణా । హరిజయనుతవరగరళగళసఖా
సురమణిమధువిహహరినగనిలయా । కరివరదకువరనరహరినిగమా॥

✽ తురగవల్గనరగడ. ✽

25. హారవిసరచారణహరి సారసహితచంద్రశరజ
నారదవరపూజితపద గౌరవకటిగరళగళస
ధీరవిశదవీనతురగ భైరవభవభరశుభకర
సారససమనేత్రయుగళ నారదరుచినరఘననుత॥ ... ✽

✽ ఉదాహరణసంబుద్ధికళికార్థము. ✽

26. గౌరవకటిగరళగళస హారవిసరచారణహరి
సారసహితచంద్రశరజ నారదవరపూజితపద
భైరవభవభరశుభకర సారస సమనేత్రయుగళ
నారదరుచినరఘననుతధీరవిశదవీనతురగ॥ ... ✽

✽ ఉత్కళికార్థము. ✽

27. హరినగనిలయగిరిధరయ । సురదళనమణిమయమకుట
సురమణి కరివరదకువర । నరహరిలసితదరనిగమ॥ ... ✽

✽ఆహిరీరాగదరువు.✽

28. సారాగశ్రీసారససమనేత్రయుగళ,సారాగధీరవిశదవీనతురగ॥

❀ ముఖారిరాగదరువు, ఆటతాళము. ❀

29. సారాగ్ర్యసారససమనేత్రయుగళ। భైరవభవజైత్రభరశుభకరణా॥

❀ ఎఱుకలకాంభోదిరాగదరువు, రూపకతాళము ❀

30. సారాతిహారవిసరచారణహరి। వారాశినారదవరపూజితపద॥ ❀

❀ కాంభోదిరాగసమపదదరువు. ❀

31. సారససమనేత్రయుగళ। నారదరుచికాంతినరఘనపనిత
సారాగధీరవిశదవీనతురగ। భైరవభవజైత్రభరశుభకరణ॥ ... ❀

❀ కన్నడరాగసాంగత్యదరువుపదము. ❀

32. సారాగ్ర్యసారససమనేత్రయుగళ। నారదరుచికాంతినరఘనపనిత
సారాగధీరవిశదవీనతురగ। భైరవభవజైత్రభరశుభకరణ॥ ... ❀

❀ గౌరవంజిదళరేవగుప్తిరాగసమపదదరువు. ❀

33. సారాతిహారవిసరచారణహరి। సారసహిత చంద్ర శరజజయనుత
వారాశినారదవరపూజితపద। గౌరవకటిఖడ్గ గరళగళసఖ॥ ❀

❀ సావేరిరాగైకతాళదరువు. ❀

34. హరినగనిలయగిరిధర। యసురదళనమణిమయమకుట
సురమణిమధువిశరణ। కరివరదకువరలసితవర॥

❀ బిలహరిరాగాటతాళసమపదదరువు. ❀

35. సారాగధీరవిశదవీనతురగ। నారదరుచికాంతినరఘనపనిత॥

❀ వింశతిబంధకందము. ❀

36. సారవరహారవారా। సారహరీనరహరిహరశరకరసారా
గౌరధరధీరచారా। సారహరీసురహరినరసరసారభరా॥ ❀

❀ పైపద్యమునకర్థము. ❀

సారవర—న్యాయముచేత శ్రేష్ఠమైనవాఁడా? హారవారా—హార సమూహముఁగలవాఁడా? సారహరీ—స్థిరాంశముఁ గలిగినస్వామీ? నరహరి—నరసింహావతారా? హరశర—ఈశ్వరునికిబాణమైనవాఁడా? కరసార—భుజాబలముఁగలవాఁడా? గౌరధరధీరచారా—మేరువువంటి ధైర్యప్ర

భావముఁగలవాఁడా? సారహారీ=అతిశయమైననాగేంద్రునిఁగలవాఁడా? సురహారి=అమరేంద్రునిఁగలవాఁడా? నరసరస్సారభరా=అర్జునునియొక్క సరసముచేతమిక్కిలి యతిశయమైనవాఁడా? ... ... *

* అనుష్టుప్ఛ్లోకము. *

37. సారాసారరసారాసా । రాగహారరహారగరా
సాహాయసాసాయహాసా । రరసామమసారర॥ ... *

పైశ్లోకమునకర్థము.

సార=స్థిరమైన, అసార=అవిభేదముఁగలిగిన, రస=శృంగారరసమే, అ=భూషణమైన, రాసా=రాసక్రీడఁగలవాఁడా? రాగహార; రాగ=అనురాగమే, హార=హారముఁగాఁగలవాఁడా? రహారగరా; ర=శ్రేష్ఠమైన, హా=హంసలుగలిగిన, అగ=పర్వతమునందు, ర=మనోహరమైన, అ=విష్ణువైనవాఁడా? సాహాయ;సా=కాంతికిని, హా=ఈవికిని, య=నిలయమైనవాఁడా? సాసాయహాసార రసామ; అసాయ=నాశరహితమైన, హాస=నవ్వుయొక్క, అ=భావముచేత, ర=నిపుణులైన,రసా=భూమితోడను, మ=లక్ష్మితోడను, స=సహితుఁడైనవాఁడా? ఈసవర్ణముసమాసప్రథమాక్షరముగ నెలుంగునది. మసారర; మ=ఈశ్వరునివంటి, సార=బలముయొక్క, ర=గౌరముఁగలవాఁడా?

ఇందుకునిఘంటుప్రయోగములు.సారో బలేస్థిరాంశేర్థే। న్యాయ్యేక్లీబంవరే త్రిషు । క్లీబమంబుని॥నానా॥ రాస్త్రియాం హేమ్ని శాలాయా । మాశం సాయాంగతావపి॥నానా॥ హశ్శంకరేహరౌహంసి । రణరోమాంచవాజిషు । గర్వేప్రచేతసిస్త్రీతు । హత్యాగే గతివీణయోః ॥నానా॥యస్త్యాగే నిలయేవాయౌ।యమేదాతరియాతరి ॥నానా॥ భశ్శంభౌభ్రమరేభావే। శుక్రేంశౌజలదేపుమాన్॥నానా॥ అగోనగశ్చభుజగే । నాభౌభూరుహభూధరే ॥నానా॥ సః పుంస్యుమాసుతేవాయౌ । దేహకాంతౌతుసాస్త్రియాం । సంక్లీబేస్యంధనపథే । జ్ఞానేధ్యానేనివారణే ! సః సత్యేవిదుషిశ్రేష్ఠే । సాధౌభవతివత్రిషు॥నానా ॥ అకారోబ్రహ్మవిష్ణ్వీశ । కమఠే

ష్వంగణేరణే । గౌరవేంతఃపురే హితౌ । భూషణేంఘ్రిపుమేజ్యయోః॥ అకారస్తుపదేభావే । పరితాపేపితామహే॥నానా॥ మత్స్యంఛాధాతరిం నా॥ రాగోనురాగేమాత్సర్యే । లాక్షాదౌరక్తిమద్విషీ॥ ...... ※

※ అందోళికాబంధయుక్తానులోమవిలోమకందము ※

38. మారామాసాదయభర । భారశరాసాజలజసువదననిజరసా
సారజనినదవసుజలజ । సారాశరభారభయదసామారామా॥

※ పైపద్యమునకర్థము. ※

మారామాసాదయ; మారామ=లక్ష్మీదేవిని, అసాత్=పొందిన, అయ=శుభమునుగలవాఁడా? భరభారశరాసా, భర=అతిశయమును, భార=భరించినటువంటి, శరాసా=విల్లుఁగలవాఁడా? జలజసువదన; జలజమువలెశోభనమైనముఖముఁగలవాఁడా? నిజరసా=(స్వకీయమైన) సహజమైనరసముఁగలవాఁడా? సారజనినదవసుజలజ; సారజ=సారమువలనఁబుట్టిన, నినద=ధ్వనిచేత, వసు=శ్రేష్ఠమైన, జలజ=శంఖముఁగలవాఁడా? సారాశరభారభయద; సార=బలవంతులైన, ఆశర=రాక్షసుల యొక్క, భా=కాంతిని, ర=గ్రహించిన, భయ=భయమును, ద=ఇచ్చినవాఁడా; సామారామా? సామ=సామవేదమే, ఆరామా=ఉద్యానవనముగాఁగలవాఁడా? (నిఘంటుప్రయోగములు) వసుర్వారాజభేదేషు। శ్రేష్ఠేగ్నింధనదాంతుషు । మధురేవాదనేహేమ్ని । సలిలేజీవరత్నయోః॥భారోభరేవివర్ధేచ । పలానాంద్విసహస్రకే॥నానా॥ భరోతిశయభారయోః॥నానా॥ ... ... ... ※

※ భాషాశ్లేషకందము. ※

39. మేలానాయకబలిరా । యేలాచలమానగానదేరాలివల
న్నీలాగీతీరగునా । వేలముదయకావగదరవేంకటరమణా॥ ... ※

※ పైపద్యమునకునాదిభాషార్థము. ※

మేలానాయక, మా=లక్ష్మికిని, ఇలా=భూమికిని, నాయక=నాయకుఁడైనవాఁడా? బలిరా, బలి=బలివద్దనుండి,రా=గ్రహించేవాఁడా?

ఏలాచలమానగా నదేరాలివలత్, ఏలా=ఏలకీతీఁగెలచేత, అచల=నిశ్చలమైన, మ=కాంతియే, అ=భూషణముగాఁగలిగిన, నగ=పర్వతముయొక్క,అ=అంగణమందలి, నద=నదముయొక్క,ఇరా=జలముయొక్క,ఆలి=సమూహమందు,వలత్=సంచరించువాఁడా? నీలాగీతరగు, నీలా=నీలాదేవియొక్క, గీతి=గానమును, ఇర=ప్రేరేచునటువంటి, గు=వాక్కులుగలవాఁడా? నావేలముదయ, నా=జ్ఞానముచేత, అవేల=అధికమైన, ముత్=సంతోషముఁగలవారలకు, అయ=శుభావహవిధినైనవాఁడా? కావగదర, క=బ్రహ్మయొక్క, అవ=రక్షణమును, గ=పొందిన, దర=శంఖముఁగలవాఁడా? వేంకటరమణ=వేంకటరమణుఁడైనవాఁడా? అ=విష్ణువైనవాఁడా॥ నాస్త్రీనాభాసుజ్ఞానవాద్యయోః॥ ఇతినానార్థరత్నమాలా॥

❊ ఎత్తుగీతియందలికందము. ❊

40. హరినగనిలయగిరిధరయ। సురదళనమణిమయమకుటసురమణిమధువి
శరణ కరి వరద కువరరు। చిరతరవసననరహరి లసితదరనిగమా॥

❊ ఎత్తుగీతియందలిఆటవెలఁది. ❊

41. హరినగనిలయగిరిధరయసురదళన।మణిమయమకుటసురమణిమధువిశ
రణకరివరదకువరరుచిరతరవస । ననరహరిలసితదరనిగమవిహ॥

☞ (పై పద్యమునందలి గర్భితములును, బంధభేదములును జేరిచొషష్టిభేదములని యెఱుంగునది. మఱియు అనుష్టుప్ శ్లోకమునకు అనులోమవిలోమకందమునకు రెండువర్ణములును భాషాశ్లేషకందమునకు నాలువర్ణములును నీసీసములోనివి కావని యెఱుంగునది.)

{ ఆదిచతుశ్చరణగర్భితమత్తేభవిక్రీడితావృత్తతదంతర్గత
షడక్షరసమవృత్తోత్తరగీతి గర్భితకందవిభాసమానసీసము. }

౪౨॥ సవినయాచారవిచారతత్పరమహావేదాంతవిద్వందితాదిదేవ। సుజనవర్యామితశోభనైకఘటనాచాతుర్యలీలాస్పదాతతాత్మ । భవనచారిప్రతిహారికాంక్షిహృదయాబ్జాతద్విరేఫాకృతీతగాత్ర । భువనరాశీశ్వరపుత్రికాభినుతసద్వస్తుప్రదానోత్సవాత్యుదార ।గురుతరదయాసమజ్జ ఎ

లయాగిదరకర । దారితారిహస్తివరదవారిరుహాన । యనవసుఘటితాంబ
రధరఘననిభతను । విభఫణిగిరివాసానిత్యశుభవిలాస॥ ... ❋

❋ గర్భితమత్తేభవిక్రీడితవృత్తము. ❋

1. వినయాచారవిచారతత్పరమహావేదాంతవిద్వందితా । జనవర్యామి
తశోభనైకఘటనాచాతుర్యలీలాస్పదా । వనచారిప్రతిపారికాంక్షి
హృదయాబ్జాతద్విరేఫాకృతీ । వనరాశీశ్వరపుత్రికాభినుతసద్వస్తుప్ర
దానోత్సవా॥ ... ... ... ❋

❋ గర్భితషడక్షరసమవృత్తము. ❋

2. వినయాచారవి । జనవర్యామిత । వనచారిప్రతి । వనరాశీశ్వర॥ ❋

❋ గర్భితకందము. ❋

3. గురుతరదయాసముజ్జ్వల । యరిదరకరదారితారిహస్తివరదవా
రిరుహానయనవసుఘటితాం । బరధరఘననిభతనువిభఫణిగిరివాసా॥

{ఆదిచతుశ్చరణగర్భిత మత్తేభవిక్రీడితవృత్తోత్తర
గీతిగర్భితకందవిభాసమానసీసము.}

౮౧౦॥ మహితనానామునిమండలీవిరచితా హీనాతివేల్లత్స్తవానుషం
గ । వితత జన్యాంగణ విక్రమక్రమలసత్క్రవ్యాదసంహారకానుభావ ।
వినతబర్హిర్ముఖ విస్ఫురన్మకుటరత్నశ్రేణిరాజత్పదాభిరామ । విగతవి
శాంగ్రణనవిస్మయస్మయదివాకశ్శాఖిజైవాతృకాదిదాన। నిరుపమ కృపాప
యోంబుధినిరతశుభద । ధీరచరితనిర్మలతరదేహరుచిజి । తసజలజలదా
యురగేంద్రధరణిధరవ । రయురుసుగుణనిధీపక్షిరాజవాహ॥ ... ❋

❋ గర్భితమత్తేభవిక్రీడితవృత్తము. ❋

1. హితనానామునిమండలీ విరచితాహీనాతివేల్లత్స్తవా । తతజన్యాం
గణవిక్రమక్రమలసత్క్రవ్యాదసంహారకా । నతబర్హిర్ముఖవిస్ఫురన్మ
కుటరత్నశ్రేణిరాజత్పదా । గతవిశాంగ్రణనవిస్మయస్మయదివాకశ్శాఖి
జైవాతృకా॥ ... ... ... ❋

❁ గర్భితకందము. ❁

2. నిరుపమకృపాపయోంబుధి । నిరతశుభదధీరచరితనిర్మలతరదే
హరుచిజితసజలజలదా । యురగేంద్రధరణిధరవరయురుసుగుణనిధీ॥

{ అత్వేత్వోత్వతురంగవృత్తఘటిత
చతుశ్చరణసీసము. అపూర్వప్రయోగము. }

౮౧౧ ॥ పద్మసంభవశక్రపర్వత వరధర్మధరవచనస్తవ్యనరసహచర। సిరికినిక్షితికినివిరివినిజిగినించిసిరిగిరినిలిచితిచిత్సితినిధి । బుధులునుగురులును పుణ్యులుమునులును నుతులుంచుమురువుకుశుక్రతులుగుఱుతు । లుగజగత్ర యిధగద్ధగలగత్థగవరధ్వజమరుద్ధతిఖలధ్వజినిర్మగ్గ । నమరుమరుఁగన్నజి య్యాదృష్టమరుజియ్య । జియ్యవిశదాంతరీపనికాయ్యభుజగ । శయ్యాపా పావళీసమిద్ధాయ్యాసమితి। శాయ్యానర్ఘ్యగుణాత్మయ్యాచక్రనయ్యా॥ ❁

❁ చిత్రసీసము. ❁

౮౧౨ ॥ నీరజదేహకాంతిరజనీకరవక్త్రజలధిశయనరవిశశినయనయు। గారజనీచరవారదశారికరాఫణిపతికుధరవరనిలయ । గరుడతురంగచం క్రమణకౌతుకచిత్తవారిజోదరనరవాసవనుత । మహిమయలర్మేలుమంగా హృదంబుజభృంగాయనాథాంతరంగకువర । పారికాంక్షకరక్షుపంకేరు హాక్ష । చారుకౌస్తుభవక్షుజన్యారిశిక్ష । పురహరణసఖయమరకింపురుష గరుడ । సిద్ధసాధ్యవిద్యాధరసేవితపద॥ ... ... ❁

{ ఏకగణయుక్తైకనియమానుప్రాసషట్క
ఘటితచరణాక్కిలివడిసీసము. }

౮౧౩ ॥ తులలేని యలమేనికలవోనివలతేనిసాలపానికలనూనినిలఁగ లాఁడ । అరిదాపుతరిరూపుకరిదాపుదరిటూపునరివైపునెటిప్రాపుకరము వాఁడ। పొగరొందుతొగవిందుసిగబొందుతగఁజెందుమగపొందుసొగసొం దుమగువతోడ । యలమించునలమించు తలమించుతలమంచునలయించుచ లముంచువలపుతోఁడ । పాపరాపగజిగిబిగిపక్కిజక్కి । నెక్కునెక్కువ తేవసొంపెక్కుదేవ । గిబ్బగుబ్బలినదుదిబ్బనుబ్బుకబ్బి । తమ్మిముద్దియ

గద్దియతాతతాత॥ ... ... ... ✻

✻ ముక్తపదగ్రస్తవిశేషోక్తిలివడిసీసము. ✻

౮౧౪. ఘనకీర్తిజితశరద్ఘనసార ఘనసారసారకుమార కాసారసార। సారభట్యుద్ధతాశరవారశరవారవారణార్తిప్రతీకారకార। కారారిదళితశేఖరధీర ఖరధీర ధీరభక్తశుభదోదారదార। దారదాతిమార్గ్రదవచార దవచార చారచరాపదుద్ధారధార। ధారణీధారధారరాడ్ధైర్యహార। హారనుతి పారపారమ్యదారితార। తారకాకారకారణాత్మకవిహార। హారమతదూరమారశృంగారగార॥ ... ... ✻

{ యతిభేదవిభక్తియుక్తసీసద్వయావకలివడి సీసము. }

౮౧౫. అబ్ధికన్యాతిభోగైకపారంగతమాంసాశనేశసంహారతేజ। రమ్యతరాదినారాయణ విగ్రహాహారివైణవకలాలాపనినద। హేవాకపాండురద్వీపమధ్యశయానబుభుక్షికులవినుతవర్ధిష్ణుమహిమ। తజ్ఞత్వరహితాస్మదవనకారణనామనాస్తివాదజనచేతోబ్జదూర। యిరువుగను పట్టుచలువతెమ్మెరరతీబు। దాడితత్తడిసాదికడంగరియ్యో। హాయసఖయలరు మేలుమంగమ్మతోడ। హెచ్చుసొన్నంపువల్వధరించుమేటి॥... ... ✻

✻ సంస్కృతవిభక్త్యంతసీసము. ✻

౮౧౬. తావకనగజలస్నాతపాపహరాయయతిమాత్రసాధనజ్ఞానదాయ। యాపద్దశాప్తివేదండభీదళనాయరాజితశ్రీవత్సలక్షణాయ। వాజ్ఞ్మధుభవగీతలగ్నచేతసాంయముచికుంద ముఖభక్తపూజితాయ। తతవీచిమాలిబంధాగ్రనాళీకాయపార్వతీ ప్రాణేశవర్ణితాయ।జలజవాస్తవ్యకలశీకుచప్రియాయ। పరశురామవిపాటన భంజనాయ। సవనధారీశరీరాయశంఖచక్ర। హస్తపద్మయుగ్మాయతుభ్యంనమోస్తు॥ ... ✻

✻ ౮౧౭. చతుర్విధకందము. ✻

1. వనజాయతాక్ష వాసవ।వినుతాయురగేంద్రశయనవిశ్రుతచరితా
వినతాసుతాశ్వశరజిత। వనధీశిరువేంకటేశవారణవరదా॥

2. క॥ ఉరగేంద్రశయనవిశ్రుత। చరితావినతాసుతాశ్వశరజితవనధీ
తిరువేంకటేశవారణ।వరదావనజాయతాక్షవాసవవినుతా॥

3. క॥ వినతాసుతాశ్వశరజిత । వనధీతిరువేంకటేశవారణవరదా
వనజాయతాక్షవాసవ।వినుతాయురగేంద్రశయనవిశ్రుతచరితా॥

4. క॥ తిరువేంకటేశవారణ । వరదావనజాయతాక్షవాసవవినుతా
యురగేంద్రశయనవిశ్రుత । చరితావినతాసుతాశ్వశరజితవనధీ॥

{ నవాక్షరసమవృత్తకందద్వయమణిగణనికరగర్భిత
సరసిజవృత్తపంచవిధవృత్తము. }

౮౦౮. సరసిజవృత్తము ॥ శ్రీలోలాచంద్రాలయచేలాశ్రితసురచయ
తనుజితసజలఘనా । వ్యాళగ్రావావాలదయాభూహతదితిసుతపతిహరి
సమగమనా । బాలార్కాభాశైలదపాలాప్రతతభువనచయభరణనర
సఖా । జాలోద్వేలాఖేలనశైలీసతతముగొలుతుముసరవిమనుప్రమీ॥

☞ ఈవృత్తము ననేకతాళియర్ధచంద్రిక లెనిమిది తేకులు సరి గాఁబొం
దుపఱచియున్నవి గాన సరిచూచుకొనునది॥

❊ గర్భితనవాక్షర పాదసమవృత్తము. ❊

1. శ్రీలోలాచంద్రాలయచేలా । వ్యాళగ్రావావాలదయాభూ
బాలార్కాభాశైలదపాలా । జాలోద్వేలాఖేలనశైలీ॥ ...❊

❊గర్భిత ప్రథమకందము.❊

2. శ్రీలోలాచంద్రాలయ । చేలాశ్రితసురచయతనుజితసజలఘనా
వ్యాళగ్రావావాలద । యాభూహతదితిసురపతిహరిసమగమనా॥

❊గర్భిత ద్వితీయకందము.❊

3. బాలార్కాభాశైలద । పాలాప్రతతభువనచయభరణనరసఖా
జాలోద్వేలాఖేలన । శైలీసతతముగొలుతుము సరవిమనుప్రమీ॥

❊ గర్భితమణిగణ నికరవృత్తము. ❊

4. శ్రితసురచయతనుజితసజలఘనా।హతదితిసుతపతిహరిసమగమనా
ప్రతతభువనచయభరణనరసఖా । సతతముగొలుతుముసరవిమ
నుప్రమీ॥ ... ... ... ... ❊

❁ ఏకసమాససీసము. అపూర్వప్రయోగము. ❁

౮౧౯॥ కలికాఁగానిపుడబ్జదళగళన్మకరంద ఝలతుందిలమిళిందకులని నాద । డిండిమమండళీఢిమిఢిమనిర్ఘోషవిలసితశోణకువలయముకుళ । కైతవదినదీపికాశ్రేణికాద్యుతిజాతవాతాహతచరితతుంగ । రంగత్తరంగస్ఫురచ్చామరాదిమమంగళబిరుదాంకమహిమకలిత । వర్ణనీయాపగాఢ్యసాత్వప్రభావ । ధుర్యగంగాగ్రజన్మహేతుప్రశస్త ! హలకులిశమత్స్యపద్మాంకుశాతపత్ర । భవ్యమహనీయతావకపాదసేవ॥ ... ... ❁

❁ అన్వోఢ. ❁

౮౨౦. సీ॥ కోరక్రైదువగుంపుగురికాని దాఁగిలి మూతలాటలకన్ను చేత మాటి । వారణేంద్రుని పైని నేరముఘటియించి చిఱునవ్వు మోడి చేఁ జెక్కుఁగొట్టి । దంష్ట్రినిబాలయల్కఁ దారిజూపుచుఁ దనుఁబేరుకోవలదని నోరు మూసి । విమలకులాచలేంద్రము నెన్నకయఘునస్థితి జెవరంగగద్దించి చూచి । కీర్తి కాంతవిధాననీక్షితివధూటి । వలచినీబాహుసంకేతతలముఁ జేరె । నిసువువలిపగరాపేరి నేలదారి । నడియుదిరి మేడనడయాడుకోడెమెలాఁడ॥ ... ... ... ... ... ❁

❁ ద్విపదమత్తకోకిలకందగర్భితసీసము. ❁

౮౨౧. సారసోద్భవశర్వసన్నుతసారవారణరక్షణావసురమ్యనేత్ర । ధారుణీతనయాదిధర్మవిదారి దారుణశిక్షణాతతరూపసార । హారమానసయుక్తహారివిహారనీరజవీక్షణానిధిరాజదాన । పారికాంక్షికసత్కృపారసభారహారసులక్షణాపటురమ్యకృతిస । సవితృబింబవసతిసారసమాదక । విజయభూతరాజవిదితధీర । వేదవేద్యయభవవేదాంతతత్వజ్ఞ । యసురనాశవేంకటాచలేశ॥ ... ... ... ... ❁

❁ గర్భిత ద్విపదము. ❁

1. సారసోద్భవశర్వసన్నుతసార । వారణరక్షణావసురమ్యనేత్ర
ధారుణీతనయాదిధర్మవిదారి । దారుణశిక్షణాతతరూపసార
హారమానసయుక్తహారివిహార । నీరజవీక్షణానిధిరాజదాన
పారికాంక్షికసత్కృపారసభారహారసులక్షణాపటురమ్యకృతిస॥

* గర్భితమత్తకోకిలము. *

2. సారసోద్భవశర్వసన్నుతసారవారణరక్షణా। ధారుణీతనయాది ధర్మవిదారిదారుణశిక్షణా। హారమానసయుక్తహారివిహారనీరజ వీక్షణా। పారికాంక్షికసత్కృపారసభారపారసులక్షణా॥ ...*

* గర్భితకందము. *

3. వసురమ్యనేత్రతతరూ। పసారనిధిరాజదానపటురమ్యాకృతీ సపవిత్రబింబవసతిసా। రసమాదరవిజయభూతరాజవినుతశ్రీ॥

* శ్లోకగీతిగర్భితచంపకమాలికావృత్తము. *

చా. ౨౨. నరసఖనారశాయినరనాథ నతామరనారదస్తుతా। దరకర ధారదేహధరధారి ధరాధిపదారితాశరా। హరిబలహారికంఠహారహారి హతాహితహార హృద్భిదా। స్థిరతరసీరపాణి శివశీలజితాసురసింధు బంధనా॥ ... ... ... ... *

* గర్భితశ్లోకము. *

1. నరనాథనతామరనారదస్తుతా।ధరధారిధరాధిపదారితాశరా। హారహారి హతాహితహారహృద్భిదా। శివశీలజితాసురసింధు బంధనా॥

* గర్భితగీతి. *

2. నారదస్తుతనరనాథనారశాయి। దారితాశరధరధారిధారదేహ హారహృద్భిదహారహారిహారికంఠ। సింధుబంధనశివశీలసీరపాణి॥

* అసంగత్యలంకారసీసము. *

చా. ౨౩. స్తంభంబులోదవెను దైత్యదేహంబులఁ బ్రళయములొప్పెడమెఁ దత్పట్టణముల। రోమాంచములుమించెభీమవిక్రములెడఁబ్రభవిల్లె చెమట లుపందలందు। మొక్కలిదొరలమోములవివర్ణతదోఁచెఁబగటువాతెగలఁ గంపములుగలిగె। గడిమన్నెచెలుల కన్గవలనశ్రువులూతె శతులసూక్త లనువెసఁగ్లమట్లు। వింతయిదిగాదె నినుఁజూచివిజయలక్ష్మి। పొందుగ

నుసాత్త్వికోదయమందునంత । కంటివిన్కలిదంటపేరింటిగుంటి। నడుమనె లకొన్నవేంకటనాథశౌరి॥ ... ... ... ❋

{కార్యకారణవిపర్యయరూపాతిశయో క్త్యలంకారైకావళి సంసృష్టి సీసము.}

రా౨౪. భవదీయబలరజః పాళిసంధ్యకుమున్నె తాఁగుప్పింకుదను జప్రతాపహేళి।యాహేళియస్తాగమందుఁగుప్పింకకమున్నెనలరుఁద ద్రిపుదుర్యశోంధకార । మాయంధకారౌఘమాక్రమించకమున్నెబొడముఁదావకకీర్తిపూర్ణ చంద్రుఁ।డాచంద్రుఁడుదయాద్రినవతరించకమున్నెకొమరొందు సజ్జనకుముదనివహ। మహహహిమధరబహుళతటకుహరవిహార। మాణసురసరిదురుతరమధురనినద । దళనచణజయదరరవకలితహృదయ। మానితశుభాకృతివిలాస శ్రీనివాస॥ ... ... ... ❋

{కందద్వయగర్భితభాస్కరవిలసితవృత్తము ముద్రాలంకారము.}

రా౨౫. పంకజదళనిభలోచన శంకాభావము నిహృదయసతతవిహారా। కుంకుమమృగమదసాంకవపంకోరస్థలకృతపదవననిధికన్యా । లంకృత మణిగణభూషణయంకీకృత మృదుగతిమరుదసితశరీరా । వేంకటగిరివరరుచ్యకలంకాభాస్కరవిలసితలగదరిహస్తా॥ ... ... ❋

❋ గర్భితప్రథమకందము. ❋

1. పంకజదళనిభలోచన। శంకాభావమునిహృదయసతతవిహారా
కుంకుమమృగమదసాంకవ । పంకోరస్థలకృతపదవననిధికన్యా॥

❋ గర్భితద్వితీయకందము. ❋

2. లంకృతమణిగణభూషణ । యంకీకృతమృదుగతిమరుదసితశరీరా
వేంకటగిరివరరుచ్యక। లంకాభాస్కరవిలసితలగదరిహస్తా॥

{ప్రమితాక్షరవృత్త, కందగర్భిత, నాగబంధయుక్త, చంపకమాలికావృత్తము.}

రా౨౬. ఘనఖగరాజమానహయగాయగదస్థిరనాగభోగహా। జనజగ

తీతలేనవరసారకనన్నిజభోగమోదనా। ననగవాహలూనభయన్యాయ
గతీవ్రతరాగదీనపా । యనయగధీరమానజయదాయరిగర్వహరాగవా
తిగా॥ ... ... ... ... *

## ❀ పైవృత్తమునకర్థము. ❀

ఘన=ఘనమైన, ఖగరాజ=ఖగరాజనెడు, మాన=యుక్తమైన, హయ=
హయముచేత, గ=నడచువాఁడా? యగద=ఆరోగ్యముచేత, స్థిర=స్థిర
మైనవాఁడా? నాగ=కాళియుఁడనుసర్పముయొక్క, భోగ=పడగను,
హ=కొట్టువాఁడా? జన=ప్రజలకును, జగతీతలేన=రాజులకును, వర=
నాయకుఁడైనవాఁడా? సార=స్థిరమై, కనత్=ఒప్పుచుండెడు, నిజ=స్వకీ
యమైన, భోగ=భోగమును, మోదన=సంతోషముఁగలిగిన, ఆనన=ము
ఖముఁగలిగినవాఁడా? నగవాహ=పర్వతమునుభరించినవాఁడా? లూన
భయ=భేదింపఁబడినభయముఁగలవాఁడా? న్యాయగతీవ్రత=నీతిమార్గ
ముఁగలవ్రతమందు, రాగ=అనురాగముఁగలవాఁడా? దీనపాయన=దీ
నులనురక్షించుమార్గముగలవాఁడా? అగధీర=పర్వతమువంటిధైర్యుఁడైన
వాఁడా? మానజయదా=ఉత్సాహమునుజయించువాఁడా? అరిగర్వహ
రా=శత్రుగర్వమును హరించువాఁడా? గవాతిగా=చక్షురగోచరుఁడైన
వాఁడా? ... ... ... ... *

## ❀ గర్భితప్రమితాక్షరవృత్తము. ❀

1. ఖగరాజమానహయగాయగదా । జగతీతలేనవరసారకన
న్నగవాహలూనభయన్యాయగతీ।యగధీరమానజయదాయరిగా॥

## ❀ గర్భితకందము. ❀

2. ఖగరాజమానహయగా । యగదస్థిరనాగభోగహాజనజగతీ
నరవాహలూనభయన్యా । యగతీవ్రతరాగదీనపాయనయగధీ॥

## ❀ గోమూత్రికాబంధచతుష్కందము. ❀

౮౨౬॥ 1. శరణాగతజనకాశిర । వరదానవకృష్ణఘనసుభతనూవివరా
వరభోగరాజభికా । సురవారవినయకృతఘనసువ్రతకవిరా॥

2. వరభోగరాజభీకా । సురవారవినయకృతఘనసువ్రతకవిరా
శరణాగతజనకాతర । వరదానవకృష్ణఘనసుభతనూవివరా॥
3. నవకృష్ణఘనసుభతనూ । వివరావరభోగరాజభీకాసురవా
రవినయకృతఘనసువ్రత । కవిరాశరణాగతజనకాతరవరదా॥
4. రవినయకృతఘనసువ్రత । కవిరాశరణాగతజనకాతరవరదా
. నవకృష్ణఘనసుభతనూ । వివరావరభోగరాజభీకాసురవా॥

❁ ధ్వని. ❁

౮౨౮॥క॥ దీనులమొడముంగిళ్ళని । దానమ్మతైయన్యదేవతలాసంగంగలే
రేవాటనెంచిచూచిన । యాననదరహాసవేంకటాచలవాసా॥

❁ వ్యతిరేకమాలికాలంకారసీసము. ❁

౮౨౯ ॥ తెల్లనైతళతళల్లల్లునందమెగానిచల్లనగాదువజ్రంపుఁబలుక ।
చల్లనైవెలిమిన్నలుల్లసిల్లునెకానివాసననీదుముక్తాసరంబు । వాసనమించు
చల్వయుఁజూపునేకానియలరునెతియ్యనైనులయజంబు । తియ్యఁదనముచ
ల్వతెలినిగ్గుతావిజెందునె కానియంతటఁదనరునెసుధ । చలువవెలయించు
దివ్యవాసనలునించుఁ।దియ్యఁదనముంచుజగములతెలివిఁగాంచు । నవురభ
వదీయమహనీయధవళకీర్తి । శేషశైలనివాసలక్ష్మీనివాస॥ ... ❁

❁ కటారికాబంధకందము. ❁

౮౩౦॥ సారతరశూరబుధమం । దారాహారాభిరామదాక్షిణ్యనిధీ
.ధీరాగ్రేసరరిపుసం । హారాభీమప్రతాపయసురవిరోధీ॥

{ మంజరీగీతిగర్భితచరణవహామహా
{ నాగబంధసీసము.అపూర్వప్రయోగము. }

౮౩౧. సురభిభావగరాగసూరాగణితధామవర్ణితశాశ్వతైశ్వర్యధా
మ। వర్ధితదానవవారపారావారమధ్యమస్థామహామత్తవార । నమ్రితా
మరజాతనవ్యభవ్యాయుతాసిరక్షితతాపసరత్నవర్గ్య । వర్ణిరూపారూఢ
వాసవాదరలాపహారగౌరద్యుతిసారహార । వరముఃరజదమితనుతహాసరస
హాస। రాసలీలాభిలాషవరతమపార్థ । భద్రవస్సురవారణాపారభయద।

ఫణివరాచలపాలప్రభాతిరమ్య॥ ... ... ❋

❋ గర్భితమంజరి. ❋

1. సురభిభావరాగసూరాగధామ । వర్ధితదానవవారపారావార ॥

❋ గర్భిత ఆటవెలది ❋

2. సురభిభావరాగసూరాగణితధామ । నమిత్రారజాతనవ్యభవ్యవర్య
వర్ణిరూఢవాసవాదరలాపప్రహీరగౌరసారహారమురజ॥ ... ❋

[దశావతారగర్భిత గుణితవర్ణాచల జిహ్వాకోష్ఠ్యవర్ణ
భుజంగ ప్రయాతవృత్తగర్భితనిరోష్ఠ్యాచలజిహ్వాస్ర
గ్విణీవృత్తగర్భితౌష్ఠ్యాచలజిహ్వానిరోష్ఠ్యాచలజిహ్వా
సంకీర్ణవర్ణ సమగణదండకము.]

౨౩౭. జయహరిగిరిపాభవాకారబోద్ధాగమోద్ధారణాభానుభృద్ధృధ్యభిన్నేతరాత్మీయదంష్ట్రాధృతక్ష్మాతలా, భీమరూపా, భుజంగేంద్రవాసస్థదైతేయరాణ్మస్తవిన్యస్తపాదాంబుజా, భూరిరాజన్యమార్గత్కుఠారప్రభా దేవచూడామణిభాస్వద్ధనుర్భంగబాహాబలా భైరవాంగప్రలంబాశిరచ్ఛేదనోదారణీరాయుధాభోగమోఘీకృతత్రైపురస్త్రైణపాతివ్రతీభూమభౌమప్రసూవైరిసంహారి గంధర్వరూపాధికాభంజితస్థైర్య కంసాసిభర్మాంబరశోభిణిభాగాపదూరాముగ్విభాభవ్య భాభాగ్విభావావయోభావయుగ్గోపవామా విభావ్యాభయోగ్యోపమాకుంభి పాపాపభీమావయోగోపవాగ్భామ వాగ్భామభూమీశరచ్చంద్ర చంద్రాళిసచ్చారదా, నారదాదిత్యరాడ్దంతిసంతానధాత్రీజతారాదితారాశతారేశశారోచ్ఛనీరేజరాజిద్ధరాధారశకాయినిలారాట్కశరాధీశనీరేశగంధాంతరాట్కిన్నరేశత్రినేత్రాదిదిఙ్నాథచంచత్కిరీటాగ్రనిర్యత్నరత్నచ్ఛటాసాంద్రనిర్యద్రజస్సారనీరేజితే ద్వ్యాంఘ్రినీరేజ నానారతాశ్రాంతనృత్యత్కటాక్షాంచలా, నారదారాధనానారతాప్లావితానీరదాళీలసన్నీలతేజశ్శితా, సారదైత్యచ్ఛిదాచండచక్రాంచితా, శ్రీరసాలంకృతా, శేషశైలస్థితా, భర్గవాగ్దేవతావల్లభస్తవ్యనైపుణ్యపుణ్యాభిదా, భక్తపారంపరీభూరివాంఛాఫలా

పాదిపాదాంబుజా, త్వంసమస్తాపరాధం సహస్వాద్యమే భూయసీందే హిభక్తింభవత్పాదయోః స్థైర్యయుక్తాంవిభూతిం నమస్తే నమస్తే నమస్తే హరే॥ ... ... ... ... ... ❋

{గర్భితాచలజిహ్వాకోష్ఠ్యవర్ణభుజంగ
ప్రయాతవృత్తము.}

1. పయోముగ్విభాభవ్యభాభాగ్విభావా । వయోభావయుగ్గోపవా
మావిభావ్యా । భయోగ్యోపమాకుంభిపాపాపభీమా । వయో
గోపవాగ్భామవాగ్భామభూమీ॥ ... ... ❋

❋ గర్భితనిరోష్ఠ్యాచలజిహ్వాస్రగ్విణీవృత్తము. ❋

2. నారదారాధనానారతాస్లాదితా । నీరదాళీలసన్నీలతేజఃశ్రితా।
సారదైత్యచ్ఛిదాచండచక్రాంచితా । శ్రీరసాలంకృతాశేషశైల
స్థితా॥ ... ... ... ❋

{హరిహరాభేదవర్ణనశ్లేషయుక్త
కావ్యలింగసీసము.}

౮౩౩॥ రమణీయకమలధారణముచే రాణించియులవినాయకసేవ నతిశయించి । హృదయంబుశోభిల్లశ్రీనివేడుకనానియబ్జశేఖరమున నందమంది । యచలశరాసనమమరసంతోషించి కలధౌతమయవాస మలరఁగాంచి । గంధగజాసురక్షణదానగతిమించి పంచాననస్ఫూర్తిఁబరిఢవిల్లి । హరుఁడుమీపనుభేదమే సరణిలేక । భూనిలోకంబులకునీశుఁడైనతండ్రి । కంటివిన్కలిదంటపేరింటిగుంటి । మదుమసెలకొన్న వేంకటనాథశరణు॥ ❋

❋ దశాద్యేకపర్యంతపదార్థసీసము. ❋

౮౩౪ ॥ శ్రీమీనకమఠపోత్రినృసింహకుబ్జభార్గవరామ బలబుద్ధకల్కులినహి । మకరకుజబుధ గురుకవిరవిజతమఃకేతు లిందాినలాిక్షనృహిగుణిప । శివసఖేశ్వరులు వసిష్ఠకౌశికజమదగ్నికశ్యపభరద్వాజగౌతమాత్రులుమధునిదాఘాభ్రశరద్ధిమశిశిరాగమములిలాకుశశుచీహరి। ఖమఃలుధర్మార్థకామమోక్షములువిధివి। ధుభవులుక్షరాక్షరములాద్యుఁడునుతుదయు ।

సత్తసత్తుసువెలిలోనుసగుణనిర్గు । ణంబులంతయునీవె కా! యంబుజాక్షు॥

❁ లయగ్రాహి. నిందుర్ఘుం పె. ❁

౮౩౫॥ పంకజతనూజహరిశంకరముఖామరవిశంకటనవీననుతిసంకలితపాదా । లంకరణజహ్నుతన యాంకమునిమానసవశంకరరణాంగణనిరంకుశపలాశా । తంకదఖగేశ బిరుదాంకకమలాకుచవిటంకయుత సంకుమదకుంకుమరసశ్రీ । పంకిలభుజాంతర మనోంకణమునందుఁగల సంకటముఁబాపఁగదె వేంకటగిరీశా॥ ... ... ❁

❁ చతురక్షరాద్యంత్యైక నియమయమకము. ❁

౮౩౬॥ క ॥ ధారాధరరుచివంశా । ధారాధరవైన తేయుధారాధరశా । ధారాధరతానిబిడసు। ధారాధరవచనసేవ్యధారాధరదా ॥ ...❁

❁ దుష్కరప్రాసము. ❁

౮౩౭॥ శా ॥ కుధ్రిద్విట్ప్రితిమల్లకర్బురవరకూర్రాసుహృత్సాయకా। గృధ్రాద్యండజరాట్ప్రిడీనగమనక్రీడాప్రియంభావుకా । లోద్రధత్విణ్ణిభకౌస్తుభాభరణవల్గుమ్లక్షువక్షుస్థలా । సధ్రిన్యసనోత్కటార్జునపటీస్ఫాయత్కిరీటాంచలా॥ ... ... ... ❁

౮౩౮॥ క ॥ ఇందీవరతనువిజితస । దిందీవరరాజరాజహితనుతవితతా । నందనిలయకనకమయా । నందనిలయమధ్యవాసనరవరవరదా ॥ ❁

❁ పంచచామరము. అపూర్వప్రయోగము. ❁

౮౩౯॥ కబంధరాశిధైర్యశౌర్యఖండితాశరస్ఫుర । త్కబంధగోత్రశత్రుపుత్రగర్వహృద్భుజాపృష। త్కబంధకృష్టలేంద్రజిద్విదాముదావహానుజా । కబంధగంధసింధురప్రకాండసింహకాండపా॥ ... ❁

❁ ద్విప్రాసము. ❁

౮౪౦॥ క ॥ విభవరమణీయహాటక । విభవసనకటీరశశిరవిభవన్నయనా । విభవావనమహిమహిమా । విభవారచితస్తుతాంఘ్రివిభవవిలాసా॥ ... ... ... ... ❁

❀ కవిరాజవిరాజితము. ❀

౮౪౧॥ త్రిభువనపావనసన్మునిభావనదీనజనావనధీరగుణా । యభ యసుధీవనమాధవజీవనదాభవనోవనజాప్తఘృణా । యిభవిభుభావన టధ్భయలావనహేత్యనుభావనగోద్ధరణా । శుభజితయావనయాశుగ దావనశోషితజీవనరాదగణా॥ ... ... ... ❀

❀ గోమూత్రికాబంధవిశేషయుక్త చక్రివాళచంపకవృత్తము. ❀

౮౪౨॥ హరిహరిభోగిభోగిశయనాశయనారజచక్రచక్రభృ । ద్ధరధ రధామధామశరదాశరదారితతారతారకా । ధరధరధారిధారివరదా వరదానవదానదానశే । ఖరఖరమారమారజనకాజనకావనిధీహరీహరీ॥

❀ దుష్కరప్రాసము. ❀

౮౪౩॥ క ॥ దేధ్మాయమానధరధర । సీధ్మలకమలాకుచాగ్రశీలితక రసా । పేధ్మహుతాశనవసలీ । లాధ్మాతపయోదదేహహరిగిరిగేహా ॥

౮౪౪॥ క ॥ హల్లకచరిష్ణుబంభర । మల్లకలితదృగ్విలాసమంజులకమ లా। ఫుల్లకమలాంఘ్రిలాక్షా। యల్లకయుతహృదయవేంకటాచలనిలయా॥

{ పాదాద్యంతాక్షరకావ్యకర్తృనామగుప్త
పూర్వకవిగుప్తగీతిసీసము. }

౮౪౫॥ వెంటాడియసురులవిదళించుదేవ వేంకటరాజితాభిదగ్రావతి లక । ఆటక్కనవేల్పుల సోక్కించు నెఱజూట శయబలాతిశయాస్తశంభు చాప । విబుధసుధాహృతివిశ్రుత నిజవీతిలావణ్యకారణలలితతిలక । స కలభక్తశ్రితసారసోదితరవిమునిజనానందకృష్ణఖ్యచరిత । వ్యాసనిగ మోక్తదశశతాహ్వయధురీణ । సమరభుజ్మానికీర్తనసారరాగ । పువ్వు దీపించువిల్లలప్రోడతాత । రావణాహితదయమమ్మ్రబబలగనుము॥ ...

❀ సర్వత్రయమకము. ❀

౮౪౬ ॥ మ ॥ వలనాంచద్ద్విజరాజగోత్రనియతిన్వ్యాపించు సత్కీర్తి యుఙ్ । కలనాదద్విజరాజగోత్రవిహృతిన్గపట్టువిఖ్యాతియుఙ్ । జ్వలనా భద్విజరాజగోత్రవినుతిస్వర్తిల్లుకారుణ్యముఙ్। గలనిన్నెన్నజియింతుమెప్ప డుభుజంగక్ష్మాధరాధీశ్వరా? ... ... ... ❀

* పైపద్యమునకర్థము. *

భుజంగత్స్మాధరాధీశ్వరా! సంబోధనము. వలన=వలనముచేత, అంచత్=ఒప్పుచుండు, ద్విజరాజ=చంద్రుని, గోత్ర=రక్షించునటువంటి, నియతిక్=నియతిచేత, వ్యాపించునట్టిసత్కీర్తియు; కల=అవ్యక్తమధురమైన, నాద=నాదముఁగలిగిన, ద్విజరాజ=గరుడునియొక్క, గోత్ర=పర్వతమందలి, విహృతిక్=విహరణముచేత, కన్పట్టు=కనుపడునట్టి, విఖ్యాతియుక్=ప్రసిద్ధియు; జ్వలన=అగ్నిహోత్రునియొక్క, ఆభ=కాంతివంటికాంతిఁగలిగిన, ద్విజరాజ=ద్విజశ్రేష్ఠులయొక్క, గోత్ర=వంశముయొక్క, వినుతి=స్తోత్రముచేత, వర్తిల్లునట్టిదయయుఁగలనిన్నేప్పుడునుగొల్చెదము. ... ... ... ... *

* భుజంగప్రయాతగర్భితస్రగ్విణీవృత్తము. *

౨౪౭॥ పావనాత్మాళిసంపత్ప్రదానాశ్రయా। దేవతానాథసందీప్తపూజోచ్ఛ్రియా। భావనామేయసద్భవ్యరూపోదయా। సేవకవ్రాతదాక్షిణ్యశీలాజయా॥ ... ... *

* గర్భితభుజంగప్రయాతవృత్తము. *

1. జయాపావనాత్మాళి సంపత్ప్రదానా । శ్రయాదేవతానాథసం
దీప్తపూజో । చ్ఛ్రియాభావనామేయసద్భవ్యరూపో । దయాసేవ
కవ్రాతదాక్షిణ్యశీలా॥ ... ... *

* మణిగణనికరవృత్తగర్భితకందము. *

౨౪౮॥ ధరణిధర భరణతతకర । సరసాశరవర విదళనచణనిశితశరా। పురహరనుతనిజ భుజబల । గరిమాఖరకరనిభవిభ గరుడగిరిపతీ॥ *

* గర్భితమణిగణనికరవృత్తము. *

1. ధరణిధర భరణతతకరసరసా । శరవరవిదళనచణనిశితశరా
పురహరనుతనిజభుజబలగరిమా। ఖరకరనిభవిభగరుడగిరిపతీ॥ *

* పాదభ్రమకకందము. *

౨౪౯॥ మానుతఘనాఘ తనుమా। యానతసుజనావభావనాజసు త

నయా। దీనఖదపాదఖనదీ। యానవిమదజయ విభావియజదమవినయా॥ ❋

❋ పైపద్యమునకర్థము. ❋

మా=లక్ష్మీదేవిచేత, నుత=స్తోత్రముఁజేయఁబడు, ఘనౌఘ=మేఘసమూహమువంటి, తను=శరీరముయొక్క,మా=సంపదఁగలవాఁడా? ఆనత=ఆనతులైన, సుజన=సుజనులను, అవ=రక్షించునట్టి, భావన=తలఁపుఁగలిగిన, అజ=బ్రహ్మదేవుని, సుతనయా=సుపుత్రుఁడుగాఁ గలవాఁడా?దీన=దీనులకు,ఖ=సుఖమును,ద=ఇచ్చువాఁడా? పాద=పాదమందుఁబుట్టిన, ఖనదీ=ఆకాశ గంగఁగలవాఁడా? యాన=వాహనమైన, వి=గరుత్మంతునియొక్క,మద=ముదమును, జయ=జయమును,వి=విశేషముగా, భావి=చేయువాఁడా? అజ=ఈశ్వరుని, ద=నమించు,మ=సంపదఁగలవాడా? వి=పరమాత్మస్వరూపమును, నయా=పొందినవాఁడా? ❋

❋ పాదగోపనకందము. ❋

౨౫౦॥ వెలలియుదారమధురదయ । నిలువుగుహాద్దత్తినలరుసీవిదుభుక్తిక।గలినిఘనదేహశౌరీ। వెలిదామరయలుఁగుదనరువిభుగనినహరీ॥❋

☞ (పైకందమునఁబ్రథమాక్షరము మొదలుగ నక్షరమువిడిచియక్షరమును మూఁడవ పాదాంతమువఱకుఁ జదివినఁ జతుర్థపాదమేర్పడును.)

{ పుష్పమాలికాబంధ,గోమూత్రికాబంధ,గుచ్ఛబంధ, హాలబంధ,ఛత్రబంధ, పంచకనిరోష్ఠ్యకందము. }

౨౫౧॥ శ్రీనకనకనయనధన। జ్ఞానకనద్యాన సానసనకనదీనా। ధ్యానజననగనటన । స్థానజనస్థానహీనజనఘనహననా॥ ... ❋

❋ పైపద్యమునకర్థము.❋

శ్రీ=లక్ష్మీదేవికి, ఇన=నాయకా? కనకనయన=హిరణ్యాక్షుని యొక్క, ధన=ధనమును, జ్ఞానమును, కనద్యాన=కనద్యానమును, సాన=నశింపఁజేయువాఁడా? సనక=సనకమునికి,నదీన=దైన్యరహితమైన,ధ్యాన=ధ్యానమును, జనన=పుట్టించువాఁడా? నగ=కాళియుఁడే,నటస్థాన-

నాట్యరంగము గాఁగలవాఁడా! జనస్థాన=జనస్థానమందలి, హీనజన=ఖ రదూషణాది హీనులను, ఘన=అధికముగా, హానసా=హింసించినవాఁ డా! (ధాతువు హింతకర్మణి.) ... ... *

{ చతుర్దళగర్భిత ద్వాదశదళపద్మబంధ, పాదుకాబంధ ద్వయమణిగణప్రవాళానుష్టుప్ శ్లోకము. }

శ్లో ౨॥ రావ దేపోవ మాధారో! రాధామాహాత్మ్యసాగరా! రాగ సాహిత్యవాజీరా । రాజీవాకార దేవరా॥ ... ... *

* పైశ్లోకమునకర్థము. *

మాధార=లక్ష్మీదేవికిఁ యాధారమైనవాఁడా! రాధామాహాత్మ్యసాగ రా=రాధయందుమాహాత్మ్యసముద్రము గలవాఁడా! రాగ=అనురాగము యొక్క, సాహిత్య=కూటమిని, వ=పొందిన, అజి=నారదునియొక్క, ఇ రా=వాక్కులుగలవాఁడా! రాజీవాకార=మత్స్యావతారమైనవాఁడా! దేవరా=దేవతవైనవాఁడా! పోవక=రక్షించుకొఱకు, రావదే=ఏల రా కున్నావు? ... ... ... *

* శంఖబంధకందము- *

క ౩॥ మరకతమణిమయమహిమత । కరమలరుతను కళకలిమికలికిస తమ్మా!యురమునుభుజగవరధరా । ధరమునునమరుహరి మదనదమననుత పదా॥ ... ... ... ... *

* రథబంధకందము. *

క ౪॥ శ్రీమీ వెంటన్గూడుక! రామకరిని కెక్కడంచిరమ్యగజేశ! గ్రా మణిగావక లేదా । నీమాయాలీలసూవెనీలనగపతీ॥ ... *

* ఖడ్గబంధకందము. *

క ౫॥సారసజాతస్తుతజయ! దారిదార్ఢ్యధీశదాసధరభరదమద! జ్యార జ్యాదసదాశర! వారావారశరచక్రవదనవిలాసా॥ ... *

* పట్టెసబంధోత్సాహవృత్తము- *

క ౬॥ తారకారసారకీర్తిధారకారమారతా । తారకావలేశసన్ను

తప్రసిద్ధిరాజితా। తారకాత్మ రావణాది దండనోగ్రధీగతా। తారకాసు
రారివంద్యదంతిరత్నణోన్నతా॥ ... ... *

## * మురజబంధవిద్యున్మాలావృత్తము- *

౮౫౩॥ వీరోదారావేదారాధ్యా। నారోదారానాదారాగా। గా
రోదానాకాదాధారా। వీరోదారావేదాధామా॥ ... *

## * పైవృత్తమునకర్థము- *

వీర=వీరులయందు, ఉదారా=దాతయైనవాఁడా? వేద=వేదముల
చేత, ఆరాధ్యా=ఆరాధింపఁదగినవాఁడా; నార=నరసమూహమందు,
ఉదార=శ్రేష్ఠమైనవాఁడా ? నాద=ధ్వనియొక్క, అర=అతిశయముగ
లిఁగిన, అగ=పర్వతమందు, అగార=ఇండ్లను, అ=గౌరవముగ, దాన=
ఇచ్చేవాఁడా ? కాద=ఆదిశేషుఁడే, ఆధార=ఆధారముగాఁగలవాఁడా?
వి=విశేషమైన, ఇరా=భూమియనే, దార=భార్యను, ఆవేద=తెలిపె
డు, ఆధామ=తేజస్సుగలవాఁడా? (నిఘంటుప్రయోగములు.) ఉదారో
దాతృమహ్తతః॥అమరము॥ శైలవృక్షౌనగావగౌ॥అమరము.॥ అంగణంచ
త్వరాజిరే॥అమరము.॥ అకారోబ్రహ్మవిష్ణీశకమఠేష్వంగణేరణే। గౌర
వేంతః పురేహితా। భూషణేంఘ్రీవు మేజ్యయోః ॥నానా॥ ఇరాభూ
వాక్సురాప్వప్స్యాత్ ॥ అమరము.॥ గృహేగేహేత్పిట్ప్రిభావాధామసీం॥
అమరము॥ ... ... ... *

## * త్రిశూలబంధపంచచామరము. *

౮౫౪॥ సతీపతీరసారసాను సారకాఘనాయతా। నతాయనాఘకా
రకాఘనాయతానదానసూ। తతాజయాజ తాతసూనదామధారతా
రకా। రతారధామదాసదాజకాధిరాజదాసదా॥ ... *

## * పైపంచచామరమునకర్థము. *

సతీపతీ=పార్వతీపతియైనయీశ్వరునియొక్క, ఇర=వాక్కులవంటి
వాక్కులుగలవాఁడా?సారస=సరససమూహమును, అనుసారకా=అను
సరించువాఁడా? ఘన=నిరంతరమైన, ఆయత=విస్తృతమైన, అనత=న

ము౹లుగాని శత్రు౹వులయొక్క, అయన=మార్గమునందు, అఘ=దుఃఖమును, కారకా=చేయువాఁడా! ఘన=ఘనులకు, అయ=శుభావహవిధిని, తాన=విస్తరించునట్టి, దాన=దానముఁగలవాఁడా!సూతతా=సారథ్యముచేత, జయ=జయముగల, అజ=బ్రహ్మకు,తాత=జనకుఁడైనవాఁడా! సూనదామ=పుష్పమాలికను, ధార=ధరించినవాఁడా? తారకా=తారక బ్రహ్మరూపమైనవాఁడా? రత=క్రీడచేత, అర=అధికమైన,.ధామ=గృహమును, దా=ఇచ్చువాఁడా? సదా=ఎల్లప్పుడు, అజర=దేవతలకు, అధిరాజ=కర్తయగు యింద్రునియొక్క, దాస=క్షీణమును, దా=ఖండించువాఁడా? ఈవృత్తమందలి, దాస-దాన-ద- తానఅనుశబ్దములకు ధాతువులు. తసురవక్షయే- దసుచ.దాస-దో- అవఖండనే, దాన- దదదానే.తనువిస్తారే.తాన॥ ... ... ... ✽

✽ ఛత్రబంధకందము. ✽

కం॥ సారకరధీరవరదా । తారావీనపనవీనతతపరిపరిప । ఝారూఢాగోరాధీ । ధీరాగోపతిదరవరధీరాకరసా॥ ... ✽

✽ పైకందమునకర్థము. ✽

సార=శ్రేష్ఠమైన, కర=కానుకఁగలవాఁడా? ధీర=విద్వాంసులకు, వర=వరములను, దా=ఇచ్చువాఁడా? తార=రజితమైన, అవీన=శైలరాజమును, ప=పాలించుహరునియందు, నవీన=నూతనమైన, తత=విస్తృతమైన, పరిపరి=నానావిధములైన, పఝ=స్నేహమును, ఆరూఢా=వహించినవాఁడా? గో=రత్నములను, రా=స్వీకరించెడు, ధీ=బుద్ధిని, ధి=ధరించునట్టి, ఇరా=భూమిఁగలవాఁడా? గోపతి=ఆవులఁబాలించువాఁడా? దరవర=శంఖశ్రేష్ఠముఁగలవాఁడా? ధీర=ధీరులకు, ఆకర=ఉనికియైన, సా=శరీరముఁగలవాఁడా? (నిఘంటుప్రయోగములు.)సారోబలేస్థిరాంశేస్యాత్ ।పుమాన్ న్యాయేవరేత్రిషు । క్లీబమంబుని॥నానా॥

☞ (పైనుదహరించిన పదునాఱుబంధముల నిదివఱకుఁ దెనుఁగుప్రబంధకర్తలెవ్వరు నుడివినవారుకారుగానవీనినిఁటవింతగఁబొందుపఱచినాను.)

